సంపుటి : 5

# చతుర

సంచిక : 8

సెప్టెంబర్ 1982

## ఈ నెల సమగ్ర నవల

బతుకుతెరువును వెతుక్కుంటూ ఉన్న ఊరు వదలి పారిపోయి వచ్చాడా కుర్రవాడు. నిజాయితీతో నలుగుర్నీ ఆకట్టుకుని కొత్త జీవితం ప్రారంభించాడాఊళ్ళో. తన కాళ్ళమీద తాను నిలబడి, ప్రేమించాననుకుంటూన్న పిల్లని పెళ్ళాడి స్థిరపడదామనుకుంటూండగా క్షణికావేశంలో చేసిన 'తప్పు'తో అంతా తారుమారైంది. అందుకు ఫలంగా ఓ దౌర్భాగ్యుడి చేతిలో కీలుబొమ్మగా మారిపోవాల్సి వచ్చింది. గుండెలమీది కుంపటిలా మారిన అతగాడి బారినుండి బయటపడలేక కోరుకుంటున్న పిల్లనే దూరం చేసుకోవాల్సి వచ్చింది. చివరికి ఆ పాపమార్గం వదిలి...



# మరోదారి

కోసం వెతకబోయిన అతనికి కనుపించిన బాట ఎటువంటిది? చూపిందెవరు? చివరకు చేసిందేమిటి? ఏ వెలుగులో అతనా మార్గంకేసి పయనించబూనుకున్నాడు?

శివల జగన్నాథరావు

కలంనుండి జాలువారిన కరుణామయగాథ ఈ నెల చతుర సమగ్ర నవల "మరోదారి"

## కవర్ పేజీ వివరాలు

ముఖ చిత్రం : పి. ఇలంగో
రెండవ కవరు : యల్. ఆర్. గ్రోవర్
మూడవ కవరు : సూరజ్ యన్. శర్మ
నవల బొమ్మలు : ఆనంద్ ఎ.వి.బి.యస్.

# రచయితలకు సూచనలు

* జాతి జీవిత చిత్రాన్ని ప్రతిబింబించే సమగ్ర నవలలను 'చతుర' ఆహ్వానిస్తున్నది. నవల 'చతుర'లో అచ్చులో 100 పేజీలకు సరిపడేదిగా ఉండాలి. 'చతుర'లో అచ్చులో పేజీకి సుమారుగా 260 పదాలు వస్తుంటాయి. ఈ లెక్క ప్రకారం సరిచూసుకున్న తర్వాతనే రచనలు పంపడం మంచిది.
* ప్రస్తుతం వివిధ మాసపత్రికలు వెలువరిస్తున్న 100 - 112 పేజీల పాకెట్ సైజు నవలానుబంధాలలో ప్రచురితమవుతూన్న నవలికలు చతురలో అచ్చులో 60-70 పేజీలు మాత్రమే అవుతాయి. రచయితలు ఈ తేడా గమనించాలి.
* *పై పరిమితులను దృష్టిలో ఉంచుకుని 'చతుర' కొరకై ప్రత్యేకంగా వ్రాసి పంపిన నవలలు మాత్రమే పరిశీలింపబడుతాయి.*
* నవలను ప్రచురించే సమయంలో అవసరాన్ని బట్టి కొంత కుదించవలసి వచ్చేపక్షంలో అందుకు అభ్యంతరం లేనివారే నవలలను పంపాలి.
* అనువాద నవలలు పంపదలిచేవారు మూల రచయిత నుండి ముందే అనుమతి తీసుకుని అనుమతి పత్రంతో సహా నవల పంపాలి.
* ప్రచురణకై ఎన్నిక కాని నవలలను తిప్పి పంపేందుకై నవలతో పాటే తగు పోస్టేజీ తప్పనిసరిగా జతపరచాలి. అలా జతపరచని పక్షంలోనూ, నవలలు పోస్టులోగానీ, ఇతర్రతాగానీ పోయినా మా బాధ్యత ఉండదు. తర్వాత ఉత్తరాలు వ్రాయటం వల్ల ప్రయోజనం ఉండదు.
* 'చతుర'లో ప్రచురించే నవలలకు పారితోషికం రచననుబట్టి రు.1,000 నుండి రు. 2,000 వరకూ ఉండగలదు. ఈ విషయంలో సంపాదకులదే తుది నిర్ణయం.

**చతుర**

*ఈనాడు కాంపౌండ్, హైదరాబాద్ - 500 004.*

స్త్రీజీవితంలో
ఎంతో అందమైన క్షణాలలో
ఒకభాగం ఖటావ్

ఖటావ్‌వారి టెర్కోసా చీరలు



Rediffusion/K/1619g/

# విచిత్ర ప్రపంచం

## మాతృప్రేమ

అమెరికా దేశస్తుడైన విలియమ్ కిర్డి భూసంబంధమైన పరిశోధనలు నిర్వహిస్తుంటాడు. ఈపనిమీద వివిధ ప్రదేశాలు చుట్టి రావల్సివుంటుంది. ఓసారి ఆ పనిమీదే హడ్సన్‌బేకి వెళ్లి పనయ్యాక తిరిగివస్తున్నాడు. దార్లో అతనికి రక్తశిక్త శరీరంతో, గాయాలతో, నిస్త్రాణగా పడివున్న ఒక స్త్రీ కన్పించింది. వెంటనే బండి



ఆపించి ఆమె గాయాలకు కట్టుకట్టించాడు. అతని సంరక్షణలో ఆమె కాస్త తేరు కున్నది. అప్పుడు విలియమ్ నెమ్మదిగా ఆమెను వివరాలు అడిగాడు.

ఆ స్త్రీ అక్కడికి వందలమైళ్ళ దూరంలోవున్న ఒక తెగకు చెందినది. ఆ తెగ మరోతెగతో యుద్ధానికి దిగినందున అక్కడ వుండలేక చాలామంది వేరే ప్రదేశాలకు వలసపోయారు. ఆమెకూడా అలాగే పసివాడైన కొడుకుని తీసుకుని కొందరితో బయల్దేరింది. ప్రయాణంలో ఆమె అలసిపోయి నడవలేనిస్థితిలో వెనక వుండిపోక తప్పలేదు. ఆమెతో బయల్దేరిన వారందరూ ముందుకి వెళ్ళిపోయారు.

"మరి నీ శరీరంమీద గాయాలు యుద్ధంలో అయినవేనా?" అనడిగాడు విలియమ్. "కాదు బాబూ! ఆగాయాలు నేను స్వయంగా చేసుకున్నవే. మీరొచ్చే ముందే నా చేతులమీది చర్మంతీసి ఇదిగో ఈ చేపల గాలానికున్న కొక్కానికి పెట్టాను" అని గేలంతీసి చూపిందామె.

విలియమ్ స్తబ్ధుడైపోయాడు. అతనికేమీ అర్థం కాలేదు. ఆమె క్షణం ఆగి "గత మూడురోజులనుంచి నేను ఆకలితో మాడుతున్నాను. నా బిడ్డకి ఒక్కపాల చుక్కలేకుండా ఎండిపోయింది నా రొమ్ము. నా బిడ్డ చనిపోయే స్థితిలో వున్నాడు. నేనేం చేయగలను. అందుకే శరీరంనుండి కొంత మాంసం తీసి చేపల గాలానికి పెట్టి చేపల్ని పడదామనుకున్నాను. చేపల్ని తింటేనన్నా నా బాబుకి మళ్ళీపాలు ఇచ్చుకోగలను కదా. అందుకే అలా చేశాను" అంది ఆమె. ఆ కథవిని విలియమ్ చలించిపోయాడు. తల్లిప్రేమకు సాటిరాగలది లేదుకదా ఈ ప్రపంచంలో.

## మరో విక్రమార్కుడు

భేతాళ కథల్లో విక్రమార్కుడు మౌనభంగమై శవం మాయం కాగానే తిరిగి పట్టు వదలకుండా స్మశానానికి వెళ్ళి




మళ్ళీ శవాన్ని భుజాన వేసుకొని మళ్ళీ బయల్దేరతాడు. చిట్టచివరికి ఎలాగైతేనేం అనుకున్నది సాధించాడు. "హిస్టరీ ఆఫ్ ది ఫ్రెంచ్ రివల్యూషన్" గ్రంథ

రచయిత థామస్ ఛార్లీ కూడా ఇలాంటి పట్టువదలని విక్రమార్కుడే. థామస్ తను రచించిన గ్రంథాన్ని కొన్ని సూచనల నిమిత్తం జాన్ స్టూవర్ట్ మిల్‌కి ఇచ్చాడు.

ఓ రోజు ఉదయాన్నే తలుపు చప్పుడవడంతో థామస్ తలుపు తెరిచి గుమ్మంలో నిల్చున్న జాన్‌స్టూవర్ట్‌మిల్‌ను సాదరంగా లోపలికాహ్వానించాడు. తన గ్రంథం గురించి అభిప్రాయం చెపుతాడని ఎదురుచూస్తున్న థామస్‌కి స్టూవర్ట్ మిల్ ఎంతో బాధగా అతని గ్రంథాన్ని తన పనిమనిషి పొయ్యి రాజెయ్యడానికి వాడిందని, ఫలితంగా అది మొత్తం బూడిదై పోయిందని తెలిజేయటంతో నెత్తిమీద పిడుగు పడినట్లయింది. తల గిర్రున తిరిగిపోయింది. ఎన్నో ఏళ్లుగా గర్భ దారిద్ర్యంతో పోరాడుతూ కూడా ఎంతో శ్రమకోర్చి రాసిన గ్రంథమది. జీవితాంతం పడిన శ్రమ క్షణంలో బూడిదై పోయింది. ఆ గ్రంథాన్ని పూర్తిచేసిన సంతోషంతో చిత్తుప్రతిని చింపి పారేశాడు కూడా.

ఈ సంఘటనతో థామస్‌లో ఉత్సాహమంతా నశించిపోయింది. ఇకపై ఏమీ రాయలేనంత నిరాశలో మునిగిపోయాడు. కొన్ని రోజుల తర్వాత థామస్ ఓ గదిలో కూర్చొని కిటికీలోంచి వీధిలోకి చూస్తున్నాడు. కొంచెం దూరంలో ఒక భవనం నిర్మాణంలో ఉంది. పనివాళ్లు ఒక్కో ఇటుకా పేరుస్తూ గోడలు కడుతున్నారు. ఇటుకపైన ఇటుక, వరుసపైన వరుసా అలా నెమ్మదిగా గోడ పూర్తవుతోంది. ఆ దృశ్యం థామస్‌లో తిరిగి ఆశను చిగురింపజేసింది. వెంటనే అతను లేచి కలం పట్టుకొని అంతకుముందు తను రాసిన గ్రంథంలోని పదం తర్వాత పదం, వాక్యం తర్వాత వాక్యం నెమ్మదిగా గుర్తు తెచ్చుకుని కాగితం మీద రాసుకున్నాడు. అలా తను రాసిందంతా గుర్తుకు తెచ్చుకొనిరాసి తిరిగి గ్రంథానికి పునర్జీవాన్నిచ్చాడు. ఈ గ్రంథమే తర్వాత అతనికి ప్రపంచ సాహిత్యంలో స్థానాన్ని కల్పించింది.

# ఘరానా దొంగలు

అరవైనాలుగు కళల్లోనూ ఒకటైన చోర కళకు కూడా కొద్దోగొప్పో ప్రాముఖ్యత వుంది. దొంగలు నగానట్రా తస్కరించి నష్టం కలిగించడమే కాదు ఒకోసారి హాస్యం కూడా సృష్టిస్తుంటారు.

ఓసారి గ్లొసెస్టర్‌షైర్‌లోని ఒక ఇంట్లో ప్రవేశించిన దొంగ రాత్రంతా కష్టపడి ఇనప్పెట్టె తెరవడానికి ప్రయత్నించాడు. తెల్లవారుతుండగా ఇనప్పెట్టెకి అసలు తాళమే వేసిలేదని తెలిసి వచ్చింది. తలుపు తీసి చూస్తే లోపల కనీసం చిత్తు కాగితం కూడా లేదు పాపం. మరోసారి అప్పుడప్పుడే దొంగతనం నేర్చుకుంటున్న ఓ ఇనప్పెట్టెల దొంగ సుత్తి చేతపట్టి హుషారుగా ఒక షాపు గోడ బద్దలుకొట్టి లోపలికి ప్రవేశించబోయాడు. అయితే ఆ సుత్తికున్న తల వదులై ఎగిరి దొంగ నెత్తిన పడింది. అంతే పోలీసులొచ్చి ఉపచారాలు చేసేవరకూ ఆ దొంగకి స్పృహ రాలేదు.

వెస్ట్ జర్మనీలోని ఒక్క సూపర్ మార్కెట్‌ను దోచుకుందామని ఉత్సాహపడిన ఒక దొంగలముఠా 27 గంటలు కష్టపడి గోడలో బిగించివున్న ఇనప్పెట్టెనొకదాన్ని ఊడబెరికి వేన్‌లోకి ఎక్కిం





# మీ పాపాయికి అప్పుడే 3 నెలలు నిండాయా?

**అయితే ఇక మీద కేవలం పాలే**
**మీ పాపాయికి కావలసిన ఐరన్ సమకూర్చలేవు.**



## అతడికి పుష్కలంగా ఐరన్ కల ఫారెక్స్ ఇవ్వండి

"తల్లి నుంచి పెద్ద ఐరన్ నిల్వతో సహా పుడతాడు పాపాయి. అయితే పుట్టిన తర్వాత ఈ నిల్వ క్రమేపీ తరిగిపోతుంది. పాలు మంచి ఆహారమే అయినప్పటికీ, ఐరన్ లేనందువల్ల అది సంపూర్ణ ఆహారం కాదు. అందుకే పాపాయికి ఐరన్ గల ఆహారాలు కావాలి."

డాక్టర్. సుభాష్ సి. ఆర్య:




**డాక్టర్లు సిఫార్సు చేస్తారు**

# ఫారెక్స్

CASGLF-32-182 TEL

చారు. అయితే దార్లో పోలీసులు ఓవర్ లోడ్ చేశారనే అనుమానం మీద ఆ వేనును ఆపి వెతికినపుడు ఇనప్పెట్టె బయట పడింది. తీరా దాన్ని తెరచి చూస్తే చేప ముక్కలున్న ఒక టిన్ను తప్ప మరేమీ లేదు అందులో. ఇంకోసారి ఇద్దరు దొంగలు గేరేజిలో వున్న కారుని దొంగిలిద్దామనుకున్నారు. ఇగ్నిషన్‌కీ కూడా కారుకే వుంది. ఎగిరి గంతేసి కారు స్టార్టు చేశారు. ఎంత ప్రయ



త్నించినా కారు కదల్లేదు. సరే స్టార్టింగ్ ట్రబులు కాబోలనుకొని దాన్ని తోసు కుంటూపోయారు. ఓ మైలు దూరంపోగానే వాళ్ళను పోలీసులు పట్టుకున్నారు. తీరా ఆ కారు బానెట్ తెరచిచూస్తే... అందులో అసలు ఇంజనే లేదు.

మరోసారి లండన్‌లో కొందరు 'గిన్' మద్యం సీసాలున్న లారీని అపహరించి ఓ రెండు మైళ్ళవతల వదిలేసి వెళ్ళిపోయారు. కారణం మరేమీ లేదు. వాళ్లు దార్లో లారీ ఆపి చుక్కేసు కుందామని చూస్తే ఆ లారీలో ఉన్న పదివేల సీసాలూ ఖాళీగానే దర్శన మిచ్చాయి. మరో దొంగ చెప్పులున్న వేనొకటి దొంగిలించుకు వెళ్ళి, తీరా అవి అన్నీ ఎడమ కాలివేనని తెలిశాక వదిలేసి వెళ్ళిపోయాడు.

న్యూయార్క్‌లో ఒక దొంగ వున్నాడు. ఇతను చేతుల్లోని పర్సుల్లాంటి వస్తువులు, మెళ్ళోని గొలుసులు లాక్కొని క్షణంలో పారిపోవడంలో నిపుణుడు. అతగాడు ఓ రోజు ఓ స్టేడియం దగ్గర కాపువేశాడు. కొంతసేపటికి అక్కడికి ఒక కారు వచ్చి ఆగింది. అందులోంచి ఆడ పటాలం బిలబిల్లమంటూ దిగింది. ఆహా ఏమి నా అదృష్టమని సంబరపడి తన హస్తలాఘవం ప్రదర్శించాడు. అయితే వాళ్ళ పర్సులు లాక్కొని పారి పోతున్నప్పుడుగాని అతనికి తన పొర పాటు తెలిసిరాలేదు. ఆ స్త్రీలు వంద గజాల పరుగులో నిపుణులు కావడంతో దొంగ వెంటబడి పట్టుకొని పోలీసులకు అప్పజెప్పారు. అలా దొంగలు కూడా ఒకోసారి గ్రహపాటునో, పొరపాటునో నవ్వుల పాలవుతుంటారు పాపం...!

# త్యాగధనుడు

ప్రపంచంలో రకరకాల మనుషులు. కొందరు తమకోసమే బతికేవారు. మరి కొందరు తమసుఖంతోపాటు పరుల సుఖం కూడా చూసేవారు. ఇంకా కొందరు ఇతరుల సుఖంలోనే సంతృప్తిని, ఆనందాన్ని వెతుక్కునేవారు. చివరివర్గం వారిని అందరూ ఆకాశానికి ఎత్తేస్తారు. ఒకోసారి ఇలాంటి మహానుభావులు కూడా అపహాస్యానికి, నిందకి గురికాక తప్పదు



వీరి పని మంచికిపోతే చెడు ఎదురయినట్లు అవుతుంది.

మర్సెల్లీస్ అనే ఊళ్లో వృద్ధుడైన గుయెట్ పని ఇలాగే అయింది. ఇతను ఎంతో కష్టపడి పనిచేసి సంపాదనసంతా కూడబెట్టాడు. అతను జీవితకాలంలో తిండికి, బట్టకు ఖర్చుచేసింది అతి స్వల్పం. అందుకే ఊరివాళ్ళతన్ని పీనాసి వాడని ఈసడించేవారు. గుయెట్ వీధిలో పోతుంటే గట్టిగా అరచి హేళన చేసే వారుకూడా. మగపిల్లలు తరచూ అతని మీదకి రాళ్లువిసిరి ఏడ్పించేవారు. అయినా అతను ఏనాడూ ఎవర్నీ పల్లెత్తుమాట అనలేదు. వారి అవహేళనను మౌనంగా భరించేవాడు.

చివరికి ఓ రోజు గుయెట్ మరణించాడు. అతని మరణానంతరంగాని అతను ఎంతటి మహోన్నత వ్యక్తో ఆవూరి ప్రజలకు తెలిసిరాలేదు. అతను తన ఆస్తి సంతా ఎలా సద్వినియోగ పరచాలో విల్లులో రాసి పెట్టాడు. అందులో "మర్సెల్లీస్‌లోని పేదలకి నా చిన్నతనంనుంచి కూడా సరిగా నీళ్ళు అందడంలేదు. వాళ్లు నీళ్ళను చాలా ఎక్కువ ధర పెట్టి కొనుక్కోవలసివస్తోంది. అందుకే వారికి మంచి నీటి సౌకర్యం కల్పించడం కోసం నా జీవితమంతా సంతోషంగా కష్టపడి పని చేశాను.నా ఆస్తి మొత్తాన్ని వారి సౌకర్యం కోసం కాలవ తవ్వడానికిగాను ఉపయోగించవలసింది" అని వుంది. ఇది చదవగానే బతికివున్నపుడు అతన్ని హేళన చేసిన పెద్దమనుషుల తలలు సిగ్గుతో వాలిపోయాయి – అంతటి త్యాగమూర్తిని పిసినారని ముద్ర వేసినందుకు. *



బోత్తిగా ఖాళీ లేని మనిషిలా, మహా రద్దీగా వుంది రోడ్డు. వాహనాలు పోటీ వేసుకు పోతున్నాయి. అవి లేపే ధూళిలో నడిచే మనుషులు నాజూగ్గా ముక్కులు మూసుకు పోతున్నారు. జంక్షను కటూయిటూ షాపుల్లోంచీ కిళ్ళీ బడ్డీల్లోంచీ, హోటల్లోంచీ మాటలూ పాటలూ, చప్పుళ్ళూ...

అంతా కలగాపులగంగా వుందా సమయంలో.

ఆకాశం పందిరికింద పెళ్ళిమంట పంలా వుంది రోడ్డు.

అంతటా సందడీ, హడావుడీ...!

ఆ సందట్లో, హడావుడిలో, రద్దీలో ఆ మెయిను రోడ్డుకి ఒక వార్న నిలబడి చూపుల్ని కలయ తిప్పుతున్నాడు ఓ పదహారేళ్ళ కుర్రాడు.

అతని తల సంస్కారం అంటే ఏమిటో ఎరగనన్నట్టుంది. అతని ముఖం 'కళ' ఎక్కడుందో వెతుకు చూద్దాం అని సవాలు చేస్తున్నట్టుంది. ఒంటిమీద చిరుగుల చొక్కా, మాసిన నిక్కరూ మాసిపోయిన అతని గత జీవితానికి సంకేతాల్లా నిలిచి వున్నాయి. ఒంటిమీద అక్కడక్కడా గాయాలు.

కడుపులో ఆకలి, ఒట్లో నీరసం నిల్చునే సహనాన్ని చంపుతున్నాయి.

అయినప్పటికీ అతన్నిలుచున్నాడు. ఎక్కడ కూచుంటాడు? అతనికి ఈ రద్దీ చూస్తుంటే ఆశ్చర్యంగా లేకపోయినా, కంగారుగా వుంది. ఏదో గంద్రగోళంగా వున్నట్టుంది. భయంగా కూడా వుంది!

ఇక్కడికి వచ్చేశాడు తను! ఇంక తిరిగి వెళ్లలేడు!

అవును! తిరిగి వెళ్లడం తనవల్ల కాదు!

ఆలోచిస్తూ అటూ ఇటూ చూడ సాగాడు.

సాయంత్రం ఆరు గంటలు.

ఇంకా వెలుగుంది.

"నీకింకా వయసుందెంతో! నువ్వెళ్ళిపో! ఇక్కడుండకు! ఎళ్ళిపోతే ఎక్కడేనా, ఎలాగేనా సుకపడతావు!"

అని తన ఊరోళ్ళు కొంతమంది తనతో చెప్పడం మనసులో మెదిలింది. 'అందుకే గదా ఇలా పారొచ్చేసేను' అను కున్నాడా కుర్రాడు ఆకలి కడుపును తడువుకుంటూ.

ఆ పక్కనే ఉన్న హోటల్లో సర్వరు ఎవరో ఆసామీతో "దోశ, వడా, పూతప్పం, పెసరట్టు...!" అంటూ పెద్ద గొంతుతో చిన్నపిల్లాడు ఎక్కం వల్లించి నట్టు చెబుతున్నాడు.

నాలికతో పెదాలు తడుపుకుని, గుటకలుమింగి, అక్కడికి వెళ్ళి నిలబడి "అయ్యా!" అని పిలిచాడు కుర్రాడు.

సర్వరూ, ఆ హోటలు యజమానీ ఈ కుర్రాడిని కిందా మీదా చూసి— "పో! పో!" అన్నారు కసురుతూ.

అతను వులిక్కిపడ్డాడు. ఒక్క క్షణం మనసుకి చీమకుట్టింది.

ఆ తరువాత ఆ పక్కన ఉన్న ఇళ్ళ వైపు నడిచాడు. రెండిళ్ళకి గేట్లు మూసేసి వున్నాయి. ఎక్కడా అలికిడేలేదు! ఇంకో ఇంట్లోంచి పెద్ద కుక్క మొరుగుతూ వచ్చింది. 'ఎవర్నువ్వు?' జాగ్రత! కరిచీగల్ను మళ్ళా పిలిచేవంటే' అంటున్నట్టుందది. రెండంగల్లో రోడ్డు మీదికి చేరుకున్నాడు.

ఇంకేవేవో షాపులున్నాయా పక్కన. ఓ షాపతను ఎవరో అడుక్కునోడికి ధరమం చేస్తున్నాడు! అక్కడికి

 

వెడదామనుకున్నాడు. రోడ్డు దాటాలి! రద్దీ కొంచెం అటూ ఇటూ ఉండడాన్ని చూసి జాగ్రత్తగా నడిచాడు. ఆ కారేదో అల్లంతదూరాన్నుండగానే రోడ్డుదాటేయాలనుకున్నాడుగానీ, ఈ పక్కనించీ వచ్చే ఓ సైకిల్ని కానుకోలేకపోయాడు.

సైకిలతను గాభరాపడిపోయి డేష్ ఇచ్చేడు.

ఆ వూపుకి పోయి పేవ్‌మెంటుమీద పడ్డాడు. కాళ్ళు, చేతులు అక్కడక్కడా చెక్కుకుపోయి బాధతో మూలుగుతున్న తన్ని నలుగురూ మూగి, పట్టుకు లేవదీశారు. ఎవరో సోడాకాయి తెచ్చి తాగించారు.

"ఎక్కడినించివొచ్చేవు?"అనడిగారు.

"ఈవూరుకాదు." అన్నాడు సోడా నీళ్ళుపడిన తడి చొక్కాతో మొహాన్ని తుడుచుకుంటూ.

"మొకం సూడంగానే తెలుస్తోందిలే! అయితే ఏ వూరుమన్ది?"

"అనకాపిల్లికాడ...పల్లె..."

"బైతుబాబువి గనకే వొసానే డింకి కొట్టేసినావు! జాగ్రత్త! అక్కడోడివి ఇక్కడికెందుకొచ్చావు?"

"పడ్డానికి" ఎవడో అంటే, వాళ్ళంతా ఆ రోడు అదిరేలా నవ్వారు.

"మీవూరు నచ్చలేదేంటి గురూ?"

"అదిగాదు..."

"ఏయ్! ఆగండెయ్! ఇదిగో కుర్రాడా ఇలా!"

ఆ పిలిచినతని దగ్గరికి వెళ్ళాడు.

అప్పటికే చుట్టూ మూగినవాళ్ళు ఒక్కొక్కరే వెళ్ళిపోవడం మొదలెట్టారు. ఆ పక్కన కిళ్ళీబడ్డీవాడొకాయన, మిషను కుట్టువాడొకతనూ, లాండ్రీకొట్టతనూ, సైకిలుషాపతనూ, చెప్పులు కుట్టేవాడూ— వాళ్ళంతా ఆ జంక్షనులోవాళ్ళే.

"ఇంద! నీళ్ళతో మొకం కడుక్కో!" అంటూ అతను చెంబుతో నీళ్ళిస్తే, మొహం కడుక్కొని, చొక్కా ఎత్తి తుడుచుకున్నాడు. ఆ తర్వాత నూనె తీసుకు వచ్చి, "ఇంద! దెబ్బలికి పూసుకో! చెయ్యిపట్టు" అని అరిచేతిలో వేస్తే, ఒంటి మీద దెబ్బలకి పూసుకున్నాడు. వాటి మంట కొంచెం తగ్గినట్టయింది.

"అయితే ఈ వూరెందుకొచ్చేనంటావు?" అన్నాడతను — మంగలి షాపులోకి వెళ్ళి నూనిసీసాపెట్టి తిరిగి వచ్చాక.

"మావూర్లో దిక్కూ మొక్కూ నేకపోతే..."

"అమ్మా, అబ్బా ఎవురూనేరా?"

తల అడ్డంగా తిప్పాడు.

"అయితే...?"

"అత్తున్నాది. మేనత్త. దానికి నానంటే పడదు. ఇంత పిసరు తిండి పెడతాదిగానీ, ఎంత పెద్ద దెబ్బలయినా కాయాలి! మామ మంచోడేగానీ, అతంటే బయ్యెం! దెబ్బలినీ తినీ నాకు పేనం సాలొచ్చేది. సచ్చిపోదామనుకుంటే మా వూరోళ్లు నన్ను వూరొదిలేసి పొమ్మన్నారు. ఎక్కడున్నా సుకంగుంటావన్నారు. వొచ్చేసేను......"

"రాడానికి డబ్బులు?"

"మా వూరోళ్ళే కాస్త కాస్త ఇస్తే బస్సెక్కేసేను..."

"పట్నం ఎళ్తే తిండి దొరుకుద్దనా మీవూరోళ్ళ సలహా?"

"సిత్తం...అత్త దెబ్బలుండవనీనూ"

గొల్లుమని నవ్వాడు.

"నీపేరేంట్రా?"

# య తోడుగా ఉంటే చాలు...
# మరింత సంతృప్తి!




కొనేవేళ పక్కన 'ప్రియ' ఉంటే
ం రుచులమయం. అదే 'ప్రియ'
హస్యం. నోరూరించే పలురకాల
మీరు కావలసింది ఎన్నుకోండి.

నూ, వెల్లుల్లి లేకుండానూ 300,
0 గ్రాముల సీసాల్లో దొరుకుతాయి.
డికాయ * నిమ్మకాయ * టొమాటో
ంగూర * ఉసిరికాయ * చింతకాయ
* పండు మిరపకాయ * వంకాయ
పిరకాలు : * మామిడికాయ * అల్లం

ది... ఎంతో రుచి... ప్రియ

ప్రియ ఫుడ్స్
ప్రైవేట్

Marketed by
MARGADARSI
MARKETING
PRIVATE LIMITED
Eenadu Compound

"ఈరేశు...గాని బాబూ! ఆకలి గుంది"

ఆ ఆసామీ నారాయణ తన అసిస్టెంటు అప్పన్నతో హోటలుకి ఈ కుర్రాడిని తీసుకుపోయి ఇంత టిఫినూ, టీ యిప్పించమని చెప్పి డబ్బులిచ్చి పంపించాడు.

రెండు దోశెలు తిని, టీ తాగితే కడుపు సర్దుకుంది. ప్రాణం నిలబడి నట్టయింది. నిబ్బరంగా మోసే అడుగులతో హోటల్లోంచి వచ్చాడు.

నారాయణ దగ్గిరికి తీసుకెళ్ళాడు అప్పన్న.

"ఎక్కడుంటావిర్రేత్రికి?"

అవునెక్కడ తొంగుంటాడు? బుర్ర గోక్కున్నాడు. పిర్ర గోక్కున్నాడు వీరేశు.

"ఏటలా సూస్తావు? వుత్త ఎర్రోళ్ళా వున్నావు! నీఈడు గుంటనాకొడుకులిక్కడ రాలిపడిపోతుంటారు! అళ్ళాకాశాన్నంటే సుక్కలుండవు. భూమ్మీదుంటే పంటలుండవ్! సూడు - మేం షాపు ఇంకో గంటలో కట్టేస్తాం! అందాకా ఆ బెంచీ మీద కూచో. తరవాత నాతో ఒద్దువుగాని. మా ఇంటికి"

దండం పెట్టాడు కృతజ్ఞతగా.

నారాయణ నవ్వాడు.

"ఇదిగో ఒరే! దండం పెడితే పెట్టేవ్ గానీ...దగా చెయ్యక ఆ చేతుల్తో"

వులిక్కిపడ్డాడు.

"బాబూ! అలగనొద్దు"

కాళ్ళ మీద పడబోతే, పట్టుకు లేపదీసేడు నారాయణ.

"సూడు! నమ్మకంగుండాలి. అలా గుంటేనే నాకు నువ్వు అవసరం అవుతావు"

'ఏటిసెయ్యాల?' అన్నట్టు చూశాడు.

"షాపులీమధ్యన దొంగలుపడి ఏది పడితే అదెత్తుకుపోతున్నారు! నాకిక్కడ పడుకుంది కవదు. నాకాడ పనిచేసే వోళ్ళకీ ఆవదు! సంసారాలుంటే ఇలా ఒంటిగా తొంగోడం కుదరదుగద? చూడు ఆ కుర్చీలుగానీ, ఆ రేడియోగానీ, ఏదెత్తుకుపోయినా బోలెడ్డబ్బుపోసి మళ్ళా కొనుక్కోవాలగదా?"

"సిత్తం!"

"నీకయితే ఎవరూ లేరుగనక ఒక్కడివీ ఈ షాపులో పడుకోవొచ్చు! ఏవంటావు? అలా చేస్తే నాకు కాస్త నిబ్బరంగా వుంటాది. ఇంతకీ నువ్వు నమ్మకంగ వుపిస్తున్నావుకాబట్టిచెప్పేను"

"నన్ను నమ్మండి! నాను దగాకోరుని కాను. నాను సెప్పిందంతా నిజం..." అని కళ్ళు తుడుచుకున్నాడు వీరేశు.

ఆ రాత్రి నారాయణ ఇంటి దగ్గర అన్నం తిని, వాళ్ళ అరుగు మీద పడుకున్నాడు వీరేశు. ఒక పాత దుప్పటి, చాపా ఇచ్చాడు నారాయణ.

ఆ మర్నాటి నించీ రాత్రి నారాయణ షాపులో పడుకునేవాడు. నారాయణ కాస్త మంచి నిక్కరూ, బనీనూ ఇచ్చాడు తొడుక్కోమని. తిండి నారాయణ ఇంటి దగ్గరే! ఖాళీగా వున్నప్పుడు వీధులెంబడి తిరిగేవాడు.

పట్నంలో ఇళ్ళు బావున్నాయి. మనుషులు ఇంతో అంతో నీటుగానే వున్నారు. షాపులు కొన్ని చాలా బావున్నాయి! సినిమాలు?!

గోడలమీద సినిమాల పోస్టర్లు చూసి వీరేశు ఎంతో సంతోషపడిపోయాడు. ఒక్కసినీమా కూడా తనింతదాకా చూడ

లేదు! అత్తముండ పట్నానికి ఎళ్ళనిచ్చేది గాదు! రెండుసార్లు అత్తకన్నుకప్పి, ఎలాగో డబ్బులు చిక్కించుకుని పారిపో బోయేడు గానీ, దొరికిపోయాడత్తకి. చావగొట్టేసింది.

వీరేశు నారాయణని సినిమాకి డబ్బుల డుగుదామనుకున్నాడు. రెండు రోజులు ఎంతో ప్రయత్నించాడు. గుండె గుబగుబ లాడింది. నోరు పెగల్లేదు. కష్టంమీద ఆ కోరికని అణిచివేసుకున్నాడు.

ఒకరోజు నారాయణ చెప్పాడు- రెండిళ్ళల్లో నీళ్ళు రోజూ వాడుకగా పొయ్యడానికి ఒప్పుకోమని. కావిడి కొనిచ్చాడతనే. నెలకింతని జీతం వొస్తుం దన్నాడు.

ఎనిమిదేళ్ళ నాటి సంగతిది. రేపు కావమ్మగారింట్లో పెళ్లి.



## 2

చేతి నిండా పని.

కావమ్మగారిల్లు తిరనాళ్ళలావుంది! ఇంటిముందు పందింట్లో చాలామంది పిల్లలు గలగలమంటూతిరగాడుతున్నారు. ఆడుకుంటున్నారు, కొట్టుకుంటున్నారు. నవ్వుతున్నారు, ఏడుస్తున్నారు. పెద్దగా కేకలు పెడుతున్నారు.అలిసిపోతున్నారు.

పొద్దున్నే ఆ పిల్లలు పక్కలమీంచి లేచిపోయి అంత వుత్సాహంగా గంతు లేయడం చూసి ఆశ్చర్యపోయాడు వీరేశు. పెళ్లిసందడి అలాంటిది కాబోలను కున్నాడు.

పందిట్లోనే నలుగురు పెద్దమనుషులు చుట్టలు, సిగరెట్లూ కాల్చుకుంటూ లోకాభి రామాయణం చర్చిస్తున్నారు. అప్పుడు వచ్చేడు వీరేశు.

వీధి సావింట్లోంచి లోపలికి చూశాడు. గుమ్మాలికి మామిడాకుల తోరణాలు కట్టేసి వున్నాయి! గుమ్మాలు రంగులతో, గోడలు కొత్త సున్నంతో, ఆడా మగా రంగు రంగుల బట్టలతో కళకళ్ళాడు తున్నారు!

లోపల నాలుగో గుమ్మంలోంచి కావమ్మగారు వీరేశుని చూసి, గబాగబా యివతలికి వచ్చింది.

"తెల్లవారకుండా రమ్మంటే ఇప్పుడా వచ్చేవు? శుభకార్యం వుందని నాలుగు రోజులాయి పాట పాడుతున్నానా? నా మాటంటే అంత అలక్షం నీకు? ఆ వరసమ్మ నోట్లోంచి మాట వస్తే చాలు వేడంలా చేసుకుపోతావు!"

"ఆలీశెం అయిపోనాది ... "

సంజాయిషీ ఇచ్చుకుంటున్నట్టు అన్నాడు వీరేశు.

"అదే ఎందుకయిందీ అనడుగు తున్నాను!"

కావమ్మ భర్త గంగాధరంగారు అక్కడికి వచ్చాడు. "ఎందుకే పెద్ద గొడవా! వచ్చేశుగా? వెళ్ళవోయ్! నీళ్ళు పొయ్యి తొరగా" అన్నాడాయన విసుగ్గా.

"ఒకటా రెండా? నాలుగు రోజులాయి చెప్తున్నాను – ఇవాళ ఇంత తంతుందని! అడిగింపల్లా పెట్టాలిగానీ, నా మాటంటే లక్ష్యం మాత్రం లేదు"

కావమ్మగారొక పట్టాన ఊరుకోరు




కోపం వస్తే!

వీరేశు గబగబా ఆ సందులోంచి వెళ్ళి పెరటిలో ఉంచుకున్న కావిడి, డబ్బాలు తీసి భుజానికి తగిలించుకున్నాడు. కావమ్మగారింట్లో కుళాయి ఇంకా పెట్టించలేదు. నుయ్యిలేదు. అందుకే వీధిలో ఉన్న కుళాయి నించే నీళ్ళు తెచ్చి పొయ్యాలి.

వీధి కుళాయినించి ఒకటీ, ఒకటీ కావిళ్ళు తెచ్చి పోస్తున్నాడు వీరేశు. పెరటిలో పెద్ద గొయ్యితవ్వి మూడు రాళ్ళ మీద పెద్ద బిందెలంత గిన్నె లెక్కించేరు వంటవాళ్ళు. కట్టెలు భగభగ మండుతున్నాయి. ఉండి ఉండి పొగ వస్తోంది. అక్కడున్నవాళ్ళ కళ్ళు మంటపెడుతున్నాయా పొగకి. వీరేశు చేతితో కళ్ళు తుడుచుకున్నాడు.

వంటవాళ్ళు అప్పటికే ఉప్మా, కాఫీలు తయారుచేసినట్టున్నారు. ఆ ఇంటిలో ఉన్నవాళ్ళు, వచ్చేవాళ్ళు చిన్న విస్తరాకుల్లో ఉప్మాలు తింటున్నారు...కాఫీలు తాగుతున్నారు!

కావమ్మగారు కుండీలోకి డబ్బాలో నీళ్ళు ఒంపుతున్న వీరేశు దగ్గరికి వెళ్ళి "ఇదిగో! అపక్కకిరా! నీకు ఉప్మా ఇస్తాను... తినేసాక నీళ్ళు మోద్దువు గాని" అంది.

వీరేశు సంతోషంగా బుర్ర ఊపి గబగబా రెండు డబ్బాల నీళ్ళు ఒంపేశాడు. ఆ పక్కకి వెళ్ళి కావమ్మగారు ఆకులో వేసి ఇచ్చిన ఉప్మా తిన్నాడు. వేడిగా, కారంగా ఉంది. అక్కడక్కడ జీడిపప్పు కూడా వచ్చింది. ఆ తర్వాత కావమ్మగారే ఒక గ్లాసుతో కాఫీ ఇచ్చింది. తాగేసి గ్లాసు కడిగేసి ఇచ్చేశాడు వీరేశు.

'మాట చురుకూ, మనసు మెత్తనా...' అనుకున్నాడు కావిడి ఎత్తుకుంటూ.

ఆ రోజు వాళ్ళింట్లో ఆ కార్యం ఉండడాన, మామూలుగా రోజూ పోసే కావిళ్ళ కంటే ఎక్కువే పొయ్యాల్సి వచ్చింది వీరేశుకి.

ఎండ ఎక్కిపోతోంది. ఇంకా తను నీళ్ళు పొయ్యాల్సిన ఇళ్ళున్నాయని త్వర త్వరగా కామమ్మగారి పని కానిచ్చాడు.

వాళ్ళింటినించి చెప్పి వచ్చేస్తుంటే కావమ్మగారు వెనక్కి పిల్చి "ఒరే! మద్యాన్నం భోజనానికి ఒచ్చెయ్యి" అని చెప్పింది.

బుర్ర ఊపి, గబగబా మరో ఇంటికి వెళ్ళాడు వీరేశు.

వర్ధనమ్మగారిల్లది. ఆవిడ నాలుగు వాటాల ఇంటిలో ఒక వాటాలో అద్దెకి ఉంటోంది. ఆ ఇంటికంతా ఒకే కొళాయి. అదయినా చిన్నధార పడుతుంది. వర్ధనమ్మ ఆ ఇంటిలో దిగిన మొదట్లో అద్దె ఇచ్చుకుంటున్నాం కాబట్టి మాకు హక్కు ఎందుకులేదని మూడు వాటాలవాళ్ళ మీదా కలబడేది. వాళ్ళూ పోట్లాడేవాళ్ళే! నీటి సౌకర్యం ఎవరికీ సరిగ్గా లేదు. అయినా దెబ్బలాటలూ తప్పలేదు. వర్ధనమ్మకే ప్రాణం విసుగెత్తి, వీరేశుని కావిడితో వీధి కుళాయి నీళ్లు పొయ్యమని చెప్పింది.

వీధి కుళాయిని చూస్తే వీరేశుకి జాలి వేస్తుంటుంది.

ఉదయం ఆరు గంటలకి అది పడడం ఆరంభిస్తే, ఏడున్నర వరకు ఉంటుంది. ఆ తరువాత తొమ్మిదింటికి వచ్చి, పన్నెండు వరకు పడుతుంది. ఆ సమయాల్లో అసంఖ్యాకంగా జనం చేరతారు.



వీధి కుళాయి దగ్గర బిందెలు, తప్పేలాలు, కుండలు, కావిళ్ళు...అక్కడే కబుర్లు, అక్కడే పరాచికాలు. అక్కడే వార్తలు, అక్కడే యుద్ధాలు!

వాటన్నింటి మధ్యా తనపని తన దన్నట్టు కుళాయి పడుతూంటుంది. ఏ వుద్రేకాలతోనూ, ఏ కావేశాలతోనూ తనకి సంబంధంలేదు. పట్టిన వాళ్ళకి లేదనదు. ఒక్కోసారి బిందే బిందే యుద్ధంలో ఢీపడి కుళాయికి టంగు టంగున మొట్టికాయలు, దెబ్బలు పడు తుంటాయి. అయినా చలించదు.

వీరేశు నీళ్ల మోతతో చాలా పెరిగేడు శరీరం రాటుదేలింది. కండరాలు కొంచెం బలంగా తయారయినాయి. వీధి కొళాయి దగ్గరకి వెళ్ళేటప్పుడు తన కావిడి నిండే లోపున వినే మాటలూ, కనే దృశ్యాలూ. మనుషల స్వభావాలూ కొత్త కొత్త పాతా లేవో నేర్పాయి!

తను రోజూ పేపరు చూడడు. అసలు చదవడం రాదు సరిగ్గా! అక్షరాలు నేర్చు కునే వయసులో ఆ ఉత్సాహాన్ని అత్త అణగదొక్కేసింది. నారాయణ షాపులో పేపరులో బొమ్మలే చూసి పడేస్తాడు గానీ... పేపరుకబుర్లు వీధికుళాయి దగ్గర కావలసినన్ని దొరుకుతాయి. అలాగే

రేడియో కూడా అక్కడ వినొచ్చు. ఇంకా సినిమా కూడా! ఆడేసి వెళ్ళి పోయిన సినిమాలు, ఆడుతున్నవి అన్నీ కథా, మాటలూ, పాటలూ, ఫైటింగులూ, ప్రేమలూ, శృంగారాలు అన్నీ చక్కగా వీధి కుళాయివద్దే దొరుకుతాయి.

వీరేశుకి అనుభవం ఎంతో జ్ఞానాన్నిచ్చి నట్టనిపించింది.

నిన్న రెండో ఆట సినిమా కెళ్లొచ్చిన వరాలు, అందులో ఈరో ఎంత బావు న్నాడో వర్ణించి చెబుతోంది! అంత పొడూగున్నాడు! అంతేసి గిరజాలు! తెల్లగా పండులాగా వున్నాడు! చాలా అందంగా, మాంచి ధైర్యంగా, ఎంతో సాహసంతో ఎన్నో గొప్పపన్లు చేసే స్తాడని చెప్పింది వరాలు – అడిగిన వాళ్ళ తోనీ, అడగని వాళ్ళతో కూడా. వరాలి కింకా పెళ్ళి అవలేదు. తల్లి చిన్నతనం లోనే చనిపోయింది. తండ్రి వున్నాడు. ఆమధ్య అతగాడు రిక్షా తొక్కుతూ కారుకి గుద్దేయబోయి, వెంట్రుక వాసిన అంత ప్రమాదం నించీ తప్పించుకుని, రిక్షా ఒకవేపూ, తను ఇంకోవేపూ రోడ్డు మీద పడిపోయి, గుండె నేలకి బలంగా మోస్సే ఇంక రిక్షాతొక్కలేక కొంపలో మంచం మీద ప్రాణాలు పిడికిట్లో వుంచు కుని పడున్నాడు.

వరాలు ఒక్కతే సంతానం అతడికి.

వరాలు మొహంలో కళ్ళే కని పిస్తాయి. కాటుక పెట్టుకోనక్కర్లే కుండానే నల్లగా, అంతలేసి కళ్ళతో వున్న వరాలు ఎదటి మనిషిని అమాంతం నిలవేసేస్తుంది. ఒంటికి వయసువచ్చి రెండేళ్ళవుతోంది. ఆ కళ్ళల్లోంచి గుండె లోకి సినిమా హీరోల బొమ్మలు దిగి ఏణ్ణర్థం అవుతోంది. వంటరిగా వుంటే కలలే కంటుంది. ఆ కలలే వరాలి కడుపు నింపుతాయి.

"అయితే నీ ఈరో ఆ సిన్మాలో ఆఖరికేటవుతాడే?"

అనడిగాడు వీరేశు ఆత్రంగా.

"నా ఈరో యేటి మద్యను?"

"కాదేటి?"

"నేనేం ఈరోయిన్ననుకున్నావేంటి అందల!" అని నవ్వింది.

"అందల కాకపోవొచ్చు! పోనీ పైన"

"వూరుకో! వూరుకో!" కొంచెం సిగ్గుపడింది వరాలు.

"ఇంతకీ ఆఖర్నేటవుతాడంటే?" వూరు కోలేదు వీరేశు.

వరాలుని చూస్తే వూరుకోబుద్ధవదు. అది మాట్లాడితే అక్కడినించి కదల బుద్ధవదు. తనతో కబుర్లాడితే అస్సలు దాన్నివదలేబుద్ధవదు!

"ఆఖర్నా ఏటవుతాడు హాయిగా ఈరోయిన్ని కల్సుకుని, ఇద్దరూ పాట పాడుకుంటారు..."

"నీకు పాటలొచ్చా వరాలూ?"

వరాలు అదోలా చూసింది వీరేశుని.

"ఎందుకలా అడిగేవూ?" అంది.

"ఏం లేదూ. వొచ్చేవోనసీ..."

"ఇంటావా పాడితే?"

బుర్ర ఊపేడు వీరేశు.

"సాలుసాల్లే పరాశికాలు! పాట వింటాట్ట పాటలు! నయ్యం ఇంకానూ..." అంటూ కుండెత్తుకుని వెళ్ళిపోయింది వరాలు. వీరేశు నవ్వుకుంటూ కావిడి నించి డబ్బా తప్పించి, కుళాయి కింద పెట్టాడు.

* * *

"ఈరేశూ... ఈరేశూ! ఒక్కపాలి నివ్వురా! తొందరగరా!" వరాలు




పరిగెత్తుకొంటూ వచ్చింది.

వీరేశు అప్పుడే మంగలిషాపు బెంచీ మీద నడుం వాల్చబోతున్నాడు. పొద్దు న్నించీ ఏక నీళ్ళమోత. చేతులు, నడుం లాగేస్తున్నాయి.

"ఏం వరాలూ? ఏటయిందే?" అడిగాడు దాని కంగారుని చూసి తత్తర పడుతూ.

"తొందరగారా ఈరేశూ! నాకేటో భయ్యంగుంది!"

"బయ్యంవా? అదేంటే? దేన్నిసూసే?"

"నాన్ననూ్సస్తే..."

ఏంటో అయిందనుకుని గబగబా వరాలు వెంట వెళ్ళాడు వీరేశు.

అక్కడికి రెండు వీధులవతలే వరాలు పాక. ఆ చుట్టుపక్కలన్నీ పాకలేగానీ, ఆసమయంలో ఏమనిషీ పాకల్లో ఉండరు. పనుల మీద పోతారు. అలా వెళ్ళకపోతే వాళ్ళకి జరగదు. అప్పుడు పాకల్లో ఏ కుక్కో, పిల్లో, చిన్నపిల్లలో మాత్రం వుంటారు.

వీరేశూ, వరాలూ వెళ్లేసరికి వరాలు తండ్రి నాగులు నులకమంచంలో నోరంతా తెరిచేసీ, కళ్ళు తేలవేసీ వున్నాడు. వీరేశు దడదడమంటోన్న గుండెతో నాగులు గుండెని చూశాడు. అనుమానం వచ్చింది. భయం వేసింది. తన ఒళ్లు ముట్టుకుచూశాడు. వెచ్చగావుంది. నాగులు ఒంటిమీద చెయ్యివేశాడు. అదీ వెచ్చగానే వుంది! 'అమ్మయ్య పర్వానేదులే! బతికే వున్నాడు అడూనూ తన్లాగే' అనుకు న్నాడు.

"నాన్న ..." అంది వరాలు భయంగా చూస్తూ. ఆ పిల్ల కళ్ళనిండా నీళ్ళు నిండివున్నాయి.

"ఏం పర్వానేదే! నేన్చూసేనుగదా! పర్వాలేదులే! బయ్యంపడకు! కొంచెం తెలివితప్పింటాది ... డాకటర్ని పిలిస్తే? వొత్తాదంటావా?" అన్నాడు వీరేశు. లోపల తనకి గుబులుగానే వుంది. యిప్పుడు నాగులు వొళ్లు ఎచ్చగానేవుంది గానీ, అడి వోటం సూస్తే కాస్సేపట్లో సల్లబడిపోవచ్చనిపించింది!

"ఏవో? నాన్నకి ఇలా బాగోలేని కాణ్నుంచి నాను డాకటర్ని యింటికి తీసుకరానేదు. అరిడగ్గరికెళ్ళి నాన్నకిలా గుందని సెప్తే సీట్లు రాసిస్తే మందుల సాపుకాడ కొనుక్కురాడవే..." అంది వరాలు. కళ్లు ఒకసారి ముయ్యగానే పొర్లిపడిన నీళ్లు గుండెలమీదకి జారి అక్కడ తడిపేశాయి. ఆరాటంతో, ఆందో ళనతో గుండెలు ఎగిరెగిరిపడుతున్నాయి.

"నువ్వే ఎలతన్నావుగదా డాకటరు కాడికి...ఇప్పుడిలాగుందని నివ్వే సెబితే బా వుంటదేమో! నానిక్కడుంటాను. నువ్వెళ్ళు" అన్నాడు వీరేశు.

వరాలు గబగబా వెళ్లింది.

వీరేశు నాగులివేపే కళ్లప్పగించేసి వుండిపోయాడు. నాగులు బాగా కృంగి పోయాడు. నరాలూ, ఎముకలూ మాత్రం కనిపిస్తున్నాయి ఒంట్లో. కూతుర్ని కన్నాయం చేసిపోతాడేమో! అదేమవు తుంది? దాన్నెవరు ఆదరిస్తారు? ఆడపిల్ల వయసులో వుందిగదా? ఏమో!

వరాల్ని తలచుకుంటే జాలివేసింది వీరేశుకి.

తలతిప్పి పాకంతా కలయచూశాడు. ఆ మూల చిన్న చెక్కపెట్టివుంది. దానిమీద మడతబెట్టిన బొంతా, దుప్పటి వున్నాయి. మీద దండేన్ని పరికిణీ,

జాకెట్టూ, తుండుగుడ్డా, ఒక ముతక పంచే వేలాడుతున్నాయి. ఆపక్క చిన్న గూటిలో అద్దం, దువ్వెన, బొట్టూ వున్నాయి. ఆ గదికి కొసాన ఒక రాళ్ళ పొయ్యి వుంది. అక్కడ కుండ తప్పేలా, రేకుగ్లాసులు రెండూ, పింగాణీ కంచాలు రెండూ వున్నాయి. మొత్తం వాళ్ల ఆస్తి అంతా అవే...అనుకున్నాడు వీరేశు.

ఎండ వెలుగు బలవంతంగా చొరబడుతోంది పాకలోకి.

వరాలు వెళ్ళినంత వురుకూ పరుగుతోనూ వచ్చింది. ఆ అమ్మాయి చేతిలో ముచ్చిరేకుల మాత్రలున్నాయి.



"డాకటరుగారుతో అంతా సెప్పేను. ఒక్కపాలి రమ్మన్నాను. నాన్నేటయి పోతాడో సూడండంటే ఏం బయ్యంనేదని ఇదిగో ఈ మాత్తర్లు అర్జెంటుగా తీసుకెళ్లి వెయ్యమనిచ్చేరు. ఇప్పుడు మందుల సాపుండదని ఆయినకాడవున్నవిచ్చేరు... వుండు. నీళ్ళట్టుకొస్తాను..." అంటూ గ్లాసు కుండలోముంచి తీసుకొచ్చింది.

ఇద్దరూ కలసి నాగుల్ని కొంచెం తల ఎత్తి, నోటిలో ఒక మాత్రవేసి నీళ్ళు పోశారు. కొంచెం నీళ్లు లోపలికెళ్ళాయి. మిగిలినవి బైటికి వచ్చేసాయి. మాత్ర



నోటిలోనే వుండిపోయింది. ఇలాకాదంటూ వీరేశు ఆ మాత్రని తను వేళ్ళతో గొంతు లోపలికి తోశాడు. నీళ్ళపోసి ఎలాగో మింగిందారు.

"నేనెల్లానూ" అన్నాడు వీరేశు.

"ఎల్లిపోతావా?" జాలిగా చూసింది వరాలు.

"నాన్నకి తెలివొచ్చీదాకా వుండ గూడదూ?"

వీరేశుకి నడుం లాగేస్తోంది. ఇప్పుడు తనకి విశ్రాంతి కావాలి! నాల్రోజులాయి ఒంట్లో నీరసంగ వుంటోంది. ఎప్పటి కప్పుడే డాకటరు కాడికిపోయి మందు లేవో వాడాలనుకుంటూ బద్దకించేస్తు న్నాడు. ఇలా జాప్యంచేస్తే తను మంచం ఎక్కడం ఖాయం!

తన కష్టం వరాలుతో చెప్పలేదు. చెప్పడానికేదో అడ్డువస్తోంది. వరాలుకి తను ఎలా కనిపించినా, అనిపించినా తనకిమాత్రం వరాలు ముందు సినీమా ఈరోకి మల్లే కన్పించాలనిపిస్తుంది. పొట్టిగా వున్నా పొడుగు మనిషిలా నడ వాలనిపిస్తుంది. అంత బలంగా లేక పోయినా ఎంతో బలమైన వాడిలా కనిపిం చాలనిపిస్తుంది. అందగాడు కాకపోయినా అందంగా తయారయి వుండాలనిపిస్తుంది. అందుకు తన పద్ధతులు కొన్నిమధ్య మార్చుకున్నాడు! నారాయణ షాపులో మద్యాన్నం జుట్టుకి నూని రాసి క్రాపింగు నున్నగా దువ్వుతున్నాడు. కొంచెం పవు డరు రాస్తున్నాడు. గెడ్డం నున్నగా గీసే స్తున్నాడు, మీసం జాగ్రత్తగా కట్ చేయిస్తున్నాడు. శుభ్రమైన చొక్కా, షరాయీ తొడుగుతున్నాడు. అప్పు డద్దంలో చూస్కుంటే, పర్వాలేదు తనూ బాగానే ఉంటానని నమ్మకం కలిగింది. ఆ నమ్మకంతోనే వరాలుకి ఇంకా దగ్గరవడానికి ప్రయత్నిస్తున్నాడు!

తనకీ మధ్యన...వరాలుతో సాపత్యం అయిన కాడినించీ ఆడతోడు కావాలని పిస్తోంది. ఆ ఆడది వరాలయితేనేబావుండు ననిపిస్తోంది! కానీ... వరాలు మనసెలా వుందో? తనంటే ఇష్టవో కాదో? తనడగలేదు. అడగాలి. కానీ... ఇది సమయం కాదు.

"ఏంటలా వున్నావు?" అంది వరాలు పరకాయించి చూస్తూ.

"ఎలాగున్నానూ!" నవ్వబోయేడు. కాని నవ్వు రాలేదు.

"నీరసంగవుపిస్తన్నావు ఇయాళ..."

"నేనా... నిజెంగా?"

"కులాసాకి పరాచికమాడతారుగానీ, కష్టానికి పరాచికమాడతారేటి?"

వీరేశు ఆ మాటతో ఇంక నటన చెయ్యలేకపోయాడు.

"నీళ్ల మోతతో ఒళ్లు పుల్సిపోనాది వరాలూ!" అన్నాడు నేలకి చూస్తూ.

"కావిడిమోత మజాకాయేంటి? బేగీ ఏదో మందేస్కో! నేకపోతే మంచం ఎక్కినావంటే నీకెవురు... అమ్మా? అబ్బా?"

"మీరంతా లేరా వరాలూ?"

"మావేంటి సేస్తాం?"

వీరేశు ఏదో మాటకోసం ఆశపడ్డాడు. ఈ మాటతో నిరాశపడ్డాడు.

"అదేంటి వరాలూ? నువ్వు ఇప్పుడు రమ్మంటే నాన్నాలేదా? అలాగే నువ్వూ నాను మంచంఎక్కితే కబురెడితే రావా?"

"ఎందుకురానూ! అంత ఇశ్వాసం లేనిదాన్ని కాను. కాని, వచ్చేంజేస్తాను? చూసి పోతాను...అంతేగా"




"అంతదాకా వొస్తే చూసిలా పోగలవులే"

వరాలు ఆశ్చర్యంగా చూసిందతడిని.

"ఏంటి నీమాటా?" అంది తెల్లబోతూ. "ఇయాలిలా మాట్టాడతన్నావేటి? సూస్తావుంటే నేన్నీకాడికి రాడానికే నివ్వు మంచం ఎక్కేలా వున్నావు. ఒద్దొద్దు. అంతపని సెయ్యకు. తొందరగేటో మందేసోక్క!" అని నవ్వింది.

వీరేశూ నవ్వేశాడు - నవ్వలేక పోతున్నా, వరాలు మాటల్లో ఏవో పొడవక పొడుస్తున్నా.

వరాల్ని తను అంచనా వెయ్య లేకండా వున్నాడు... ప్చ్!!

"ఎళతాను వరాలూ!" లేచాడు.

"అదిగో! నాన్న కదుల్తున్నాడు" వరాలు సంతోషంగా గట్టిగా అంది. నాగులు కదిలేడు. మూలిగాడు. కనురెప్ప లాడించాడు. అప్పుడు అటూ యిటూ చూశాడు. నోరు మెదపబోయాడు. మాట చాలా హీనంగా పాతాళంలోంచి వస్తున్నట్టుంది!

"తొంగో! నీకు చాలా సేపయి తెలివి నేదంటే వొచ్చేను. వరాలెళ్లి మాత్రల్తెస్తే మింగించేం" అన్నాడు వీరేశు.

'అలాగా?' అన్నట్టు తలాడించి ఆప్యాయంగా వీరేశు చెయ్యిపట్టుకున్నాడు నాగులు. ఆ స్పర్శలో, తాకిడిలో, కృతజ్ఞతలో, ఆర్ద్రతలో ఒక బంధం ఏదో వీరేశుని తాకింది. గుండెలో తుళ్లి తట్టింది. పలకరించింది. పరామర్శించింది.

నాగులు తనకేమీ కాడు! కానీ నాగులిప్పుడు...తనకి కనిపించని అమ్మ అయి, నాన్న అయి కనిపిస్తున్నాడు! అత్తకి భయపడినా మావయ్య ముఖంలో తనకెప్పుడూ కనిపించే ఆత్మీయత, అభిమానం లాంటివి ఇప్పుడీ నాగుల్లో కనిపిస్తున్నాయి!

వీరేశుకి అప్పుడు నాగులు ఉండిపొమ్మంటే అక్కడే ఉండిపోవాలని పించింది. కాని......

వరాల్ని చూశాడు.

నాగులు చెయ్యి నిమిరాడు. "ఎల్తానూ?" అని నింపాదిగా అడుగులో అడుగేస్తూ నడిచాడు బయటికి.




'ఈ ఎనిమిదేళ్ళలోనూ తన వొళ్ళింత అవుకయిపోలేదు. అంతోయింతో గట్టిగానే ఉన్నాడు. కావిడితో నీళ్ళుమోస్తే భుజాలు కాస్త లాగేవికానీ, ఇంత బలహీనంరాలేదు. ఇప్పుడెందుకింత కుదేలయిపోనాడూ?!'

అని తనలోతను ఆశ్చర్యపోయాడు వీరేశు.

"వయసులో ఉన్నోడికి బలహీనం ఏంటి?" అని నారాయణతో అంటే అతను నవ్వాడు.

"ఎంతవయసున్నా వొళ్ళు వొళ్ళేన్రా! ఒరే సూడూ! అదీ మిషనులాంటిదే. అదే పనిగా పంజేయిస్తే ఎప్పుడో టకీమని ఆగిపోతాదిగదా మిషను. దాన్ని విప్పీ, ఆయిలుపేసీ, సరిజేస్తేనేగదా పంజేస్తాది! ఏటంటావు? మరి...మనవొళ్ళూ మిషనే! పైకిలాగ నల్లతోలూ, తెల్లతోలూ, దర్జా,



డాబూతో కనిపిస్తాంగానీ లోపల అందరికున్నవీ నరాలూ, ఎముకలూ, రక్తమే గదా? నీకు ఈమధ్యన నీళ్ళమోత ఎక్కువైపోనాదిరా! కొంచెం వాడుకలు తగ్గించుకోమని చెబుదారనుకున్నాను. డబ్బులు సంపాయిస్తన్నాడూ, ఎందుకులే

వొద్దనడం అని మళ్ళా వూర్కున్నాను" అన్నాడు నారాయణ.

వీరేశు అప్పుడు నారాయణ ఇంట్లో పడుకుని ఉన్నాడు. డాక్టర్ని పిలుచుకు వచ్చి చూపించారు. ఇంజెక్షన్లూ, టానిక్కూ ఇస్తున్నాడు. పుట్టి, బుద్ధెరిగాక సూది పోటు పొడిపించుకోలేదు వీరేశు. నీర్సం కంటే, చేతులమీద సూదిపోట్ల నెప్పే హెచ్చుగుంది.

ఇంతదాకా తను మంగలిషాపులోనే రాత్రిళ్లు పడుకున్నాడు. చేతిలో, జేబులో డబ్బు ఆడసాగాక ఒకరిద్దరు వీధి కుళాయి కాడ తనతో ఏరేగా చిన్న ఇల్లు తీస్కోమని చెప్పినా, ఆ ప్రయత్నం చెయ్యలేదు. నారాయణ ముఖం చూస్తూ తనలాగా చెయ్యలేదనుకున్నాడు. ఒకసారి నారాయణే ఏదో పరాచికాలాడ్తూ 'ఇల్లు' వూసు కదిపాడు.

"ఒరే ఈరేశూ! నీకు వంటరిగ ఉంటే



ఏంటనిపిస్తాదిరా?"

"నిద్దరపోవాలనిపిస్తాది" అన్నాడు.

"నిద్ర రాకపోతే?"

నవ్వాడు. అవును. రాత్రేళ ఒకోక్కసారి నిద్రపట్టదు ఎంతసేపటికీనూ! ఏంటో అదోలా ఏఁపీ తోచనట్టు బుర్ర దిమ్ముగానూ, ఒంట్లోనరాలు అల్లరి పెడుతున్నట్టూ, దాంతో ఇసుగ్గాను చికాగ్గానూ అనిపిస్తాది!

"ఏఁవో? అదోలా గుంటాది!" అన్నాడు.

నారాయణ గట్టిగా నవ్వాడు.

"అవునలాగే ఉంటాది. అదంతా నీ మీసాలు, గెడ్డాల ప్రభావం. నీ వొయసు ప్రభావం. అప్పుడు నీకేమనిపిస్తాది? మన షాపులో ఎర్రెక్కించే ఆడ బొమ్మలున్నాయి చూసినావా? నీకప్పుడలాంటి ఆడతోడు కావాలనిపించిందా?"

బుర్ర దించేసుక్కున్నాడు వీరేశు.

నిజమే! ఒకరోజు తనింక వుగ్గపట్టలేకపోయాడు. లైటేసి, గోడమీద ఆడ బొమ్మల్ని తదేకంగ చూసేడు. ఒంట్లో నెత్తురు పరిగెత్తింది. ఒక కాలెండర్ని నింపాదిగ తీశాడు. కింద పక్కమీద ఉంచేడు. ఆ బొమ్మ వొంటిని చేత్తో నిమిరేడు. ముద్దెట్టుకున్నాడు. అంతలో బైటేదో చప్పుడయితే, లేచి ఆ కాలెండర్ని మళ్ళా గోడకి తగిలించేసేడు.

సినిమాలు ఈమధ్యన వారానికి ఒకటయినా చూస్తున్నాడు. పొద్దున్నంతా నీళ్ళపనయిపోతుంది. మేటనీకి, లేకపోతే ఎప్పుడేనా ఆరుగంటలాటకి వెళతాడు. రాత్రి నారాయణ ఇంట్లో అన్నంతిని, షాపులో పడుకోవడం! తనకొచ్చే ఆదాయంలో నారాయణకి భోజనం పెడుతున్నందుకింతని ఇచ్చేస్తున్నాడు. నారాయణ మొదట్లో పుచ్చుకోలేదు! "నా షాపులో సాయం పడుకుంటున్నావు. నాకుపకారం చేసున్నావు. దానికి నేన్నీకు పెట్టేదానికి సరి" అంటే తను విన్లేదు.

బలవంతం చేస్తే, ఈమధ్యన నారాయణ డబ్బు తీసుకుంటున్నాడు. ఒకవేళ తీసోక్కకపోతే వాళ్ళింటికి కావలసిన బియ్యమో, పప్పులో, ఏ వస్తువులో కొని తెస్తున్నాడు తనే.

సినిమాలు తనమీద బాగా ప్రభావం వేసేయి! అందులో ఈరో, ఈరోయిన్ల ప్రేమలూ, పాటలూ, ఆళ్ళ తిరుగుళ్ళూ అంతా అన్నీ చూస్తావుంటే, 'లవ్వు... లవ్వంటే ఇట్టాగుంటదా?' అని తెల్సింది. తనకి ఏటో ఎర్రెక్కిపోయినట్టన్పించేది. ఆళ్ళలాగే తనకీ చేయాలన్పించేది. తనకెవురు దొరుకుతారు? తనకందుబాటులో ఉంది ఒక్క వరాలే!

నవ్వుకున్నాడు. అందుబాటులోఉందా అది నిజంగా?

ప్చ్! అందీ, అందకా వుంది!

నారాయణ తన లోపలి ఆరాటాన్ని కనిపెట్టేసేడు!

ఇంక దాచుకోలేక, "అవును! తోడు కావాలనిపిస్తాది ..." అన్నాడు నారాయణతో.

"సరే! కసింత ఆగు! నీకు తగ్గ దాన్ని తెస్తాను. అక్షింతలు ఏసేస్తాం తొందర్లో..."

వులిక్కిపడ్డాడు. నారాయణ తల్చుకుంటే అంత పనీ చేసేస్తాడు.

"నేను ఏరే ఇల్లు సూసుకుంటే షాపుల ఎవురు పడుకుంటారు?" అన్నాడు.

"హార్నీ! అందుకోసమని నీ సుకం





చూసోక్కడం మానీస్తావా? వుత్త ఎర్రోళ్లా ఉన్నావే! ఇంతకాలం నాకు సాయం జేసేవు. నీకూ ఒక బతుకూ, బాధ్యతా, సంస్కారవూ, సంతోషవూ అయీ కావాలా? నా షాపు సంగతంటావా? మాయబ్బాయి కొంచెం పెద్దోడయినాడు గదా? అణ్ణి షాపులో వుండమంటే వుంటాళ్ళే రాత్రేళ!"

రెండు చేతులూ ఎత్తి జోడించా లన్పించింది వీరేశుకి. అయితే చేతులు లేవలేదు. నారాయణ అరిజెంటుగ పెళ్లి కూతుర్ని తెస్తానంటున్నాడు!

మరి, వరాలు???

వరాలు గురించి ఎలా చెప్పడం నారాయణకి?

వరాలూ, తనూ వీధి కుళాయికాడ మాట్లాడుకోవడం నారాయణ చూసేడు! మొన్న వరాలింటికెళ్ళడం కూడా నారాయణకి తెల్సు!!

మంచంమీద లేచి కూచున్నాడు వీరేశు.

తనకిలా గభాల్న సలత చేసేసరికి, ఈ గొడవలో పడి, నారాయణ తన పెళ్ళి వూసు వాయిదావేసినట్టున్నాడు! పోనీ! ఇదీ ఒకందుకు మంచిదే!

ఆరోజు వరాలు వచ్చింది వీరేశుని చూడటానికి. అప్పుడు వీరేశు పడుకుని ఉన్నాడు. నారాయణ పెళ్లాం లేపి చెప్పింది వరాలు వచ్చిందని. గభాల్న లేచి నిల్చోబోయీ, తూలీ సర్దుకున్నాడు.

"తొంగో! ఎందుకట్టా లెగిసిపోనావు? నయ్యం! ఇంకా పడిపోనావుగాదు"

వరాలు అలా అంటే వీరేశుకి తల కొట్టేసినట్టయింది. ఆమాటే నారాయణ అనడం వేరు! ఇంకెవరయినా అనడం వేరు! వరాలు అలా అనడం తనకి చాలా అవమానంగుంది! బాధగుంది! యిచారంగుంది!

ఎందుకలా అంది వరాలు? అనాలని అందా?

తన చచ్చుదనాన్ని వరాలు ఎకసక్కెం చేసిందా? ఏవో!!...ప్చ్!!

బాధగా గుటక మింగాడు వీరేశు.

వరాలు తనని చూడ్డానికి వచ్చిందన్న సంతోషం అంతా నీళ్లు కారిపోయింది!

నారాయణ భార్య చెబితే వీరేశు మంచంమీద కూచున్నాడు.

వరాలు తనతో తెచ్చిన సంచిలోంచి నాలుగు అరటిపళ్లు, రెండు బత్తాయిపళ్లు తీసి మంచం మీద పెట్టింది. వీరేశు ఆశ్చర్యంగా చూశాడు. నిట్టూర్చాడు.

"తీసోక్క!" అంది వరాలు.

"ఎందుకియన్నీ!" అన్నాడు వీరేశు మనసులో అసహనాన్ని అంత వేగిరం బయటకి కక్కలేక కప్పిపుచ్చుకుంటూ.

'ఇయ్యి తిని బాగా బలంగా తయారవరా చచ్చు మొకవా' అనేతలంపుతో తెచ్చి వుంటాది అనుకున్నాడు.

"ఒద్దు..."అన్నాడు.

"ఏం?" వరాలు ఆశ్చర్యపోయింది. "ఎందుకొద్దంటన్నావూ ?" అడిగింది సందేహంగా.

"ఏట్నేదు.అనవసరంగ కర్చని..."

"కర్చా... నాకా ? బావుంది అదేం మాట. కర్చని పేరంటానికి పండూ, కాయా అయ్యాపట్టి గెడతావేంటి? కర్చని గుడికి పండూ, కాయా పట్టిగెడతావేంటి? అలగే..."

"అలగే ఈడిని సూడ్డానికి అనవాయితీగా ఇయ్యి పట్టుకొచ్చినావా?" అని నవ్వాడు వీరేశు.

 చతుర ... 31

"తిన్కో, తీస్కో! ఇయాల నీకేదో రెగిందలాగ మాట్టాడతన్నావు. నాకాడ నించుంటే శాన నాకోసం పడిచచ్చి నట్టుండేవోడివి. నేన్ని కోసవనియ్యి ఒట్టుకు వస్తే...ఏటయిందలా వాగుతున్నవ్?" వరాలెంతో చిరాకు పడింది. రుసరుస మంటే దాని కళ్లు గమ్మత్తుగా మారతాయి. వొంపుతిరిగిన పెదిమలు ఇంకా వొంకర తిరిగి ఎదుటి మగాడిని చిత్తు చిత్తు చేసేస్తాయి. వీరేశూ చిత్తయిపోక తప్పలేదు.

మారు మాట్లాడకండా ఆ పళ్ళన్నీ చేతులో మంచంమీద జాగర్తగా పెట్టాడు.

"పాపం, ఆ పిల్ల నీమీదింత అభిమానంతో అవి పట్టుకుని వస్తే అలా అన్నావేంటి ఈరేశూ" అంది నారాయణ పెళ్లాం.

"అయినగారంతేనమ్మా! పరిగెడితే ఎంటబడి, ఎంటబడితే పరిగెత్తే రకం. ఇలాంటి వోడికి నాలాంటిదయితే గానీ నాబంనేదు..."

ఆ చివరి మాటతో వీరేశుకి ఒక్కసారి ఏనుగెక్కినట్టూ, రంగుల రాట్నం మీద కూచుని, తిరిగినట్టూ...సినిమాలో మాంచి దృశ్యం చూసి మజాఅయినట్టూ హాయిగా, గమ్మత్తుగా, కులాసాగా అనిపించింది. వరాల్ని తను...తను సరిగ్గా బోధపరుచుకోలేదా?

వరాలు "ఎల్లా" నంది.

"కూకో" అన్నాడు వీరేశు.

"కూకుంటే నాకు జరగదు నీలాగ" వీరేశు వుడుక్కున్నాడు.

"నాలాగా? హుఁ! యిప్పుడు బాగో నేదు గాబట్టి ..యిదివరకూ జరిగిందేటి?"

నవ్వింది వరాలు "వుడుక్కోకు! నాకూ నీలాగే కూకుందుకీ, కబుర్లు సెప్పడానికీ ఏ జొరవో ఏదో వొస్తే తప్పా అంటన్నాను..."

"స్సె! ఏవొద్దులే తిన్నగుండు. కొబ్బరి సెక్కలాగున్నావలగే వుండు" అని నవ్వాడు వీరేశు.

"సూడమ్మ! ఎలగెక్కిరిస్తన్నాడో" అంటూ వరాలు గబగబా వెళ్లిపోయింది.

దాని పవిట వెనుక పరువాలు, కళ్ళల్లో కైపూ, నడుం వొంపులో నాజూకూ అవీ ఆ తరవాత వీరేశు మూసిన కళ్ల కింద కలలుగా, గుండెలో కువకువలాడే గువ్వలుగా మారి అల్లరల్లరి పెట్టాయి.

* * *

అవాళ వీరేశు నారాయణ షాపులో ఒక కాళీ కుర్చీమీద కూచునున్నాడు. అప్పటికి నలత తగ్గింది. పథ్యంతిన్నాడు. నారాయణ యింట్లో, మంచం మీద పడుకోవడం యిబ్బందిగా అవిపించి ఇలాగైతే మార్పుగా వుంటుందని వచ్చాడు.

ఎండ ఎక్కింది. తగ్గింది. సాయంత్రం అవుతోంది.

షాపులో రద్దీ తగ్గుతోంది. కుర్చీలు కాళీ అవుతున్నాయి. మళ్ళా భర్తీ అవుతున్నాయి. కొంతమంది సినిమాటిక్కెట్ల కోసం ప్రేక్షకుల్లాగ కాచుకునున్నారు.

అంతలో పదేళ్ళ కుర్రాడు—హడావిడిగా బస్టాపులోకి బస్సొచ్చినంత వేగంగా, వీధి కుళాయి దగ్గరికి బిందెలు పట్టుకొని ఆడవాళ్లొచ్చినంత ఆరాటంగా, తొందరగా బడి ఒదిలీగానే పిల్లలు రోడ్డెక్కినంత జోరుగా వచ్చేసేడు.

వాడి తల స్నానం చేసి, తుడిచేసుకుని, దువ్వకుండా అలా దాని ఖర్మానికి వదిలేసినట్టుంది. వాడి కళ్లు

లేడి కళ్ళలా తీవ్రంగానూ, వేగంగానూ చలిసున్నాయి. వాడి నుదుట విభూతో, మరేదో కానీ బూడిద బొట్టింత వుంది. పైన ఏమీ ఆచ్ఛాదన లేదు. నడుముకి చిన్న పంచె లాంటిది బిగించి కట్టు కున్నాడు. ఒక చేతిలో సాంబ్రాణి ధూపం వేసిన పళ్ళెం వుంది. ఇంకో చేత్తో ఆ ధూపాన్ని సరిచేస్తూ, రయ్‌మని చూసుకుని, షాపు లోపలికి వచ్చేసి, షాపంతా ఆ ధూపాన్ని తిప్పి, అక్కడంతా పొగలేపి, మళ్ళా షాపు ఇవతలికి వచ్చేసి గుమ్మంలో నిలబడ్డాడు. నారాయణ పనాపి పది పైసలు తీసి వాడికిచ్చాడు.

వీరేశు ఆ ధూపం కుర్రాడిని ఎప్పుడూ ఆశ్చర్యంగా, సినిమాలో విచిత్ర సన్నివేశాన్ని చూసినట్టు చూస్తాడు. వాడిది పెద్దగా ఏమీ పెట్టుబడిలేని వ్యాపారంలా కనిపించింది. సాంబ్రాణీ, ధూపం బస్! అన్ని షాపుల్లోకి వాడికి ప్రవేశం వుంది నిర్నిభ్యంతరంగా, నిరాటంకంగా. అన్ని చోట్లా వాడికి దక్షిణముడుతుంది. ఎంత బావుంది వాడి వుద్యోగం...! గొప్ప బిజీ మనిషాడు!

వీరేశు నిట్టూర్చాడు తనని చూసుకుని. దాదాపు రెండు వారాలయ్యూ తను మంచం పట్టిపోనాడు. నీళ్ళ మోతలేదు. అళ్లు మొదట కబుర్లు పెట్టేసు-ఏమయిందని, ఎందుకు నీళ్ళకి రావడం లేదని. తను కబురెట్టేడు- ఇలా ఒంట్లో సుస్తీ గుందని. కావమ్మగారు బాధపడినా మానినా, తిట్టుకోక తప్పదనుకున్నాడు. ఇంకో అవిదాను- నీళ్ళ వాడకం ఆగిపోతే చిర్రెత్తిపోతారు. తిట్టేస్తారు! తను మంచం మీద పడుకుని మాత్ర మింగినప్పుడల్లా, నాలిక్కరచుకున్నప్పుడల్లా ఆళ్ళందరూ ఎంత తిట్టుకుంటున్నారోనని విచారించేవోడు. ఇన్నాళ్ళయిపోతే ఆళ్ళింక ఏంచేస్తారూ? ఇంకేదో ఏర్పాటు చేసేసుకునే వుంటారు. ప్చ్! రేపెళ్ళి కనుక్కోవాలనుకున్నాడు.

బతికితే ఏ షాపో పెట్టుకుని నారాయణలా బతకాలి. అందుకు స్తోమత లేదు తనకి. లేదా ఇదిగో ఈ ధూపం కుర్రోళ్ళా అదట్టుకు తిరగాలి. దానికేనా ఎంతమందున్నారో? ఎంత పోటీవోఏటో? దేనికేనా బాగా కష్టపడాలి! కష్టానికి కండల్నీ తాకట్టు ఎట్టాల...!

"ఏటి వీరేశూ పరద్యానం గుంది పోనావు?"

నారాయణ మాటతో వులిక్కిపడ్డాడు.

అప్పటికి రెండు కుర్చీలు ఖాళీ అయ్యేయి.

పాసింజర్లు దాబాపు వెళ్ళిపోయేరు.

వీరేశు ఈఎనిమిదేళ్ళలో ఆలోచించడం బాగా నేర్చాడు. చూసిన పరిసరాలు, మనుషులూ, రకరకాల వాతావరణాలూ, సినిమాలూ అన్నీ అంతా వీరేశు ఆలోచనాశక్తిని పెంచుతున్నాయి.

కాని... ఏం లాభం? తన ఆలోచనలు తన ఒంటరితనాన్ని పోగొడతాయా? తనకంటూ తన వాళ్ళంటూ ఎవరయినా దొరికి, సుకవూ, తృప్తీ, శాంతీ, సంతోషవూ, హాయీ కలుగుతాయా? అది తన బతుకులో సాధ్యవేనా...?

నారాయణ చేత్తో భుజమ్మీద గట్టిగా తడితే మళ్ళా వులిక్కిపడ్డాడు వీరేశు.

"ఏట్రా అదీ?" అన్నాడు నారాయణ ఆశ్చర్యంతో.

"ఏటి?"

"కళ్లేటలాగ?"

అప్పటికి తెలిసింది, తనకి తెలియకండానే తన కళ్లు రెండూ చెమర్చేయని!

"ఏటయిందీ? ఎందుకలాగ?"

"ఏట్నేదు..." తుడిచేసుకున్నాడు.

"ఒరే! మనసుని తుడిచేసుకోగలవురా ఎర్రోడా? చెప్పరా సన్నాసీ! సన్నాసిగా వుండిపోతానని బయంగుండేట్రా?"

"అదేంగాదు... మావోళ్లు గురుతొచ్చి.."

"ఎవుర్రా, మీయత్తా?

"స్సె! అదిగాదు!"

"ఇంకెవుర్రా? మీ మావా?"

తల అడ్డుగా తిప్పాడు.

"ఒహో! మీ వోళ్ళంటే...ఒరాలా? ...అదేనా?"

వొరాలా?

తల తిప్పాడు అడ్డుగ.

"ఇంకెవుర్రా నీయమ్మ!" నారాయణ చనువుగా విసుక్కున్నాడు.

- "మాయమ్మే!"

నారాయణ వెంటనే తనలా అన్నందుకు నిట్టూర్చాడు.

"నీకు పుట్టి బుద్దెరిగాక మీయమ్మా, అయ్యా తెల్దేవో?"

"తెల్దు! కానీ అమ్మా, అయ్యా ఉన్నోళ్ళని చూస్తే ఆళ్లులేని లోటు తెలీకండా ఉండదుగదా"

"పాపం..." నారాయణ బాధపడ్డాడు.

"ఒరే, నీకు అర్జెంటుగ తోడు కావాల్రా. అవును. అద్దొరికితే నీ బాధంతా మటుమాయమైపోద్దిరా"

వీరేసు నవ్వేశాడు.

కళ్ళలో నీళ్ళతో నారాయణా, అందరూ అన్నీ మసక మసగ్గా కనిపించేరప్పుడు!

* * *

ఆ మరునాడు వీరేశు తను నీళ్లు మోసే కావమ్మ గారింటికి వెళ్ళాడు.

కావమ్మగారు వీరేశుని చూసి, పరిస్థితి విని చాలా విచారించింది. విచారిస్తూ, అతడి కష్టంలోంచి తన కష్టంలోకి వెళ్ళిపోయి బాధపడిపోయింది.

"నీ సంగతిసరే నా సంగతి చూడు. నాబాధ ఎవర్తో చెప్పుకోను? రెండు వారాలాయీ నువ్వు నాకు నామం పెట్టిసేవా? ఇక్కడేమో చుట్టాలొచ్చి దిగడ్డారా? వాళ్ళకి వండి వార్చుకోనా? నీళ్లుమోసి పోసేదా? మా . మొగాళ్లు ఆఫీసులకీ, చదువులకీ, రోడ్ల మీదికి, సినిమాలకేగాని, ఇంటి పన్లకి కాదుగదా! అన్నీ అమర్చి పెడితే మాత్రం పెళ్ళివాళ్లా బైర్దేరతారు గానీ ఇంటి పని చేయరుగదా. ఇంకో మనిషి కోసం విశ్వప్రయత్నం చేసేసు. ఈలోపున నా చావు నాదే. ఆఖరికి నా సంగతెలా వుందంటే...నా తద్దినానికి కూడా నేనే నీళ్లు తెచ్చుకోవాలి. నా వంట నేనే చేస్కోవాలేవో?!"

వీరేశు నవ్వు తొక్కి పట్టేడు బలవంతంగా.

"ఇంకో మనిషి దొరికేడామ్మా?" అడిగాడు ఆఖరి ఆశతో.

"దొరక్కపోతే నన్నీసరికి నువ్వు ఇలా ప్రాణాల్తో చూద్దువా...? అయిదా ్రోజులయింది, ఏదో పోస్తున్నాడు. పొయ్యనీయి"

వీరేశు ఏమ్మంటాడు? నోరింక విప్పలేకపోయాడు.

ఒక వాడిక పోయింది. ఒక జీతం

ఆదాయం పోయింది!

"ఎల్తాసమ్మగోరు దయుంచండి..."

కావమ్మగారు "వుండు" అంటూ లోపలికి వెళ్లొచ్చి, వీరేశకి ఒక చేతిలో రెండు రూపాయల నోట్లు రెండూ, ఇంకో చేతిలో రెండు లడ్డూలు పెట్టింది.

* * *

"జ్ఞాపకం వొచ్చేమా నాయినా?" అంటూ పలకరించింది వర్ధనమ్మ.

వీరేశు అలాంటి మాటకోసం సిద్ధంగానే వున్నాడు కాబట్టి ఏమి బాధపడలేదు.

వర్ధనమ్మా కావమ్మలాగే వీరేశు పని ఎగ్గొట్టెయ్యడం వల్ల తనకి కలిగిన కష్టాల్ని ఏకరువు పెట్టింది.

"ఎవుర్నయినా ఎట్టేసుకున్నారా నీళ్ళ వాడిక్కి" చివరి ఆశతో అడిగాడు.

"ఆఁ... పెట్టుకోకపోతే మాకు జరుగుబడో ... దినం తెల్లారాలా?"

గాలిపూర్తి తీసేసిన సైకిలు చక్రంలా అయిపోయాడు వీరేశు. ఏదో ఆత్రంతో

ఉండబట్టక, "ఎవ్వరమ్మా?" అడిగాడు.

"కాపమ్మగారికి పోసే నర్సింహులే మాకూ పోస్తున్నాడు. బతిమాలితే ఒప్పుకున్నాడు" అందావిడ.

"నర్సిమ్ములా?"



"ఏంవాడిమీదికి యుద్ధానికెడతావేవిటి? అట్లా అడుగుతున్నావు ? ఒద్దు సుమా. అలా చెయ్యకేం ? వాడినేనా మాకు సవ్యంగా వాడకం పొయ్యనియ్యి. నువ్వేమో నెలకి సగంరోజులు పడు కుంటావు. మరింక...మాకెవురో ఒకరు చెయ్యాలా"

"ఏటమ్మా! నానింతకాలం బట్టి తొంగుంటున్నానా. అలా మాట్లాడతారేటమ్మా? నాయంగ మాట్లాడండి కొంచెం. ఏదో ఈ నెల్లో కాస్త ఒళ్ళవు కయితే ... అంత బొత్తిగా ఇదిలేసట్టూ, మీకు నాను పనంతా ఎప్పుడూ ఎగ్గొట్టిసె సట్టూ..."

వీరేశుకి చాలా కోపం వచ్చేసింది.

వర్ధనమ్మ ఏమీ అనలేదు. లోపలికి వెడుతూ అంది "నువ్వు నీళ్ల పోసిన రోజులికి ఎంత రావాలి?"

వీరేశు మాట్లాడలేదు.

"ఫస్టుకొచ్చి అడుగు!"

తలుపు వేసేసుకొందావిడ.

ఆ రోజు తను లేస్తూనే ఏ ముఖం చూసేడు అని ఆలోచించాడు వీరేశు. తనిప్పుడు నారాయణ షాపులోనే పడు కుంటున్నాడు. తెల్లారి కళ్లు విప్పితే ఏం కనిపించిందీ...?ఆ రాత్రి ఎలకేదో తోసేసిందొక కత్తెరని. అది తన పక్కనే పడి వుంది. బోర్లగిలా పడుకున్నోడు కళ్ళిప్పి కత్తెర్ని చూసి ఫలిక్కిపడ్డాడు.

తనపని క్షవరం అయిపోయింది. ప్చ్!

ఇంకొక్క ఇల్లే వున్నాది ఎళ్లడానికి. ఇంకొక్క ఆశే వున్నాది అడగడానికి.

వెళ్ళాడు ఆ ఇంటికి.

ఆ ఇంటావిడ అట్టే ఏమీ మాట్లాడదు. ఆవిడ బాగా చదువుకున్న మనిషి.

ఆవిడ ఆ ఇంటి నాలుగ్గదుల్లోనూ, వెనక వంటగదిలో వుండదు. నడవాగదిలో వుండదు. వీధిగదిలో ఉండదు. మధ్య గదిలో పెద్ద పట్టెమంచమ్మీద పక్కనే ట్రాన్సిస్టరు పెట్టుకుని ఒక పుస్తకం పట్టుకొని కళ్లద్దాల్లోంచి నిశ్శబ్దంగా చదువుతూ రకరకాల భంగిమలలో వెల్లకింతలా పడుకుని, బోర్లగిలా, రెండుకాళ్లు ఎత్తిఆడిస్తూ, కూచుని ఒక్కాలు మడిచీ, ఒకటి కిందికి జారవిడిచీ పుస్తకాల్లో లీనమయిపోయి వుంటుంది. వంటకి ఆడమనిషి వుందావిడకి. ఇంటిపనులకి బంట్రోతు వున్నాడు. నీటివాడకానికి మాత్రం ఇంట్లో కుళాయి లేక, ఒక నుయ్యి వుంటే అందులో నీళ్లు అంతగా బావుండవంటూ వీధి పైపునించి మూడు నాలుగు కావిళ్ల మంచినీళ్లు వీరేశు చేత తెప్పించుకొనేది.

భర్త ఏదో ఆఫీసరు. మోటారుసైకిలు మీద ఆఫీసుకుపోతే, ఇద్దరే పిల్లలు కాన్వెంటుకు రిక్షామీద పోతే-వంటామె వంట వండిపోతే, బంట్రోతు పై బజారంతా చేసిపోతే, ఆవిడ తన భోజనం అయ్యాక పుస్తక ప్రపంచంలోకి వెళ్లి పోతుంది.

ఆ నెలలో వీరేశు సగంరోజులే నీళ్లు పోసిపోయేడని ఆమె అతడిమీద ఎగరలేదు. కోపగించుకోలేదు. ఇంత కాలమూ తను మంచినీళ్ల లేక ఎలా కష్టపడిందో ఏకరువు పెట్టలేదు. అసలు తనెలా ఆ లోటు భర్తీ చేసుకొందో చెప్పలేదు! వీరేశు చాలా ఆశ్చర్యపోయాడు అందుకు మాత్రం.

"తవరుకూడా నీళ్లవాడకానికి ఎవుర్నన్నా ఎట్టేసుకున్నారామ్మా?" అడిగాడు జంకుగానే.

'ఏం, తక్కినవాళ్లు అలా పెట్టేసు




కున్నారా?' అనలేదు ఆమె.

"లేదు..." అని అంది. పుస్తకంలో నుంచి తలపెత్తి వీరేశని చూసి.

'అమ్మయ్య' అని అనుకున్నాడు వీరేశు.

మనిషి బతుకులో ఈ 'అమ్మయ్య'లు ఎప్పుడో ఒకప్పుడు తటస్థించకమానవు. అవి ఎదురు చూస్తే రావు. రావాల్సి వుంటే ఆగవు. అప్పుడు మాత్రం అవి అమ్మ చేత్తో కలిపి పెట్టిన బువ్వలా తృప్తినిస్తాయి! ఆలి ఇచ్చే సుఖంలా తన్మయింతి కలగజేస్తాయి. ఆఫీసరిచ్చిన ప్రమోషనులా సంతోషాన్ని కలిగిస్తాయి! లాటరీలో ఏ బహుమతి తగిలినా పొందే ఆనందాన్నందిస్తాయి!

వీరేశు తేలిగ్గా వూపిరిపీల్చుకున్నాడు. ఫరవానేదులే ఈ వాడకం వున్నది! ఊరిచ్చే పదిహేను రూపాయల ఆదాయం వున్నాది తనకి!

తను అన్నాళ్ళూ రానందుకు ఏర్పడిన అపరాధం ఏమిటో చెప్పాడు వీరేశు ఆవిడకి. ఆవిడ విండి. తను కబురు పెట్టిన సంగతి కదిపాడు. తెలిసిందం దావిడ.

"రేపట్నించీ వొస్తానమ్మా"

"అలాగే.."

నమస్కారం పెట్టి, అక్కడినించి నడిచాడు వీరేశు.

రోడ్డు మీద నర్సింహులు కనిపించాడు కిళ్ళీ బడ్డీ దగ్గర, కాలుతూన్న చేంతాడు కొసతో బీడీ అంటించుకుంటూ. గుప్పున పొగ వొదిలాడు. బీడీ చివర ఎర్రగా రగిలింది నిప్పు.

వీరేశు గుండెలో ఎర్రగా రగిలినట్ల యింది అదే.

నర్సింహులు తనకంటే నాలుగయి దేళ్ళు పెద్దోడు. పొడుగ్గా, బలంగా వస్తాదు విగ్రహం లాగా వుంటాడు. వాడి వొంటిమీద ఒక్క పంచెతప్ప ఇంకేమీ కనిపించదు. వాడిమీద వాన పడితే దున్నపోతు మీద పడినట్టే. ఎండ వాడిని ఎర్రగా కాల్చడానికి జంకుతుంది.

చలి వాడిని చూసి ముడుచుకుంటుంది. యముడొచ్చినా వాణ్ణి ఎత్తుకుపోవడానికి ఎంతాలోచిస్తాడో అని అనుకుంటాడు వీరేశు.

నర్సింహులు ఊవూళ్ళో ఓడరేవులో ఏదో కూలిపని చేస్తాడు. ఆ ఆదాయం కాకుండా ఇలా నీళ్ళ వాడకంతో కొంత సంపాయిస్తాడు.

ఆ జంక్షనుకి కొంచెం దూరంలో నర్సింహులి పాక వుంది. వరాలు పాకకి దగ్గర్లోనే వుందది.

అదివరకూ వరాలుతో నర్సింహులు ఎప్పుడయినా మాట్లాడితే వీరేశు ఏమీ అనుకోలేదు కానీ.. వరాలు మీద తను మనసు పడిన దగ్గర్నించీ మాత్రం నర్సింహులు వరాలు దగ్గరగా వెడితే తనకి ఒంటికి కారం రాసుకున్నట్టూ, వాడు వరాలో కబుర్లాడితే తనకదోలా కంపరం ఎత్తిపోయినట్టూ అనిపిస్తున్నాది!

నిజానికి నర్సింహులు చెడ్డవాడేమీ కాడు. బలంగా వుంటాడు కాబట్టి కొంచెం విసురుగా మాట్లాడతాడు. తాగుతాడు కాబట్టి తప్పుడు మాటలు తరచుగా వాస్తాడు.

వాడి పెళ్ళాం వాడికంటే చిన్నదే, చక్కనిదే అయినా – వాడిలో నాలుగో వొంతు వుంది! వాడిలాగే బలమైన నలుగురు పిల్లలకి జన్మ ఇచ్చింది. తను మాత్రం ... జన్మంతా మంచానే పడి

వుంది, వాడు అప్పుడే 'పెళ్ళిపీట ఎక్క డానికి సిద్ధం' అన్నట్టుంటే, అది 'మంచం ఎక్కడానికే మనిషిని నేను' అన్నట్టుం టుంది!

వీరేశు మొన్న మొన్నటిదాకా నర్సింహుల్ని చూసి జాలిపడ్డాడు. నర్సింహులికి ఆరోగ్యం వుంది. ఇల్లూ వాకిలుంది. నికార్సుగ ఆదాయం వున్న వుజ్జోగం వుంది. పెళ్ళాం వల్ల మాత్రం సుఖంలేదాడికి — అనుకుని జాలిపడ్డాడు వాడి మీద.

వరాలుతో వాడు మాట్లాడితే మాత్రం జాలిపడ్డం మానేశాడు. తన జాలి తనని ముంచుద్దని భయపడ్డాడు. దానికి తోడు-నర్సింహులు నామం ఎట్టేస్తే (తన నీళ్ళ వాడకాలు, ఆడు లాక్కుని) జాలి స్థానంలో కోపం, పగలాంటివి నిలిచేయి!

వీరేశు వూపిరి వేగంగా పీల్చుతూ వదుల్తూ, అడుగులో అడుగువేస్తూ, నర్సింహులి వేపు చూడకూడదను కుంటూనే చూస్తూ, ఆకాసి ఎళ్ళకూడ దనుకుంటూనే బడ్డీ దగ్గరికి సోడా తాగాలనిపించి వెళ్ళాడు.

నర్సింహులే పలకరించాడు వీరేశుని.

"బావున్నాదా ఇప్పుడు ఒంట్లో"

కీచుమన్నాది సోడాకాయి.

ఆడు ఏళాకోళంగ అడుగుతున్నాడను కున్నాడు వీరేశు.

జవాబు చెప్పలేదు.

"ఏట్రా పలకవేం? ఓర్నీ అలిగినా వేందిరా నా మీధా నానేం జేసేన్రా....? ఒరే! నానేం నీ వాడకాలు బలవొంతాన లాక్కున్నానేట్రా? ఆళ్ళే పిలిస్తేనూ ... ఇంతకీ నామీదాళ్ళకి నిబ్బరం కుదిరింది... ఈడు ఏడాదిపొడుగూనా నీళ్లు పోసుకు పోతాడూ ... మనకి బొక్కెట్టీడూ అని"

గొంతులోంచి గుటగుటా దిగుతున్నది సోడా.

ఖాళీసీసా ఇచ్చేశాడు వీరేశు. జేబులో నుంచి పైసలు తీసీ ఇచ్చేడు బడ్డీవోడికి.

"నానెళ్ళాల్రా, ఇంకా చానా పనుంది!" అంటూ నర్సింహులు గబగబా వెళ్ళి పోయాడు.

"థూ!" అని నేలనవూసి, అక్కడి నించి నడిచాడు వీరేశు.



వీధికుళాయి ఎల్లమ్మ జాతర్లా ఉన్నాది కళకళ్ళాడుతూ. ఆడంగుల రంగురంగుల దుసులు, రకరకాల వయసుల మనుషులు, అంతా సందడీ, అంతా రొదరొదా!

తాగుబోతు భద్రయ్య అంత దూరా న్నున్న తన పాకలోంచివచ్చి యిక్కడే ముఖం కడుగుతాడు. పందుంపుల్లతో పక్కా పావుగంటసేపు పళ్లు తోవుతాడు. అంతసేపు ఎందుకంటే కుళాయిదగ్గర నీళ్ళోస్కునే ఆడంగుల అందాల్ని చూడ్డా నికి. వాడికి జీవితంలో అత్యంత ఇష్ట మైనవి—ఒకటి గొంతులోకి సీసాలు. రెండు కూయడానికి బూతులూ. మూడు చూడ్డా నికి బూతు దృశ్యాలూనూ.

వాడు పూరాగా తాగినప్పుడు అల్లంత దూరాన్నుంచి "జయ జయా!" అంటూ

వస్తాడు. అది వాడి పారిభాషిక పదం! వాడి వాక్స్రవంతికి అది తొలిపదం. ఆ తర్వాత ఇంక "అమ్మా, ఆలీ" అంటూ అలా ఆకాశంలోకెందర్నో పంపేస్తాడు.

అప్పుడప్పుడూ రాత్రి నిషా ఇంకా దిగనప్పుడు కుళాయిదగ్గర స్నానం చేసే ఆడవాళ్ళని చూసి ఏదో బూతుకూత కూయడం, అందరిచేతా అక్షింతలేయించుకోవడం వాడికి మామూలే. అవాళా అలాగే ఆ వీధిలోనే వున్న సలభయి ఏళ్ళ విధవరాలు గంగమ్మగారు తన సహజధోరణిలో కట్టుకున్న పల్చటి తెల్లచీరతో కుళాయి కింద మునిగింది. ఎంత భర్త లేకపోయినా, ఆవిడెంత మడీ ఆచారంతో వుంటున్నా, మనసు దేవుడ్నే కోరుతున్నా, సలభయిఏళ్ల వయసు ఏ మడిముసుగులో దాక్కుంటుంది? తడితడి చీరె వంటివొంపుల్ని ఇవతలపడేస్తోంటే..చూసేవాళ్లు నిశ్శబ్దంగా ఆవిడందాల్ని అపుపోశన పట్టేస్తోంటే... భద్రయ్య వూరుకోక ఏదో కూశాడు. అంతే! గంగమ్మగారు గంగాప్రవాహం లాంటి తిట్లతో వాణ్ని ముంచెత్తింది. భద్రయ్యా వూరుకోలేదు. కాసేపు అలా ఇలా అరిచి గెంతేడు. ఆవిడెళ్ళిపోయింది తరవాత వాడూ వెళ్ళిపోయాడు.

అక్కడ ప్రశాంతత ఏర్పడింది.

మళ్లా ఏవో కబుర్లు. పలకరింతలూ, పరాచికాలూ, నీళ్ల పట్టడం ఆలీశెం అయిపోతున్నందుకు విసుగులూ, అసహనాలూ. అప్పుడే అక్కడే చేబదుళ్ళూ!

"కాస్త కాఫీపొడుంటే పంపిస్తారా పిన్నీ?"

"అలాగేనమ్మా. ఇదిగో నీదయిపోయేక నా బిందిపెట్టూ!"

"మీ ఇంట్లో పంచదారుంటే ఇద్దురూ చిన్నగ్లాసుడు. రేపే పంపించేస్తాను"

"అయ్యో! అయిపోయిందొదినే. మాకూ నిన్ననే"

"ఈ మజ్జినేం సినిమాల్కొసే రక్కా?"

"నా మొహం! నాకీ సంసారంతోనే సరి. మీరేం చూసేరూ? అలంకార్‌లో పిక్చరు బావుందిటగమా?"

"ఆ...బావుంది! హీరోయిన్ చీరె చాలా బావుంది డ్యూయెట్టులో! చెవులకి కొత్త ఫాషను జూకాలు బావున్నాయి"

"అది ఏ సర్టిఫికేటుట. 'ఏ' అంటే మావారు ఎర్రగా చూస్తారు నన్ను"

ఆ మాటకి అక్కడ కొంత మంది నవ్వేరు.

"ఏవిటో పిచ్చి! 'ఏ' లేనిదెక్కడ చెప్పు వొదినే" అంది ఒక సలభై ఏళ్ళ నాంచారమ్మగారు నవ్వుతూ.

అంతలో నర్సింహులు వరాల్ని పలకరించాడు— "ఏంటే వొరాలూ! మరమరాలూ" అంటూ. వరాలు వాడిని కసురుకుంది.

"నీకు నీళ్లు దొరకనేదేటి?" అడిగాడు వాడు.

"ఎప్పుడనగా వొచ్చినానూ? నాకాళ్లు పడిపోతన్నాయి గానీ... నీళ్ళు దొరక్కుండున్నయి. మోసేది నాలుగు బిందిలు. ఆటికే తెగ బాధగుంది!"

"నీకొక్కొత్త సినిమాకి టిక్కెట్టేనా దొరుకుద్దిగానీ, ఇక్కడ నీల్లంత బేగా దొరక వేటనుకున్నావో?"

ఆ మాటకి వరాలు గలగల నవ్వింది.

దూరంనించి వస్తోన్న వీరేశుకా దృశ్యం గుండెలో గులకరాళ్లు చిలకరించినట్టు చేసింది.

భుజంమీద ఖాళీ కావిడే నీళ్ళతో నిండి

నట్టూ బరువుగా తోచింది! ఇప్పుడందులో ఉన్నవి ఏటి? నర్సిమ్ములి మీద కోపవా? కసా?-ఆ రెండూ డబ్బాల్లో నిండిపోయి భుజం బరువెక్కిపోనాదా?!

ఎండ మండిపోతోంది! 'చేతకాని వాడి శౌర్యంలా.......'అని అనుకున్నాడు వీరేశు. అది తనని వుద్దేశించి అనుకున్నా ఎందుకో గానీ ఆ 'మాట బాగోలేదనిపించింది. చేతగానివాడి శౌర్యం ఆడినే తప్పా ఎవర్నీ ఏవీ చెయ్యలేదు! ఈ ఎండేటి? అందర్నీ కాల్చుకుతింటోంది! దీనమ్మా ఇది తన మేనత్తకి అత్తలాగుంది. నర్సిమ్ములుకి బాబులాగుంది.

కుళాయి దగ్గర పడింది.

కావిడి దించాడు వీరేశు.

గుండెలో బరువింకా దిగలేదు.

ఆసరికి నర్సింహులు ఏదో సరదా మాటంటే వరాలు పగలబడి నవ్వుతోంది! కళ్ళు నవ్వుతో నీళ్ల నింపుకున్నాయి. పమిట జారి వేలాడుతోంది. నడుం మీద చెయ్యి వేసుకుని, ఇంకోచేత్తో పొట్ట పట్టుకొని వరాలు పట్టలేని నవ్వు నవ్వుతోంది. జాకెట్టు లోంచి ఉప్పొంగిన రొమ్ములు నిలవలేమన్నట్టు ఎగిరెగిరిపడుతున్నాయి.

"వోలమ్మా! ఆగరా బాబో. నాపొట్ట సెక్కలవుతాదేంటో" అంటోంది వరాలు.

నర్సింహులు దాని రొమ్ములవేపు తెగ దాహంగా చూస్తున్నాడు. అప్పుడు వాడి ముఖంలో కనిపించిన దాహానికి ఆ కుళాయిలో ఉన్న నీరంతా చాలదేవో అనిపించింది వీరేశుకి. వాడు వరాలు మీద ఒక్క కన్నేమిటి రెండు కళ్ళూ వేసేడనుకున్నాడు.

వీరేశు గుండె పొంగింది ఆగ్రహంతో, కసితో, ఉక్రోషంతో, వుడుకుతో. నర్సింహులు రావణాసురుడిలా కనిపించాడు. వాడు తన సీతని ఎత్తుకుపోవడానికి సిద్ధంగా ఉన్న వాడిలా కనిపించాడు.

ఇప్పుడు నవ్విస్తున్నాడు. తర్వాత దాన్ని ఏడిపిస్తాడు. ఆడి పెళ్ళాం దాని జుత్తట్టుకుని, దాని పాలిట దెయ్యమయి పీక్కుతింటాది. ఆ సంగతెలికా నవ్వేస్తోందిది. ఎర్రి మొకం ఎర్రిమొకవాని!

"ఏటే నవ్వూ?" అడిగాడు వీరేశు వరాలుని.

"ఏట్నేదులే..." అంది వరాలు.

దాని మాటలో తనపట్ల ఏదో ఉదాసీనత, నిర్లక్ష్యమూ కనిపించాయి వీరేశుకి. 'మా నవ్వు గురించి నీకెందుకులే!' అన్నట్టుంది. ఉడుక్కున్నాడు.

"వరాలూ ఏటదీ?!" కసిరినట్టే కేకేశాడు.

"నీకు బొత్తిగ ఈమజ్జె బ్రురపోతందేటే? ఏంటా జుత్తూ, బట్టా, ఆవాటంవూ? సినీమాల్చూస్సూసి బొత్తిగా రవుడీ రంగమ్మనాగా తయారయిపోతన్నావు!"

వరాలు గయ్యిమని లేచింది.

"ఏటంటన్నావూ? ఇదిగో వీరేశూ! కసింత ఒల్లు దగ్గరెట్టుకొని మాట్టాడు. అధార్టీ చేయబోకు నామీద ఆఁ... ఏదో కసింత చనువుగా నీతో ఈమజ్జె ఉంటన్నానని అధార్టీ సేస్తన్నావేంటి?"

ఆశ్చర్యపోయాడు వీరేశు.

పట్టపగలు ఆకాశంలో చుక్కల్ని చూసినట్టు విభ్రాంతి పొందాడు. సముద్రం ఒడ్డునిదాటి, ఇసికలోంచి అమాంతం వూళ్ళోకి వొచ్చేసినట్లూ... నిశ్చేష్టడయ్యాడు.

అతనీ స్థితిలోంచి తెప్పరిల్లేలోపునే




వరాలు తన బిందె నింపుకుని, చిరచిర లాడుతూ వెళ్ళిపోయింది.

వీరేశుని చూసి నర్శింహులు ఎగతాళిగా ఇకిలించాడు. వొళ్ళు మండిపోయింది వీరేశుకి. వరాలు వాడి కబుర్లకి లొంగి పోయి నవ్వేస్తోందనాడికి గొప్పగా ఉంది. వరాలు తనంటే లక్ష్యం లేకండా ఉన్నా దనాడికి సంతోసంగా ఉంది. వరాలింక ఆడి సొత్తేనని కాబోలు గర్వంగా ఉందాడికి!

కోపం వచ్చేసింది వీరేశుకి.

ఎంతో నీరసం కూడా వచ్చేసింది.

అమాంతం నర్శింహులిమీదికి దూకి, ఆడి పీకెని పట్టుకు నులిమెయ్యాలనిపిం చింది కోడి పీకెన్నులిపేసినట్టూ. ఏట కత్తితో పటక్కని ఆడిన్నరికెయ్యాలని పించింది. పెద్ద గోతిలోకి తోసేసి, పూడ్చెయ్యాలనిపించింది.

వరాలుమీదా అంత కోపమూ వచ్చింది.

వరాలు ఈడిదన్న సూస్కునే, తనమీద చారులో పోపుపడినట్టూ సుయ్యి కయ్యి మంటోంది.

వీరేశు అవాళ నరసింహులు రోడ్డుమీద ఏ బస్సుకిందనో పడిపోతే బావుండు ననుకున్నాడు.

నర్శింహులు నిబ్బరంగా కావిడి నింపుకుని వెళ్ళాడు.

వీరేశు నేలన 'థూ' అని వూశాడు.

కుళాయిదగ్గరందరూ వీరేశని ఆశ్చ ర్యంగా చూశారు. కొంతమంది నవ్వు కున్నారు. కొంతమంది వేళాకోళంగా చెప్పుకున్నారు. కొంతమంది వీరేశు తరఫున మాట్లాడేరు.

"రేయ్ ఈరేశా! ఏట్రా వొరాల్ని నిన్నింత గడ్డిపరకలా ఇదిలించేసినాదీ? రేయ్! దానికి తగ్గ పాఠం చెప్పరా. మగోడివనిపించుకోరారే!"

"ఇంతకాలంనించీ నీతో అంత ప్రేమగా ఉండేదానికిప్పుడేటొచ్చిందిరా? ఏటొచ్చిం దటా తెగులూ? నీకేం తక్కువని? ఓ మాట అండానికీ, అడగడానికీ హక్కునే ద్రేట్రా?"

"అస్సలు నీకు లేనిదేట్రా? దానికున్న దేట్రా? ఆ పాచిపనీ, చవ్వడానికి సిద్ధం గున్న తండ్రీ...ఏటుందానికి? వూ మిడిసి పడిపోతన్నాది. అంతోటి సదువున్న కాలేజీ పిల్లలా, పేద్ద డబ్బున్న అమ్మాయిలా...ఏటుంద్దానికి?"

"ఆడికి మాత్తరం ఇప్పుడేటుంది?" ఎవరో అన్నారు గబుక్కున.

వీరేశు వులిక్కిపడ్డాడు.

"ఉన్న వోడికలూ పోయేయి. ఏదో ఒకిల్లుచేస్తే ఎంతొస్తాదిలే? ఒక్కడయితే మాత్తరం ఈ రోజుల్లో మండిపో తోన్న ఈ ధరల్లో ఏం తింటాడాడు? ఆ నారాయణ ధరమంవాని బతుక్కొస్త న్నాడాడు! ఇంక పెళ్ళాన్ని కూడా తగిలించుకుంటే, 'తాను దూరడానికి కంతనేదు గానీ...మెళ్ళో డోలు కూడాను' అన్నట్టుంటూంది యవ్వారం!"

ఆ చివరి మాటకి కుళాయి దగ్గర చాలామంది పెద్దపెట్టున నవ్వేరు. వీరేశు తల ఒంగిపోయింది. నిజవే! తన పరిస్థి తలాగే వుంది! ఆళ్ళంటే ఎందుకు కోప గించుకోవాల? ఎందుకు బాధపడాల?

తనకేధెయిర్నెం వుందని వరాల్ని తనకి బతుకులో తోడుగా పిలుస్తాడు?! దాన్నెం పెట్టి పోసాకారం చేస్తాడని పెళ్ళి వూసెత్తుతాడు? అస్సలు వొరాలిమీద తనకేం హక్కుందని!

ఇప్పుడు తనకంటే అదే న్యాలూపాయ

లెక్కువ గడిస్తున్నాది. అందికే ఆ మిడిసిపాటు అనుకున్నాడు కావిడి ఎత్తుకుంటూ.

*   *   *

ఆకాశం బాగా మబ్బుపట్టివుందవాళ. సూర్యుడు అయిపులేడెక్కడా. గాలీ పత్తాలేకుండా పోయిందెటో. వాతావరణం అంతా అదొకలా గుడ్డి వెలుగులో వుక్క-వుక్కగా, చికాగ్గా వుంది.

ఇళ్లల్లో వున్న మగాళ్లు లుంగీలు, బనియన్లతో రోడ్డుమీదికి వచ్చేస్తున్నారు గాలికోసం. ఆడాళ్లు ఇళ్ళల్లో అరుగుల మీదికి చేరి విసనకర్రతో విసురుకుంటు న్నారు.

అప్పుడు మధ్యాన్నం రెండు గంటలు. శెలవరోజు కావటాన ఆఫీసులు మూసే సారు. కొన్ని షాపులు కట్టేసారు.

మేట్నీ సినిమాకి వెడదామని బైల్దే రాడు పీరేశు. పదిరోజులైంది సినిమా చూసి. ఈమధ్య ఎదురయ్యే పరిస్థితులతో బుర్రంతా చికాగ్గుంది! సినిమాకెడితే కసింత కులాసగుంటుందని బైల్దేరాడు. కానీ... ఎళ్లేసరికక్కడ పెద్ద రైలు బండిలా క్యూ వున్నాది. అక్కడికీ ఆశ చావక చివర్న నిలబడ్డాడు. టిక్కెట్లి

వ్వడం మొదలయింది!

వెయ్యి కళ్ళు చేసుకుని క్యూని చూస్తూ జరగసాగాడు. గోడలమీద ఆ సినిమా బొమ్మల్ని చూసి, దానిమీద వరాలు మీదంత ఆశ పెట్టుకున్నాడు! కానీ, ప్చ్! తన ముందు నలుగురుండగా 'హవుసుఫుల్' అట్ట తగిలించేసేడాడు. ఆశ నీరు కారిపోయింది!

ఉసూరుమంటూ అడుగులో అడుగేసుకుంటూ వెనక్కి బైల్దేరాడు. తలెత్తి చూశాడు. ఎండే లేదు. అంతా మబ్బు మబ్బు. రోడ్లు కొలుస్తూ, అటు ఇటు చూస్తూ నడవసాగాడు.

"రేయ్, ఈరేశా!"

ఆ కేక విని వెనక్కి చూశాడు. కుళాయి దగ్గర నీళ్ల పట్టుకుందుకి వచ్చే గంగులు మావ!

పొట్టిగా, బలంగా, బాగా తర్రిగా, ఎంతో సంతోషంగా ఎప్పుడూ కనిపిస్తాడు గంగులు మావ! విచారం, బాధ, బరువూ అలాంటివి గంగులు దగ్గరికెళ్ళడానికి మొహమాటపడతాయేమో అనిపిస్తుంది—వాడిని నిత్యవూ చూసేవాళ్ళకి.

గంగులుమావ తనింటికి నాలుగైదు బిందెల్లో కుళాయి నీళ్ల పట్టడం తప్పా ప్రత్యేకించి ఫలానా పనంటూ ఏదీ చెయ్యడం చూడలేదు వీరేశు. అంచేత వాడికి నెలసరి ఆదాయం ఎట్లా వస్తాదని మొదట్లో ఆలోచించాడు. ఆ తర్వాత గంగుల్నే అడిగేశాడు. గంగులు ఫెళ్లున పుచుమురిమినట్టు నవ్వి, బ్రాకెట్టాడతానని చెప్పాడు. ఇంకా మూడుముక్కలాడతానన్నాడు. వాట్లో తన చేతికి ఎదురులేదన్నాడు. ఎంతో కొంత పలక వలసిందేనన్నాడు. ఇంకా తను సినీమా హాళ్ళ కాడ 'బ్లాకు పని' చేస్తానన్నాడు. సినీమా టిక్కెట్లు మామూలు ధరకు కొనేసి, బ్లాకులో అమ్మితే శానా పలుకుద్దన్నాడు!

'ఓర్నీయమ్మా! ఇంకెందుకురా నీకు ఇంకో వుజ్జోగవూ?' అనుకున్నాడు వీరేశు మనసులో.

"ఏడకెళ్లొస్తన్నావురా?" అడిగాడు గంగులు మావ గబగబా వచ్చేసి. వీరేశు నడుం చుట్టూ చేతులు చుట్టి బుగ్గ మీద ముద్దుపెట్టుకున్నాడు. వీరేశు ఇలా వంటరిగా దొరికితే గంగులు మావ అలాగే చేస్తాడు. "ఒరే! నిన్ను సూస్తే నాకు ముద్దొస్తదిరా!"

"స్సీ! నానేం ఆడదాన్నేటి?"

"కావుగానీ అంత మెత్తగానూ, అంత గ్లేమరుగానూ నాక్కనిపిస్తావురా!"

వీరేశు తనని తను చూసుకున్నాడు. అలగంటదేటీడూ?!

"ఈరేశా! నీ వొళ్లు ఆడదానికిమల్లే నున్నగుంటదిరా ఎక్కడా ఎంట్రుకే నేకండా సూశావా? నీకు గెడ్డవూ అంత యిదిగా మొలవదు. మీసాలు అంతంత మాత్తరంగుంటాయి. నీ కళ్ళా? వారసూపుల్తో వాల్లడల్ని మర్చిపొమ్మంటాయి రారే"

"ఏటి! కయిత్వం సెపతన్నావేటి ఇవాళ?" వీరేశు అడిగాడు నవ్వుతూ.

"ఒరే! ఒక్కసారి నిన్ను నా రూముకి ఒట్టుకుపోదారనుందిరా" అన్నాడు గంగులు మావ!

"రూమా? అదేటడీ? నీకిల్లుంది. నీ పెళ్లాం, పిల్లలూ..."

"హైయ్! ఆళ్ళకదిల్లు. నా పరసనల్‌కి ఏరే రూము తీసుకున్నా నా టవున్లో. సూడు యిప్పుడు నివ్వేంజేస్తవ్? నీళ్ళ




వాడకం నేదుగదా. ఖాళీయేగదా. ఎక్క ణ్నించి వొస్తన్నవు?"

చెప్పాడు వీరేశు.

"ఓర్నీయెమ్మా! ముందుగా నాకు సెప్పే నివ్వీసరికాసిన్నా చూసేస్తుండేవా? ఈవేలి సెప్పేం. సరేగానీ రారొయ్!"

వీరేశుని ఆలోచించనివ్వకుండాలాక్కు పోయాడు గంగులు మావ.

మార్కెట్టుకి వెనక సందులోకి తీసుకు వెళ్ళాడు. చిన్నగది. ముందు మురు క్కాలవ. కంపుతో ముక్కులు బద్దలై పోతాయనిపించింది వీరేశుకి. అక్కడ వీధి దీపంలేదు. అంతా చీకటి. మురుగుకంపు. దోమలు వీరవిహారం చేస్తున్నాయి. కుక్కలు కుయ్యిమని కాళ్ళకడ్డంపడితే గంగులు రాయితీస్కుని వాటిని తరిమే శాడు.

బొడ్లో తడివి బీడీతీసి వెలిగించుకు న్నాడు. రూము తలుపు తట్టేడు! 'అంటే లోపలెవురో వున్నారన్నమాట!' అనుకున్నాడు వీరేశు. వాడికి ఎందుకో ఇలా రావడం యిబ్బందిగా అనిపించ సాగింది.

కాస్సేపట్లో తలుపు ఒకటి తియ్య బడింది. గంగులు వీరేశు చెయ్యిపట్టుకుని లోపలికి లాక్కువెళ్ళాడు. ఆ వూపులో వీరేశు పడబోయి ఆచుకుంటే మెత్తటి వొళ్ళు తగిలింది ఒంటికి. తుళ్లిపడి చూశాడు. ఎవరో ఆడమనిషి వయసులో పిటపిటలాడుతోవున్నాది! మొహం అంత బాగోలేదుగానీ వొళ్లు సిలువునా బాగున్నా దనిపించింది!

వాల్జడ వేసుకుంది. నెత్తిమీద జుత్తు చెదిరి, నుదుటిమీదా, చెవులమీదా చిందర వందరగా పడుతోంది. చెవులకి ఏవో రింగుల్లాంటివి పెట్టుకుంది. కళ్లు ఎదటి మనిషిని కామంతో నవిలేసి మింగేసేటట్టు న్నాయి. కిందిపెదవి కొంచెం జారి కాంక్షని రేపుతున్నట్టుంది. మెడలో ఏ వస్తువులూలేవు. గుండెలు సగం కని పిస్తూన్న జాకెట్టుదాకా మెడ నగ్నంగా వుండి 'నాదేంలేదు, నీదే ఆలశ్యం' అన్న ట్టుంది. ఆ తర్వాత నల్ల జాకెట్టు కింద పొట్ట మడతలు, బొడ్డు కిందికి కట్టిన నల్లచీరె, చూపు చెదరగొట్టే జఘన భాగాలు అన్నీ అంతా వీరేశు కళ్ళని కదల నియ్యకుండా నిలవేశాయి.

కొంతసేపటికి తేరుకున్నాడు వీరేశు.

"ఈడు నా స్నేహితుడే! శానా మంచోడు. ఇది మన బెస్టు ఫ్రెండు, ఈరేశా! మీ యిద్దరికీ స్నేహం సేయిద్దా రని తీస్కువొచ్చేసు. ఇదిగో కాంతం... ఇంతదాకా ఏం జేస్తున్నావు?"

కాంతం నవ్వి "నిద్దరోతన్నాను. నివ్వు రాకపోతే ఇంకేటి సేస్తాను.నివ్వొస్తే అది నాకు దక్కనియ్యవుగదా?" అంది.

వీరేశు బోధపర్చుకున్నాడు.

"సూడు-ఇది గొప్ప పతివ్రెత. ఏటం టావు? నిజెంగా పతివ్రెతంటే ఏటి? మొగుణ్ని తప్ప ఇంకోణ్ణి సూడక పోవడవూ, భూమికి కళ్ళు నొక్కేసు కోడమూకాదు!.. మొగుణ్ని సుకపెట్టాల. అడికెప్పుడేదికావాలో దానికి ఎంత యిబ్బందయినా లెక్కజెయ్యక యివ్వాల. ఏటంటావు? మా కాంతం నిజెంగా పతి వ్రెత" అని...

"ఆ గూట్లో సీసా విలాస్తావే" అన్నాడు గంగులు.

కాంతం పొడుగ్గా, నల్లగా వున్న సీసా, రెండు గాజు గ్లాసులూ, ఒక గిన్నెతో మంచినీళ్ళూ తెచ్చి అక్కడ చిన్నబల్ల

మీద పెట్టింది.

నేను పోతానింక: అన్నాడు వీరేశు.

"ఓరి! ఓర్నీ, రామాయణమంతా విని రావుడికీ సీతకీ సంబంధం ఏటో అడిగినట్టు ఇంతా అలకించీ ఇప్పుడెళ్ళిపోతానంటవేట్రా ఎర్రిపీనుగా! కూకో కూకోద్దా" అంటూ చేతులు పట్టుకుని అక్కడ పట్టెమంచం మీద కుదవేశాడు గంగులు వీరేశుని.

ఒక గ్లాసులో ఆ సీసాలో ద్రవం పోసి వీరేశుకిస్తూ "తీస్కోరారే! నీకు ఇది కావాల. శానా అవుసరం నీకిదని నాకు తెల్సు! సువ్వొంటిగాడివి, వయసులో వున్నోడివి గ్గనక మందుండాల. నేకుంటే నీ బుర్ర ఎర్రెక్కిపోతాది. నీల్లు మొయ్యే నేవు, నిద్దరోలేవు! కుదురుగా, ఆరోగ్యంగా వుండలేవు ఇది పడకపోతే...ఇంద!"

వాసన గుప్పుమంది. వీరేశు వెలప రించుకున్నాడు. వద్దన్నాడు. గంగులు వినలేదు. వుపన్యాసంతో వీరేశు చెవుల్లో మందు సుఖాన్నీ, లాభాన్నీ, హాయినీ ఆనందాన్నీ, తృప్తినీ అమృతం లాగా పోశాడు. గ్లాసెత్తి వీరేశు నోట్లో తనే పోశాడు. నోరు చేదుచేదయిపోయింది. గొంతు మండింది. అయినా గుక్క దిగి పోయింది. గ్లాసు పూర్తిగా ఖాళీ చేసే దాకా వదల్లేదు గంగులు. తర్వాత తను తాగేడు. క్రమంగా వీరేశుకి మైకం ఎక్క సాగింది. గంగులు మసగ్గా కనిపించేడు. వాడు బాగా మందు పట్టించేసి, వెనక్కి వాలిపోయాడు. వీరేశు అయోమయంగా చూస్తుంటే మెత్తటి చెయ్యి వాడి చేతిని పట్టుకుంది. వులిక్కిపడ్డాడు. కాంతం రెండు కాంతాలయి కనిపించింది.

"కాంతం...కాంతం" అంటూ కలవ రిస్తున్నాడు గంగులు—కొంచెం తెలివిలో, ఎక్కువ మత్తులో, నిద్రావస్థలో.

కాంతం గంగులు గుండెమీద చేతో రాసి, వాడిని బోర్లగిలా తిప్పి నిండా దుప్పటి కప్పింది. గంగులు ఏ లోకానికి వెళ్ళిపోయాడో కానీ కదల్లేదింక!

ఆ తర్వాత కాంతం వెళ్ళి తలుపు గెడవేసి వచ్చింది. వీరేశుకి దగ్గరగా వచ్చి, అతని మొహంలోకి చూసి నవ్వింది. వీరేశుకి నవ్వురాలేదుకానీ నరాలు పొంగేయి. కాంతం అతన్ని చేత్తో చెయ్యి పట్టి కిందికి లాగింది. వీరేశు అసలే మందు మీదవున్నాడేమో ఆ ఊపునకు అమాంతం కాంతంమీదికి పడిపోయేడు.

మెత్తటి చేతులు ఒంటిని తడువు తున్నాయి. చొక్కాని విప్పేసేయి. షరాయిని కూడా...... మొహానికి మొహం. ఛాతీకి ఛాతీ. ఒంటికి ఒళ్ళు! చల్లగా—వెచ్చవెచ్చగా—మెత్త మెత్తగా— మత్తుమత్తుగా-గదంతా రంగులరాట్నం అయి తిరుగుతోంటే— నెత్తురు వుడుకెత్తి పరుగెత్తి, వురికి, జలపాతం అయి - ఆగి ప్రవహించి, వేగం తగ్గి......!

"నాకేంటో బయ్యంగుంది..."

మెత్తటి నిండు గుండెల మధ్య అతడి పెదవులు గొణిగాయి.

"తొలుత్రయితే ఎవురికేనా అలాగే వుంటాది..."

"ఆడికన్నాయం సేస్తన్నాను..."

"ఒల్లకో! అదేం నేదు. ఆడికి నా నొక్క త్తినేకాదు. ఇంకో ద్రివుంది...! నీకే ఎవ్వురూ నేరు... ఒల్లకో!"

రెండు చేతులూ రెండు స్వర్గాలయి మరోసారి పారిజాతాల నీడలోకి, కల్ప వృక్షం సన్నిధిలోకి, అప్సరసల కౌగిళ్ళ లోకి తీసుకువెళ్లాయతడిని ... ...!





ఆ తర్వాత గంగులు లేవక మునుపే వీరేశని లేపి, పంపించేసింది కాంతం.

* * *

'లోకానికి తన మొహాన్నెట్లా చూపడం?' అని మొహమాటపడుతున్నట్టు మబ్బువెనకనే దాగి వుండిపోయాడు సూర్యుడు—తెల్లవారినా కూడా.

కాకులతో లేచీ కావిళ్లు పట్టుకునే వాళ్ళకంటే కాస్త ఆలీశంగానే లేసున్నాడీమధ్య వీరేశ. వున్నది ఒక్కటే వాడిక! అదయినా నాలుగైదు కావిళ్ళు మాత్రం. అంతోటి పనికంత పొద్దున్నే లేవడమెందుకనుకున్నాడు. పడక మంగలి షాపులోనే! ఇల్లు తలంపు పెట్టుకోలేదు. ఇల్లేవిటి తనకి? ఆదాయవే అన్నాయమై పోతే!! పెళ్ళి, ఇల్లూ అలాంటి సుఖాలు ఆమడ దూరాన్నే వున్నాయింకా తనకి! అయితే-

'ఇలా ఎంతకాలం?'

అని అప్పుడప్పుడూ ఏ అర్ధరాత్రి తెలివిలోనో, ఏ మధ్యాన్నం ఆలోచనల్లోనో వెన్నుమీదెవరో చరిచిఅడిగినట్టని పిస్తాది!

ఆ ప్రశ్నకి జవాబేదీ...?!

వీరేశకి నిన్నటి అనుభవం జ్ఞాపకం వచ్చి గుండె ఝల్లుమంది! అరికాళ్ళలోకి ఒంట్లో నెత్తురంతా దిగినట్టయింది! కాంతం ఎందుకట్లా చేసింది? గంగులు మాప ఎందుకు తనని ఆడింటికి లాక్కెళ్ళాడు? ఆడికి తెలవకండా కాంతం తనతో కలిసింపంటే...ఆడంటే దానికేం నేదా? అలాగైతే ఎందుకాడితో వుండడం? డబ్బుకోసవా? అవకాశం వస్తే ఒదులుకోని మనిషా కాంతం...?

ఏదేమయినా తనని సుఖంలో ముంచి తేల్చిందది! అందుకు దానికి రుణపడి వున్నాడు.

వీరేశ ఎందుకో నారాయణ మొహం చూడడానికి జంకేడవాళ. నారాయణవేపు దేవుడి పటంలోకి చూడ్డవంత ఇబ్బంది పడ్డాడు. ఎంతయినా తను చేసింది తప్పే.

"ఏట్రా అలగున్నవు?" అడిగాడు నారాయణ.

"ఏట్నేదు..."

"ఏట్నేకపోడం ఏవిటి నీ మొఖం? ఏదోవుంది దాస్తన్నవు"

మళ్లా గుండె ఝల్లుమన్నాది వీరేశకి. ఈయనేటి ? పేషంటుని డాకటరు చూసినట్టూ చూస్తున్నాడియాళ తనని. జాతకంలోకి జ్యోతిష్కుడు చూసినట్టూ చూస్తున్నాడు. ఓరిబాబో! దేవాంతకుడు.

"ఏరా? మళ్లా బాగోనేదేంటి వంట్లో?"

"బాగానే వుంది" అన్నాడు.

"వాడికలు వూడిపోయేయని బాధ పడతన్నావా?"

ఆశ్చర్యపోయి వూరుకున్నాడు 'అమ్మయ్యా' అనుకుని.

"ఒరే, ఈరేశా! ఏం బాధపడమాకు. నీకెప్పుడూ నేనున్నాను. చూడు! నివ్వు దాచుకున్నావు గదా, ఇన్నాళ్ళ మొత్తంలో కొంత నా దగ్గిర? అది, ఇంకొంత కలిపి సిన్న బడ్డీ పెట్టి!"

"బడ్డీయా?!"

"ఏం? కిళ్ళీబడ్డి. నేనంతా సూస్తాను గదా. కొట్టుమీద కూకుంటావు. జాగర్తగ అమ్ముతావు. కొనేదీ, సర్దేదీ, లావాదేవీలన్నీ నేను దగ్గిరుండి సూస్తుంటాను! నీకూ నీళ్లకావిళ్ల మోతా, ఆ కష్టం వుండదు. బడ్డీ మీద లాబాలు నివ్వు తింటావు. తక్కుంది తిరుగుతూంటాది అటు ఇటూను"

వీరేశు ఆశ్చర్యంగా వింటున్నాడు.

"మొదట సిన్న బడ్డీ పెడతాం. సరుకులు తక్కువగ వుంటాయి! లాభాలూ, అమ్మకం, రద్దీ అదీ చూస్కొని బడ్డీ పెంచుతాం!"

'తన జీవితంలో ఇంకో మలుపు!'

"ఏటంటావు?" నారాయణ అడిగాడు.

'బానే వున్నాది గానీ, అలా సెయ్య గలవాని?"

"నీకు పెద్దానికీ అనుమానవేనా. సాహసం వుండాల!"

వీరేశు నెమ్మదిగా, నసుగుతూ అన్నాడు-

"సదిలోకి ఈ తరాకంతా గెంతడవూ సాహసవేను!"

"ఫర్వాలే! కబుర్లు నేర్చేవు మా వూరొచ్చి...సరేగానీ ... తొందర్లో ఆ ఏర్పాట్లు నేన్జూస్తాను. నివ్వు సిద్ధపడు"

వీరేశు వూరుకున్నాడు.

రోజులు జరుగుతున్నాయి. వుదయం, సాయంత్రం, రాత్రి-అలా వొచ్చి, వెళ్ళి పోతున్నాయి.

ఈ వారం-పదిరోజుల్లో నారాయణ తను వీరేశుతో చెప్పిన ప్రయత్నాన్ని అమలు పెట్టే సన్నాహాల్లో వున్నాడు.

ఆమధ్యనే-మళ్లా ఒకసారి. వీరేశుకి కాంతంతో ఏకాంతం కుదిరింది. అవాళ గంగులు మావ వీరేశుని పిల్చుకు వెళ్లలేదు. వీరేశే వెళ్ళాడటు. వాడి ఒంట్లో వేడి తీసుకెళ్లింది, సరాల్లో వెసుకటి మత్తు మళ్ళా కవ్వించి లాక్కెళ్లింది. కాంతం పరిష్వంగ సుఖం లాక్కెళ్ళింది. అలవాటులో వున్న బలహీనతది!

అప్పుడు కాంతం గదిలో గంగులు లేడు. వీరేశు ఏడని అడిగితే, ఎంతో సంతోషంతో ఎటోపోయేడని చెప్పింది. ఎప్పుడొస్తాడో తెలియదంది. అప్పటికి మాత్రం వెంటనే రాడంది.

రేగిన తలతో, జిడ్డు మొహంతో వున్న కాంతం అయిదే నిమిషాల్లో అప్సరసకి మల్లే తయారయి వచ్చింది! ఆ తర్వాత మరొక్క నిమిషం వృథా చెయ్యక వీరేశుని తనలోకి లాగి ముంచేసింది...వీరేశు తెప్పరిల్లుకునే సరికి వేళ ఎంతయిందో తెలీలేదు గానీ, వెంటనే తలుపు చప్పుడు అయింది! కాంతం తనే వీరేశుకి బట్టలు తొడిగేసి, పెరటివేపు తలుపుతీసి అటుతోసి, తర్వాత వీధి తలుపు తీసింది! గబగబా చీర, జాకెట్టూ సవరించేసుకుంది ఈ లోపున!

గంగులు గదిలోకి వచ్చాడు. వాడి లాల్చీ జేబులో సీసా వుంది. వాడికళ్లల్లో అప్పుడు ఎర్రజీరలున్నాయి. పెదాల మీద విడీవిడని నవ్వుంది. ఒక చేతిలో రెండు చేపలున్నాయి. సీసా మంచంమీద పడేసాడు. చేపలు కాంతానికిచ్చి "మాంచి కూరొండెయ్!" అని చెప్పాడు.

లాల్చీ తీసేసి దండెం మీద పడేశాడు.

కాంతం చేపలు పట్టుకుని ఆ గదిలోంచి వెనకవున్న చిన్న వంటగదిలో కెళ్లి, చేపలక్కడ పెట్టి, పెరటి వేపు చూసింది.

వీరేశు గుండెమీద చెయ్యివుంచుకుని దాని చప్పుడు వింటూ, ఆ సన్నటి సందులో భయంతో యిబ్బందిగా నించున్నాడు. ఆ వైపునించి పోవడానికి ఏతోవాలేదు!

తనెందుకు మళ్లా వచ్చాడిక్కడికి? కోరిక వెంటబెట్టి వచ్చాడు. ఖర్మం వెంట బెట్టి వచ్చాడు. ఇవాళ తన్రోజు బాగో లేదు!

తనియ్యాళ ఈ గంగులు మావ





పాలబడిపోవడానికొచ్చాడు. అది పంజాకి చిక్కిపోయి చావడానికొచ్చాడు.

తన ఆయుర్దాయం ఇయాల్తోసరి అని నిశ్చయించేసుకుని, ఆ సందులో మునీశ్వరుళ్ళా నిలువు తపస్సు చెయ్యసాగాడు.

కాంతానికీ చాలా ఇబ్బందిగా ఉంది పరిస్థితి. ఏం జగడం అవుతాదో? గంగులేం చేస్తాడో ఈరేశునని హడలి చస్తోంది.

నిమిషాలు గంటలవుతున్నాయి.

కొన్ని సమస్యలకి మనుషులు చెయ్యలేని పరిష్కారం కాలమే చేస్తుంది. గంగులు మంచంమీంచిలేచాడు. కాంతాన్ని పిలుస్తూ వెళ్ళాడు లోపలికి. సందులోకి అప్రయత్నంగానే చూశాడు. ఆశ్చర్యపోయాడు. వెళ్ళి వీరేశుని పట్టుకుని, గదిలోకి లాక్కొచ్చాడు. "ఏట్రా సంగతి?" అడిగాడు.

వీరేశు వణకసాగాడు.

"కాంతాన్ని మరిగేవా?" తాపీగానే అడిగాడు.

బదులురాలేదు.

"అది మప్పిందా? నువ్వే మరిగేవా?"

జవాబులేదు.

"ఎంతకాలంనించిలా?"

సమాధానం శూన్యం.

కాంతాన్ని పిల్చాడు. కాంతం వొణక లేదుగానీ, బొమ్మలా కదలక నిలబడిందలా.

"చెప్పకపోతే చంపేస్తానిద్దర్నీ!"

దభాల్న గంగులు కాళ్ళమీద పడిపోయాడు వీరేశు.

"నిన్ననా నీసుకొచ్చినకాణ్ణించేనా?"

బుర్రవూపేడు.

"ఎంగిలెధవా ఎంగిలెధవాని. థూ!"

వీరేశుకి తనకింకా ప్రాణం పోలేదేమనిపించింది.

గంగులు లాల్చీవేసుకున్నాడు. బైటకి వీరేశు చెయ్యిపట్టుకుని లాక్కువచ్చాడు. ఇద్దరూ నడుస్తున్నారు.

"నారాయణకి చెప్తాన్నీ సంగితి!"

వీరేశు వొణికిపోతూ వద్దన్నాడు. వాడి కళ్ళవెంబడి నీళ్ళు ధారాపాతంగా కారిపోతున్నాయి.

"చెప్పకపోతేకుక్కబుద్ధి తిన్నబడదు. మడిసిబుద్ధవదు. చెప్పేయాల్సిందే పదా"

భయంతో, జడుపుతో, అవమానంతో, సిగ్గుతో, దుఃఖంతో వీరేశు గంగులు చేతులు రెండూ పట్టుకుని నారాయణతో చెప్పవద్దన్నాడు. బతిమాలుకున్నాడు... వేడుకున్నాడు.

"నన్నేం సేస్తావో సెయ్యి. నాది పొరబాటే. నన్నందుకు కొట్టు,సంపు. కానీ నారాయణతో సెప్పొద్దు!"

గంగులు పెదాలు మూసి వెనక నవ్వుకున్నాడు.

"సెప్పన్లే ... కానీ, నానడిగిందియ్యిప్పుడు!"

"ఏటి?"

"నాకు అరిజెంటుగ వొందరూపాయిలు కావాల. నివ్వు రేపు పొద్దున్నకల్లా నాకా సొమ్మియ్యాల!"

వీరేశు హతాశుడయ్యాడు. వందా... ఎలా?!

క్రూరంగా చూశాడు గంగులు.

"ఆలోసిస్తన్నావా–ఇవ్వనా వద్దాని?"

తెల్లబోయాడు వీరేశు.

"నారాయణతో..."

"ఆగు. ఇస్తాను"

"నిజెంగానా ...? ఇవ్వకపోతే, తెల్సుగదా?"

గంగులు గట్టిగా నవ్వి వెనక్కి వెళ్ళిపోయాడు.

వాడి నవ్వు వీరేశున్నిలువునా జలదరింపజేసింది. తన బతుకులోకి ఆ నవ్వు బలమైన ఆయుధంలాగా చొరబడుతోంది. వెనకటి జీవితాన్ని అది సమాధి చేసేసుంది. బంగారంలాంటి భవిష్యత్తు మీద గొడ్డలిపెట్టు అవుతుంది.

అయిపోయింది – తన జీవితం, తన కోర్కెలు, తన కలలు, ఆశలు అన్నీ నాశనం అయిపోతాయి. అవన్నీ గంగులు పిడికిట్లో ఉన్నాయి.

పిచ్చిగా జుత్తు పీక్కున్నాడు వీరేశు.

ఎవరూ చూడకుండా సముద్రం ఒడ్డుకిపోయి ఒంటరిగా ఎంతోసేపు ఏడ్చాడు. అప్పటికి గుండె కొంత వుపశమనం పొందింది.

వందరూపాయిలు! తను నెలనెలా నీళ్ళ మీద వచ్చే రాబడిలో నారాయణ ఇంటి కిచ్చిందిపోను తన సిల్లర ఖర్చులకుంచుకున్నది కాక, తక్కింది నారాయణ దగ్గిరే దాచుకున్నాడు. అదంతా ఓ వెయ్యిదాకా వుంటాయి. ఈ మద్యను నీళ్ళ వాడుకలు రెండు పోయేక వచ్చే సంపాదన బాగా తగ్గిపోయింది. అయినా నారాయణ ఇంట్లో

అన్నం తింటున్నందుకు ఇయ్యాల్సిందే నారాయణెంత దేవుడి మనసుతో వారించినా వినలేదు తను. రెండుపూటలూ లాగించేస్తూ ఒత్తిపుణ్యేనికెలా వుంటా డివ్వకా? మనసు ఒప్పొద్దూ? నారాయణ భార్యకి ఆ నాలుగుకావళ్ల డబ్బు ఇచ్చేస్తు న్నాడు. తన సిల్లర కర్చులకి మాత్రం నారాయణకాడ దాచుకున్నదాన్లో కొంత కొంత అడిగి తీసుకుంటున్నాడు.

వీరేశు గట్టిగా నిట్టూర్చాడు. నారాయణని వందరూపాయిలు అడగా లనుకున్నాడు.



## 5

నారాయణ డ్యూటీసించి లంచవర్లో దిగినట్టు షాపులోంచి ఇవతలికి వచ్చాడు. అసిస్టెంట్లు లోపలున్నారు. ఇవతలే చిన్న బెంచీమీద కూచున్న వీరేశు నారాయణ రాగానే లేచినిలబడ్డాడు.

"అదేట్రా! స్కూల్లో కుర్రోడు హెడ్డు మేస్టరొస్తే నించున్నట్టూ?" నవ్వాడు నారాయణ.

నవ్వు తెచ్చుకోబోయినా రాక వూరు కున్నాడు వీరేశు.

అటు ఇటు చూసి "ఒకమాట..." అన్నాడు.

నారాయణ వీరేశుకి దగ్గరగా వచ్చాడు.

"డబ్బు కావాల..."

"ఎంతా?"

'దేనికి?' అని ఎప్పుడూ అడగడు నారాయణ.వొయసులో ఉన్నోడికి బ్రమ్మ చారి నాకొడుక్కైనో కర్చులుంటాయి. ఏటనడక్కూడదని అతని అభిప్రాయం.

"వంద..."

ఆశ్చర్యపోయాడిప్పుడు నారాయణ. ఇప్పటివరకూ ఒక్కసారిగా అంత కావా లని వీరేశు అడగలేదు. అయిదూ, పదీ, మహా అయితే పాతికా-అంతదాకే.

"వందెందుకురా ?" అడిగాడు తెల్ల బోతూ.

'ఎందుకో' ఎలా చెప్పాలో వీరేశుకి తెలీలేదు.

ఏం చెప్తాడు? దేనిక్కావాలని చెప్తాడు. ఏ కర్చుకని చెప్తాడు? వందరూపాయిల కర్చేటుంది తనకి....? ఆలోచిస్తే... మాంచి టెర్లీను చొక్కా, టెరీకాటను పంట్లాం కొనుక్కోవాలనుందని చెప్పొచ్చు. చెబితే నారాయణ ఇస్తాడు గానీ నవ్వు తాడు. మామూలు చొక్కా, నిక్కరు తొడిగేవోడల్లా టెర్లీనుబట్టల వూసెత్తితే, తనకి పెళ్ళిమీద మనసు పోయిందని హాస్యాలాడతాడు. ఏ మాటకయినా, ఏ కోరికకయినా ఒక సమయవూ, సందర్భవూ వుండాల!!

ఒకవేళ అలాచెప్పి పుచ్చుకున్నా గంగులది దేగలాగా ఎతుకుపోతాడు గదా!

'ఏరా...ఏవీ బట్టలు ?' అనడిగితే నారాయణ?

అప్పుడేం చెప్తాడు?

వీరేశుకి పిచ్చెక్కుతుందేవోనని పించింది.

నారాయణకి తను దొరికిపోయే స్థితి వచ్చిందిఇప్పుడు. ఇంతకాలం నారాయణ దగ్గరెంతో భక్తిగా, వినయంగా గవుర




వంగా, మరియాదగా, గుట్టుగా, పెద్ద మడిసి కింద వున్నాడు. ఆ మరియాదా, గవురవమంతా గంగలో కల్సిపోతుం దింక. అబద్ధాలతో-దగా మాటల్తో, మోసం పలుకుల్తో, నటనతో తను పచ్చి లుచ్చాగా మారతన్నాడు.

'దేవుడా! ఏం సేటు తెచ్చిపెట్టేవురా?' మనసులో నెత్తి మొత్తుకున్నాడు వీరేశు.

"ఏట్రా! అంతాలోచిస్తన్నావు? వంద రూపాయిలు దేనికిట్రా?"

నోరు పెగలలేదు వీరేశుకు.

"ఏవోలే! నీ డబ్బు నీ ఇష్టం."

నారాయణ అసిస్టెంటు గట్టిగా "ఆడు ఏంటో కులాసా సేసుకుందారనుకుంట న్నాడు కాబోసు. ఎన్నాళ్ళనించి ఆ కోరి కతో గుంజాటన పడుతున్నాడో. ఇచ్చెయ్యి ఒక వొందేగదా! ఆ బాధేదో తీరి పోనియ్యి ఆడికి" అన్నాడు.

నారాయణ అదోలా చూశాడు వీరేశుని.

ఆ చూపు వీరేశుని ఏ వుద్దేశంతో నారాయణ చూసేడో కానీ అది బాణం లాగావచ్చి గుచ్చుకుంది. వీరేశు విల విల్లాడేడు.

"నీకు మందు మీదికి మనసు పోయిం దేట్రా ? ముండమీదికి పోయిందా ?" నారాయణ ఇంక దాచుకోక అడిగేశాడు.

వీరేశు ఉక్కిరిబిక్కిరి అయిపోయాడు.

"ఒరే! నేను ఇంతకాలంనించీ ఈ షాపు నడుపుతున్నానా, ఇంత గడిస్తన్నానా! నేనే గనకా కులాసాపుట్టి వ్యసనాల్లోకి దిగితే ఈషాపు ఏటవుతుందిరా? నాసంసారంవూ, నేనూ ఏటవుతాంరా?"

వీరేశు నోరు మూగదయిపోయింది.

"ఒరే! నేను నిన్ను ఎలాంటి గతిలో సేరదీసేనో నీకు జ్ఞాపకం వుందా? పకీర్నా కొడుకుని ప్రయోజకుణ్ని చేసేను. ఒరే! నేను గొప్పగానే నిజెంగా గొప్పగానే చెబుతన్నారా ఈ మాట. బాగుపడ్డం శానా కష్టంరా. సెడిపోవడం శానా సులువురారే!

"ఇంతకాలం మన మధ్యన సుట్టరి కంలో నిన్ను నా తమ్ముళ్లా జూసుకు న్నాను. కొడుకులాగా చూసుకున్నాను. నీ బతుకెంతో బాగు సేద్దారని నాకు గట్టిగా పట్టుదలుంది. అది బద్దలుకొట్టమాకు. అందికే నీమీదింత అబిమానం పడి, నా యింట్లో కూడెట్టి, నా షాపులో గూడిచ్చి, నీకో నీళ్ళవాడుకల సంపాదన అప్పజెప్పి అందులో కొంత నా దగ్గరే దాచుతున్నా నెందుకంటావు?నీ తరువాత బతుకోసం.

"చెప్పు! మాయమాటలాడక ఎందుకో చెప్పు అంత డబ్బు. అది తీసికెళ్ళి బూడి దలో పోస్తానంటే చచ్చినా యివ్వను!"

నారాయణలో అంత కోపాన్ని-అదీ తనపట్ల అప్పుడే చూశాడు వీరేశు.

ఏం చెబుతాడు?

"నీ మీద నాకు అధికారం వుందిరారే! ఆం..వుంది. నీకమ్మా, అబ్బా అంతా నేనే యిప్పుడు. నివ్వు నా మాట ఇనాల్సిందే"

బెంచీమీద కూలబడిపోయాడు వీరేశు. గుండె లోపల్నించి బాధా, దుఃఖం యింకే దేదో ఒక్కుమ్మడిగా తన్నుకువచ్చేస్తుంటే బిగపట్టి యింక తన వశంకాక అమాంతం ఒక్కసారి 'బావురు'మన్నాడు చేతుల్లో మొహాన్ని దాచుకుని.

నారాయణ వీరేశుని అలా చూశాడు పరీక్షగా. అతని అనుమానం ఏదో రూఢి అయినట్టు తల పంకించాడు.

కాస్సేపు వీరేశుని ఏడవనిచ్చి

అప్పుడు దగ్గరగా వెళ్ళి వాడి చేతుల్ని విడదీసి తన చేత్తో వాడి కళ్ళు తుడిచాడు. "వూరుకోయింక. నివ్వూ మడిసివేగదా మరీ! ఎప్పుడో అప్పుడు బురదలో కాలె య్యాలనిపించే కర్మ తప్పని బతుకు మడిసిది. కానీ తప్పుకోవడంలోనే ఆడి తెలివుండాలి" అని రెండు టీలు తెప్పించేడు.

ఒకటి వీరేశకిచ్చి తాగమని, ఓటి తను తాగాడు.

ఖాళీ కప్పుల్తో డబ్బులు పంపించి–

"ఒరే ఈరేశా! నేన్నీకు మొన్నేం చెప్పేను. ఎంత ప్రయత్నం సేద్దారనుకున్నాం మనం. అవంతా అప్పుడే మర్చిపోయేవా? దానికెంత మదుపు వుండాలో తెల్సా? నివ్వు నా దగ్గిర దాచింది ఏ మూలకీ సాలదు. నేనోటాలోసించేను"

వీరేశు నారాయణ వేపు చూశాడు యిప్పటికి.

"గవుర్నమెంటోళ్ళు రిక్షావోళ్ళకీ, యిలాగ షాపులూ, బడ్డీలయీ పెట్టుకున్నోళ్ళకి డబ్బిస్తన్నారు. అయితే నివ్వు అందులో దిగాలంటే, ఆ డబ్బు నీకు రావాలంటే నీకు బాగా తెలిసిన మడిసి ఆడికున్న ఆస్తిపాస్తుల్ని ఏవయినా గవుర్నమెంటోరికి సూపించాల. తెలిసిందా? నీ తరపున అతగాడు పూచీ కత్తు అయి వుండాల!

"నీకు అలా ఎవ్వరున్నారు నేనవ్వా. నా షాపు నా ఆస్తికింద సూపిస్తాను. తక్కిన తంటాలన్నీ పడతాన్లే. బడ్డీకింకా చోటు సూడాల. ఆ స్థలంకి అద్దె అదీ ఆ లావాదేవీలన్నీ సూడాల. నేనేదో పెద్ద ప్రయత్నంలో వుంటే నివ్విప్పుడు లేనిపోని ఏషాలకి పోయి సిప్పట్టుకునే





తంటా తేమాకు"

వీరేశు బరువుగా వూపిరి వదిలాడు.

"షో ! నీకు బుర్ర సరిగ్గా నేకపోతే ఏదన్నా సిన్మాకిపో! యిందా" డబ్బులు ఇస్తే తీసుకోలేదు వీరేశు.

"వొద్దు. ఎల్లను" అన్నాడు.

నింపాదిగా నడుస్తూ అక్కడినించి బైల్దేరాడు. గంగులు ఎక్కడయినా కనిపిస్తాడేమోనని గుండె పీచు పీచుమంటోంది!

వాడు ఇప్పుడు తన పాలిటెలావున్నాడంటే– యుద్ధంలో సైనికుడి గుండెల్లో దూరిన తుపాకీ గుండులా వున్నాడు. తన గుండెల్లో గుండయి కూచున్నాడు!

ఏం చెయ్యడవూ? ఇలాంటి అవస్థలో పడిపోనాడేంటి తను...? పగోడికయినా వొద్దొద్దీ తంటా! ఈ యాతన!! వంద రూపాయిలు ఎక్కడినించీ తెస్తాడు? ఆ డబ్బు ఇవ్వకపోతే ఆడు నారాయణతో కచ్చితంగా చెప్పి తీర్తాడు. నారాయణ అప్పుడు ఎంత నీచంగా చూస్తాడో తనని.

నడిచీ, నడిచీ కాళ్ళు ఆగిపోయినచోట వరాలు నిలబడివుంది. వరాలు ఇంటి దగ్గరికా తను బైల్దేరాడయితే?! ఆశ్చర్యపోయాడు వీరేశు.

"ఏటిలా వొచ్చినావు! దారి తప్పా? గ్యేపకం వొచ్చేవేటి?" అంది వరాలు నవ్వుతూ.

"మీ నాన్నెలా వున్నాడే!"

"లోనకి రా! సూడు" అని పాకలోకి వెళ్ళింది. దాని వెనకాల వెళ్ళాడు వీరేశు.

నాగులు నులక మంచమ్మీద కూచుని చుట్ట తాగుతున్నాడు. "ఇదిగో ! ఈరే శొచ్చేడు..." అంది వరాలు.

"ఎవరీరేశా! ఏడీ? ఓ...వొచ్చేవా?

దాదా - కూకో!" అన్నాడు నాగులు మంచంమీద చోటిస్తూ.

"బావున్నావా?" అడిగాడు వీరేశు.

"ఆ... బానే...ఏంటో! వొచ్చీ కాలవా? పోయీకాలవా? ఎప్పుడో రాలి పోతానింక! ఎంత మందులు పోసినా, అయ్యీ ఆయుర్దాయం అవనేపుగదరా ఈరేశా! ఏటంటవు?" అన్నాడు నాగులు.

తనేటంటాడు? అసలేదేనా అనగలిగే స్తితిలో వున్నాడా తనిప్పుడు? సగం పైగా చచ్చి వున్నాడు. ఏదో, ఇలా కసింత బుర్రకి తేలికోస్సం నడి చొచ్చేడు వరాలు కాడికి!

ఆరోజేం ఎగిరిందీ?! అప్పుడే దానికీ, తనకీ 'ఫటాఫట్'అని అనుకున్నాడు. ఆ తర్వాత వరాలు కుళాయికాడ తనని చూసీ చూడనట్టు తప్పుకు పోయేది! నర్సింహులు పలకరిస్తే కూడా అది కసిరి కొట్టినట్టే జవాబిస్తే అప్పటికి తన గుండె కొంత సక్కబడింది. అయితే దాని కాడిమీదేం నేదన్నమాట అనుకున్నాడు. తను మనసుపడిన వరాలు ఇంకోడి స్వంతం అయిపోతాదన్న బాధ గానీ... తను పవిత్రంగా వున్నాడాని?!

తన సంగతెలిస్తే అదెంత అస హ్యించుకోవాల తనని?

అసలు తన మీదేదేనా వుందా దానికని?? ఏవో...!

అదిప్పటికీ తనకి బోధపడని లెక్కే!

నాగులు మూలుగుతూ - "ఒరే ఈరేశా! నాకు ఒక్కటే బాధంట్రానా. ఏంనేదూ, వొరాల్ని ఓ ఇంటిదాన్ని సేసేస్తే నా పేణం ఇంక తేలిగ్గాపోతాది. అదెలాగవుతాదో ఏటో" అన్నాడు.

"సంబంధాలూస్తన్నావా?"

"నానేం సెయ్గల్ను? కాటిక్కాళ్ళు జాచుకున్న ముసిలి ముండాకొడుకుని. ఎక్కడికేనా ఎల్లగల్నా? మాట్టాడగల్నా? దానికెంత ఓపికుండాలి"

"వూరుకో! ఇప్పుడా వూసెందుకు? చిరాకుపడింది వరాలు.

"విప్పుడు కాకపోతే ఇంకెప్పుడే నా వయసొచ్చేసేకా?"

పెనంమీద అట్టుపడినట్టూ 'చుయ్' మన్నాడు నాగులు.

"విప్పుడు పెల్లికాకపోతే నానేం అయిపోన్లే గానీ...నివ్వు కల్లుమూసుకు తొంగో"

"విదిగో, ఈరేశా! దీని మాటలకేం గానీ సూడిటు - కసింత ఈ ముసిలోడి కష్టం తీర్చు. నాకన్నియిదాలా తగ్గ వోడివి నీకంటే ఏ అల్లుడు దొరుకు తాడు ? మీ నారాయన్తో మాట్లాడీ, వరాల్ని మనువాడీ తొందరగా. నా పేనం నీకూ సింతా నేకంతా ఎగిరిపోతాది. నీకిష్టమేనా?"

ఆత్రంగా అడిగాడు నాగులు.

వీరేశు ఏమంటాడు? తన అడ్డేముంది? అంతాదాన్లో ఉంది.వరాలు వేపు చూశాడు. సాభిప్రాయంగా చూశాడు. 'ఒప్పు కుంటావా?'అన్నట్టు ఆరాటంగాచూశాడు. 'ఒప్పుకోవూ?' అన్నట్టు ప్రాధేయతగా చూశాడు. కాంక్షతో చూశాడు.

వరాలు వీరేశుని చిరచిరలాడుతూ చూసింది. ఆశ్చర్యంగా చూసింది.

"ఏటే ? ఏటంటవు ? నీకిష్టంఏనా నన్ను చేసుకోడవూ! చెప్పు? మీనాన్న తొందరపడతన్నాడు..." అన్నాడు వీరేశు.

"మానాన్న కోసం చేసుకుంటావా?" అంది వరాలు అంతలేసి కళ్ళల్లో ఆశ్చ

ర్యాన్నింపుకొని.

"నాకోసవే చేసుకుంటాను. మీ నాన్న కదలేసేడని అన్నాను..."

వరాలు విసుగ్గా—"నిన్ను చేస్కునేం సుకపడాల ? ఒల్లమాలిన జులుం సేస్తావు. వొల్లమాల్న అనుమానం నీకు. నిలబడ్డే తప్పు, నవ్వితే తప్పు, ఇంకో మగాడ్తో మాట్లాడితే తప్పు. అయ్యాల సర్సింహులుతో మాట్టాడేననీ, నవ్వేననీ పేద్ద అధికారం చెలాయించేవు. పెల్లీ పెటాకులూ నేకండానే నీ సంగతలా గున్నాది. నీకు దగ్గరయితే ఇంకెంత కాల్చుకుతింటావో?" అంది.

వీరేశు మొహం దించుకుని నాగుల్ని పక్కగా చూశాడు. నాగులు కళ్లు మూసుకుని, వెనక్కి చేరగిలబడి అన్నాడు—"ఏం పరవానేదునేవే! అలాగన్నాడని నీ పుట్టేం మునిగిపోదు. అలాగనేవాడుంటేనే ఆడది తిన్నగా ఉంటాది. కాపరాన్ని కాల్చనంత వరకూ ఆపాటి అనుమానం మొగోడికుండాల. అది ఆడదాని గవురవాన్ని ఇంటికి గోడలా కాపాడతాది. నేపోతే దాని జోరుకి భూఁవీ, ఆకాశఁవూ ఆగవు"

అవతల కుక్క 'భౌయ్'మని అరిచింది.

వీరేశు తుళ్ళిపడ్డాడు. వెన్ను జలదరించింది. గంగులు జ్ఞాపకం వచ్చాడు. వాడింటికి తీసుకెళ్ళినప్పుడు ఇలాగే అరిచేయి కుక్కలు!

నాగులింట్లో ఈ కాస్సేపూ దొరికిన విశ్రాంతి మళ్ళా పోయింది. మళ్ళా గంగులు గుండెల్లోకి వచ్చి పీటేసుక్కూచున్నాడు.

"ఏటలా బెదిరిపోనావు?" అడిగింది వరాలు.

ఒక్క నిమిషం ఇటు అటు అయ్యేడు వీరేశు. వరాలుతో తన బాధంతా చెప్పేసుకుందామనిపించింది. వొద్దు, వొద్దనుకున్నాడు మళ్ళా. అది తనని అసలే ఎడంగా, సినిమాలో విలన్ని చూసినట్టూ చూస్తోంది! గంగులు గొడవంతా చెప్తే ఇంకా పచ్చి విలనైపోతాడు తను వరాలుకి.

"ఎల్తా"నంటూ లేచాడు.

అప్పటికి చీకటి పడిపోయింది బాగా.

వీరేశు కాళ్లు ఎటో వెడుతున్నాయి.

* * *

"ఈరేశా" అని పిలిచాడు గంగులు.

"ఏట్రా? కనబడ్డం మానీసినావ? డబ్బడిగినానని?" అన్నాడు నవ్వుతూ.

మాట పెగల్లేదు వీరేశుకు.

"నీకోసం కుళాయి కాడ సూశాన్రా"

జవాబులేదు.

"బయటే అడ్డుదారని బయటే కాసేన్రా!"

సమాధానం రాలేదు.

"ఆఖరికి మీ నారాయణ సావుకాడ కెల్లినాను."

నోరు విడలేదు గానీ నాసలు ముడిపడ్డాయి భయంతో, అదిరిపాటుతో.

"నారాయణకాడ నివ్వులేవు. అందుకని ఇటొచ్చినాను"

అప్పటికీ వీరేశు వులకలేదు, పలకలేదు.

"ఇట్రా ఓపాలి ..." పిలిచాడు గంగులు.

వీరేశు నింపాదిగా నడుస్తూ వీధి గుమ్మం దాటి వెళ్ళాడు.

రోడ్డెక్కడం ఏమిటి, గంగులు ఓ చెయ్యి పట్టుకొని యించుమించు మేక పిల్లని కమేలాకి లాక్కుపోయినట్టే





తనని లాక్కుపోతుంటే, వాడి వెంట వెళ్ళసాగాడు.

"నామాటేం చెప్తావురారే?" అన్నాడు గంగులు నన్నెక్కడ 'నరకమంటావు' అన్నట్టూ.

"నాకాడేం డబ్బునేదు..." వీరేశు ఒక నిశ్చయానికి వచ్చినట్టు అన్నాడు.

"అంటే ఎక్కడ్నేదు? జేబిలోనా, ఇంటికాడా?"

"ఎక్కడా నేదు..."

గంగులు నవ్వాడు. ఫకాళించి నవ్వాడు. "ఒరే! ఈడెవురను కున్నావురా? ఈడ్ని ఎర్రినాకొడుకు న్నెయ్యకు. నీకాడనేదంటే నాను నమ్మతా ననుకున్నావా? నీళ్లు మోసి పోగేసిం దంతా తినేస్తన్నావా అంతదాయకండా?" కళ్ళల్లోకి సూటిగా చూశాడు బాణం గుచ్చినట్టు!

"నిజెం, నమ్ము. నాకాడేంలేదు డబ్బు..."

"అలగంటే కాదు. నాకిప్పుడు డబ్బు అవసరంగుంది. ఇయ్యకపోతేకాదు"

వీరేశుకి హఠాత్తుగ కోపం వచ్చేసింది. ఛస్తానెలాగూనని తెలిసి ఆఖరుసారి మేక కొమ్ము విసిరిన కోపం అది.

గంగులు చెయ్యి విడిపించుకుని, "నీకేం బాకీలేన్నేను!" అన్నాడు విసురుగా. గంగులు రెచ్చిపోయాడు.

"దొంగనాయాలా! నా ఇంట్లోదూరి నా ఆడమడిసిని చెరిచీ, నన్ను నిలువుగా మోసంచేసీ, ఇంకా పేలన్నావా పేలా పనా? పదా! నారాయణతో నీ యవ్వారం గుండారిప్పేసి చెప్తాను. నాకడుపుల మండిపోతావుంది"

వీరేశు కాళ్లు ఇంక కదల్లేదు. భూమి నంటుకు పోయాయి.

"చెప్పు! ఇస్తావా చెప్పేమంటావా?"

"నాకాడంతడబ్బునేదు..." అన్నాడు వీరేశు.

"పోనీ పందొద్దు... డెబ్బయియ్యి"

"నేదంత..."

"పోనీ ఏభయ్యి చాలా! సద్దు కుంటాను"

వీరేశు ఆలోచిస్తున్నాడు. బుర్రబద్ద లయ్యేలా. ఏం తెలీడంలేదు. ఏం చేయడం...?

"చూడా! ఏభయ్యి చాలు. సగానికి తగ్గించీసేను నీ ఎడపేడుపు విని. ఆ ఏభయ్యి ఇచ్చేస్తే నీవూసు పెట్టను, నారాయణకి చెప్పను"

వీరేశుకి ఏడుపు వచ్చేస్తోంది. అప్పటికి వాళ్లు రెండు, మూడు వీధులు దాటేశారు.

గంగులు వీరేశుకి బాగా దగ్గిరగావచ్చి నెమ్మదిగా ఏదో చెప్పాడు. ఆ తర్వాత వాడిని తనతో లాక్కుపోయాడు.

* * *

టిక్కెట్టు ఖరీదు రెండు రూపాయలు. హాలుకి వచ్చే జనాన్నిబట్టి టిక్కెట్టు నాలుక్కీ, అయిదుకీ కూడా కొను క్కుంటారు. ఆ డబ్బుల్లో కొంత హాలు అతనికీ, కొంత బ్లాకులో అమ్మినవాడికీ! అది ఏర్పాటు.

గంగులు వీరేశుని తనకి బాగా పరిచిత మున్న సినీమా హాలుకి తీసుకుపోయాడు. ఆ హాలు యజమానికి వీరేశుని చూపించి ఏదో మాట్లాడేడు. ఆ తర్వాత టిక్కెట్లు యివ్వబడినాయి. గంగులు అంతకు ముందొక గంటసేపు వీరేశుకి టిక్కెట్లు బ్లాకులో ఎలా అమ్మాలో, ఎంత చురుకు దనం చూపించాలో, ఎంత ఏమరు




పాటుగా వుండాలో బోధపరిచాడు. అంతా విని వీరేశు తలాడించాడు.

తలనెప్పి, మనసు నెప్పి, ఆకలి, నీరసం, నిస్త్రాణ అన్నీ గంగుల్ని చూసి వెరుస్తున్నాయి. వాడి దౌర్జన్యానికి, జులుంకి నోర్మూసుకుంటున్నాయి.

వాడు మళ్ళా వస్తానని చెప్పి వెళ్ళిపోయాడెటో. వీరేశు దగ్గర ముప్పయి టిక్కెట్లున్నాయి. ఆ రోజు సినిమాకి జనం ప్రవాహానికి మల్లే తోసుకు వస్తున్నారు. వీరేశు గంగులు ఆదేశానుసారం టిక్కెట్టు అయిదు రూపాయిలికి అమ్ముతున్నాడో పక్కన వుండి. అటుఇటు చూస్తూ, జనం నాడి కనిపెట్టి, వాళ్ళని రొదపెట్టేస్తూ, తన చురుకుదనాన్ని చూపిస్తూ దాదాపుగా ఇరవయి ఎనిమిది టిక్కెట్లు అమ్మేశాడు. ఇంక రెండే వున్నాయి.

అంతసేపూ జనాన్ని చూస్తూ ఓపక్క భయపడుతున్నాడు–'తెల్సినోళ్లెవరొస్తారో' నని! అప్పటిదాకా ఎవరూ రాలేదు కాని.. వులిక్కిపడ్డాడు. గుండె గబగబా కొట్టుకుంది. తొట్రుబాటు, ఆశ్చర్యం, విచారం కలగాపులగంగా ఏర్పడ్డాయి. అంతలో వరాలక్కడికి వచ్చేసింది.

వెంట ఇంకొకామె. నలభయ్యేళ్లుంటాయి. వరాలు వాళ్ళిళ్ళ దగ్గర మనిషే కాబోలను కున్నాడు.

"ఏటి ఈరేశా! సిన్మాకొచ్చేవా?" అడిగింది వరాలు. "కసింతాలీశెంగొచ్చేము. బుకింగు కట్టేసేడాడు! నీ దగ్గరేటి టిక్కెట్లు ఎక్కువున్నట్టున్నాయే? రెండి స్తావేంది?" అంది గబగబా.

పులిక్కిపడ్డాడు. ఎలా యిస్తాడు?

వరాలు ఆరాటంగా అటు చూసింది. అప్పటికి హాల్లోకి జనం వెళ్ళిపోయారు. ఇంకో ఒకరూ ఇద్దరూ లోపలికి పరిగెత్తుతున్నారు.

"మాటాడవేటి? రెండెందుకు నీకు? ఎవురికి తీసేవు?"

ఏం చెప్తాడు?

కనిపించని దేవుణ్ని కళ్ళరమూసి వేడుకున్నాడు. ఈ గండాన్నించి తప్పించమని. ఏదో ధైర్యం వచ్చేసింది. ఏదైతే అదవనియ్యమని, "ఇయ్యి బ్లాకు టిక్కెట్లు! మామూలుగమ్మను" అన్నాడు.

"ఏటీ! బ్లాకా? నివ్వా? ఇదెప్పుణ్ణించీ?"

వరాలు వేపు చూడలేక, ఆత్రంగా గంగులు కోసం చూడసాగాడు వీరేశు. అంతలో గంగులు గబగబా వచ్చేసి "అయిపోయేయా?" అనడిగాడు.

వరాల్ని ఎగాదిగా చూసి, "ఏటమ్మాయీ! టిక్కెట్లా? రెండా? రెండూ పది! కావాలా?" అన్నాడు వచ్చినంత వేగంగానూ.

వరాలు తెల్లబోతోంది. "పదా! ఓలమ్మ. ఇంకానయ్యిం. ఇరవయ్యన్నావు కాదు. అంతేటి?" అంది విసుగ్గా.

గంగులిటు అటు చూశాడు. ఇంకెవరూ రావడం లేదు. "తగ్గించేము. ఎనిమిదిచ్చీ!" అన్నాడు.

హాల్లోంచి ఏవో మాటలు వినిపిస్తున్నాయి! అవి న్యూసా? లేక సినీమా మొదలెట్టేసేరా? ఏవో! వరాలు అరికాళ్ళల్లో దురద పుడుతూన్నట్టు నించోలేకపోతోంది.

గంగులు విసుక్కుని, కసురుకుని, ముందుకెళ్ళి, వెనక్కివచ్చి "ఆరిచ్చీ" అన్నాడు. వరాలు తొందరగా ఆర్రూపాయిలు తీసి, లెక్కపెట్టి గంగులికి ఇచ్చేసి, టిక్కెట్లు తీస్కుని వీరేశుని మింగేసినట్టు చూసి హాల్లోకెళ్ళిపోయింది తనతో వచ్చిన ఆమెతో. రాబో ఉప్పెనకా చూపు సంకేతంలా పించింది.

గంగులు డబ్బు తీసి లెక్కబెట్టుకున్నాడు గబగబా. బాగానే వచ్చిందవాళ కలెక్షనసుకున్నాడు. హాలతనికివ్వాల్సింది అంతా ఇచ్చేశాడు. తన దగ్గరప్పటికి నలభయి అయిదు రూపాయిలున్నాయి. తన వొంతు. "ఏట్రా, ఈరేశా! ఇదిగో నలభయిఅయిదూ! ఇది నీ కష్టం. అంతే నివ్వు గడించింది. నీచేతెందుకు అంత పోరి అమ్మించేను?"

'తెలుసు'న్నట్టు బుర్రాడించాడు వీరేశు.

గంగులు నవ్వాడు గర్వంగా. ఆ డబ్బు తన జేబులో పెట్టుకున్నాడు. "నిన్ను ఏభై అడిగేను ఏం? ఇది నలభై అయిదు. పోన్లే....ఫర్వానేదు. ఎళ్లు ఇంక. ఇయ్యాల్టికి నిబ్బరంగ తొంగో! పో!"

కాళ్ళీడ్చుకుంటూ వీరేశు బయల్దేరాడు.

చీకటి అంత చిక్కగా లేదవాళ. వెన్నెలని చంద్రుడు అంత పైనించి నెమ్మదిగా వొంపుతున్నాడు. ఆ వెలుగులో రోడ్లు, ఇళ్లు, చెట్లు అన్నీ అంతా తెల్ల





అయిన్నాయి. అప్పుడెంత టయిమయిందో తెలీదు. కానీ సెకండ్ షో ఆరంభించే సేరు గనక పద్దాటి పదకొండు దగ్గరవొచ్చు!

తిన్నగా షాపు దగ్గరికెళ్లాడు. షాపులో అవాళ నారాయణ కొడుకు పడుకున్నాడు. తలుపుతట్టి వాడినిలేపి పక్కన చోటిమ్మన్నాడు పడుకుందికి. కడుపులో ఆకలి దంచేస్తోంది. గంగులుకి వాడి గొడవే వాడిది. తన నుపయోగించుకుని అంత డబ్బు తీసుకున్నాడు. ఇంకో పరిస్థితిలో అయితే తను వూరుకోడు. అడి నడిగేద్దుడు. కాని ఇప్పుడు తనది చాలా దయనీయమైన స్థితి. అంతా అలా వచ్చింది ప్రారబ్ధము!

నారాయణ ఇంటికి వెళ్ళలేదు. ఇప్పుడు వెళితే నారాయణకి దొరికిపోతాడు. సవాలక్ష ప్రశ్నల్తో, మాటల్తో, కోపంతో ఆవేశంలో నారాయణ తనని తిట్టిపోస్తాడు. ఆకల్ని భరిస్తూనే షాపులో పడుకున్నాడు వీరేశు.

"మీ నాన్న తిట్టేడా?" ఆత్రంగా అడిగాడు వీరేశు.

"ఆ... బాగానూ ! నివ్వెక్కడికి పోనావు?"

సమాధానం ఏం చెబుతాడు?

నారాయణ కొడుకు ఇంక ఏమీ అడగక పడుకున్నాడు.

ఎలా రాత్రి గడిచిందో! వీరేశు, పిశాచంలా కనిపించాడా మర్నాడు అద్దంలో చూసుకుంటే తనకి తనే!

"సికాడ డబ్బులేటన్నా వున్నాయా?" అడిగాడు నారాయణ కొడుకుని.

"నాకాడేట్నేవు" అన్నాడా అబ్బాయి.

"అలగున్నవేం? దెబ్బింకా మాన్నేదా? ఎక్కడికెళ్లి పోనావు నిన్న?"

"నా స్నేయితుడితో. సిన్మాకాడు రమ్మంటేనూ..."

"దేనికి?"

నోటికొచ్చిన పేరు చెప్పేడు.

"అదా?" ఆశ్చర్యంగా చూశాడు ఆ అబ్బాయి. అది ఎళ్ళిపోయి వోరం అయిందే"

'దొరికిపోనాన'నుకున్నాడు వీరేశు గతుక్కుమని.

నారాయణ వచ్చాడు. వీరేశుని ఎగాదిగా చూశాడు. ఎక్కడికెళ్లేవని అడిగాడు. వీరేశు అబద్ధం చెప్పలేక వూరుకున్నాడు. అబద్ధం తనని అలుసుగా చూస్తోంది. నిజం క్రూరంగా చూస్తోంది!

అవాళ నారాయణ అదివరకెప్పుడూ లేనంత కోపంతో వీరేశుని తిట్టేశాడు. తన దగ్గరున్న డబ్బేదో పారేస్తాను పొమ్మన్నాడు. తనకింక కనిపించవద్దన్నాడు. "నిన్ను చూస్తోంటే నాకు ఒళ్ళు మండిపోతావుంది!" అన్నాడు.

సెడిపోయేవోణ్ని బగమంతుడు కూడా బాగు సెయ్యలేడన్నాడు.

"నీ కోసం నేనుపడే కస్టం ఇంకోడి మీదెడితే ఆడు చక్కగా బాపుపడతాడు" అన్నాడు.

అవి ఒకటా... రెండా?!

అవి సూదులు! దబ్బనాలు! చురకత్తులు!

అవి పిడుగులు!

దెబ్బమీద్దెబ్బలు ! తల వాచిపోయిందనుకున్నాడు-బాధగా తలపట్టుకుని.

బాధతో, కష్టంతో, అవమానంతో, వుక్రోషంతో, ఆకలితో, అయోమయంతో, నారాయణ నోటినుంచి వచ్చిన మాటల్లోని నిజాలతో, బెంగతో, భయంతో గుండె ఏడ్చిఏడ్చి అవిసిపోయింది. కడుపులో

పేగులు కదిలిపోతున్నాయి. వాటికి కన్నీళ్ళే తిండా...!

రెండు కళ్లూ వాచిపోయి, ఎర్రబడ్డాయి.

కాళ్ళు వెళ్ళినవేపుకి మనసు శాసించక వదిలేసింది. రోడ్డుపక్కన ఖాళీస్థలంలో పిచ్చిమొక్కలేవో పెరిగి ఉన్నాయి. వాటి నీడలోకి వెళ్ళి ఓ రాయిమీద చతికిలబడ్డాడు.

తననెందుకు నారాయణ తిట్టేడు?

ఎందుకు గంగులు పగబట్టేడు?

వరాలెందుకు తప్పు పడ్తాంది?

ఎందుకందరికీ శత్రువయిపోతున్నాడు?

తను చేసిన నేరం ఏవిటి, నిజెంగా?

ఎవర్ని కావాలని దగా చేసేడు? ఎవర్ని మాయ చేసేడు?

ఎవరి కూడు పడేసుకున్నాడు? ఎవరి నీడలో నిప్పులుపోసేడు?

మరెందుకందరూ అసయ్యించుకుంటున్నారు??

కళ్లు గట్టిగా తుడిచేసుకున్నాడు. కాని మనసునంత గట్టిగా తుడిచేసుకోగలడా?

నిట్టూర్చాడు వీరేశు.

ఎండ నారాయణ కోపంలా ఎక్కువైపోతోంది.

వీధి కుళాయికి నీళ్ళకోసం వచ్చిన ఆడవాళ్ళు వీరేశుని చూశారు.

వీరేశు తలెత్తి చూసేసరికి పగలబడి నవ్వుతున్నారు వాళ్లు.

"అదిగో వొరాలొస్తన్నాదమ్మోయ్"

"ఏటే వరాలా, మనవరాలా... నీ మనువెప్పుడే? బేగా పప్పన్నం పెట్టించవే మాకందరికీ" అందొకామె.

"ఏటి? కందిపప్పు సవగుందేటి మీయందరికీ లాగించడానికి?" వరాలు 'చుయ్యి'మంది.

"అబ్బబ్బ అదికాదే పిల్లా—నీ పెళ్ళే"

"అయినప్పుడవుతాదిలే బయ్యం పడిపోమాక"

"నీకంతా సిద్దంగుంటే మధ్య మాకు బయ్యేం ఏవిటే ఎర్రిమొఖవా?"

"ఏటి...ఏటంటన్నవూ?"

"అదిగో! ఆడు సూడు నీ కోసం పుట్టేడాడు. నీ కోసవే పెరుగుతున్నాడు"

"అదిగో సూడు! నీ కోసవే సూస్తన్నాడు—ఎర్రిమొఖం ఏస్కుని..."

గొల్లున్నవ్వులు.

వరాలటు చూసింది. వీరేశుని చూసి "సెయ్" అంటూ ముఖం తిప్పుకుంది. వీరేశు గుండె ఇంకోసారి కీచుమని అరిచింది బాధగా.

"ఆఁ... ఆఁ... ఇలాంటోళ్ళని ఇంతమందిన్సూశానమ్మోయ్..." ఆ ముసల్ది తన పండుజుత్తు పట్టుకుంది.

"స్సీ, ఛా అన్నోళ్ళే ఆ ముడడిపోయేకా ఆడి చేతిల మరబొమ్మయిపోతారాదినే!"

"విదిగో మీరెల్లండి. వూఁ..." వరాలు వాళ్ల మంటతో కసిరింది వాళ్ళని.

"వెందుకే వొమ్మంటన్నావూ! ఆడి కాడికెల్దారనా? మీ మజ్జెకి మాఁవెందుకొస్తవే ఎర్రి మొఖవా ఎర్రిమొఖవాని?"

"ఎల్లెల్లోదార్సు! వూరుకోబెట్టు"

"ఒల్లో ఏస్కో! ఓదార్సు. వుయ్యాలూపు."

నవ్వులు నవ్వులు. అక్కడ చెట్టూ పుట్టా, నేలా రాయీ అంతా కూడా వాళ్ళతో కల్సి నవ్వుతున్నట్టయింది వరాలుకి. వుడుక్కుంది. 'మీయెమ్మా...' అనుకుంది కోపంగా.




వాళ్ళంతా పగలబడి నవ్వుకుంటూ వెళ్ళిపోయారు.

వీరేశుని మళ్ళా చూసింది వరాలు. చూడకుండా వుండనివ్వడం లేదు – ఆ ఆడంగుల పరాచికాలతో మోతెక్కి పోయిన మనసు. ఆడెందుకలావున్నాడు? మొకం పీక్కుపోయీ, కళ్లు లోతుకు పోయీ,ఎర్రబడీ?ఏడ్సేడా?ఎందుకూ...?

ఎందుకో తెలీని వరాలు, అడిగితే కానీ తెలీదనుకున్న వరాలు, అడిగేద్దామని ఆత్ర పడిన వరాలు, అడగడానికి వాడిమీద ఏర్పడిన ఆగ్రహం అడ్డం పడితే, అటు ఇటు అయీ ఆఖరికి వూరుకుంది 'నా కెందుకు ఆడి వూసు?' అనుకుని.

కాళ్లు ముందుకు పడినాయి.

మనసలా (నా కెందుకాడి వూసని) అనుకోలేదు గనక, కళ్ళు వెనక్కి చూసేయి.

వీరేశు ముడుకుల్లో బుర్ర పెట్టుకు నున్నాడు.

క్షణం కీచుమన్నాది వరాలు గుండె.

మరుక్షణం నడిచిపోయింది ఇంటి వేపు.



## 6

నారాయణ కిళ్లీ బడ్డీని లేపడానికి సర్వ సన్నాహాలూ చేస్తున్నాడు. జాగా చూశాడు. దానికి అద్దెకట్టాలి. ఆ తర్వాత సంగతి బడ్డీ. వీరేశు తసదగ్గర దాచుకున్న దానిమీద చాలా వేస్తే కానీ బడ్డీ లేవదు. ప్రభుత్వానికి దరఖాస్తు చేసుకున్నాడు. వాళ్లు రావడం, నారాయణ ఆ స్త్రిగా మంగలిషాపుని చూసుకు వెళ్ళడం జరిగింది. బడ్డీ లేవడానికి మొత్తం మూడు వేల చిల్లరవుతుందని లెక్కతేలింది.

రాతకోతలూ, వ్యవహారాలన్నీ జరిగాయి.

డబ్బు పట్టుకుని రంగంలోకి దిగాడు నారాయణ.

చక చకా బడ్డీ తయారయింది. ఆ రోడ్డులో ఒక వారగా, అటు జనం తిరుగాడే దిశగా బడ్డీ పెట్టించాడు. అరటిపళ్ళ గెల, నాలుగయిదు సీసాల పిప్పరమెంట్లు, బిస్కత్తులు, వక్కపొడి పొట్లాలు, సిగరెట్ పాకెట్లు, అగ్గిపెట్టెలు, తమలపాకులు, కిళ్ళీ తయారయేందుకు కావల్సిన పదార్థాలు, ఓ పక్కగా బడ్డీకి వేలాడుతూ కాలుతూన్న చేంతాడు, సోడాలు...

బడ్డీ స్వరూపం అది.

మంచిరోజు మాట్లాడి వచ్చి, వీరేశుని బడ్డీ మీదకి ఎక్కించేడు నారాయణ. ఎంతో కష్టపడి అరిచీ, శ్రమపడీ, ఓట్లు వేయించీ, గెలిపించీ, గద్దెమీదకి నాయకుణ్ని ఎక్కించినంతా చేశాననుకున్నాడు. 'అయితే ఈడా పధవి వుపయోగించుకుంటాడా? బడ్డీ పెరగడానికి తోడ్పడతాడా? నాల్రోజుల్లో దిగిపోతాడా?' అని ప్రశ్నించుకుని 'అదాడి ప్రారబ్ధం బట్టి వుంటాది!' అనుకున్నాడు.

బడ్డీ మీద కూచున్నప్పుడు వీరేశుకి మొదట కొత్తగా, వింతగావుంది. ఏదో సిగ్గుగా, భయంగా అనిపించింది. తను ఇంతదాకా నే సేపని నీళ్ళమోత. అందులో వొంటికష్టం తప్పా ఇంకేంలేదు! ఎంత

వాళ్లొంచితే అన్నికావళ్లు! అంత డబ్బు! యిప్పుడిందులో బ్బురకష్టం వుంది. అదెంత చురుగ్గా పదునుగా వుంటే బడ్డీ అంతగా పెరుగుతాది. వ్యాపారానికి బ్బురేవుండాలి. వీరేశుకి అధైర్యం, పిరికితనం వచ్చేశాయి. అంతలో నిగ్రహించుకున్నాడు. నారాయణని చూసి గుండెని దిటవు చేసుకున్నాడు. తనకోసం నారాయణ ఇంతచేసేడు! తను తన కోసం, నారాయణ కోసవూ ధైర్యపడాల!

మొదటి రోజు నారాయణే దగ్గిర వున్నాడు. వీరేశుచేత కిళ్లీలుకట్టించేడు, సోడాలు కొట్టించేడు, సిగరెట్లు అమ్మించేడు.

ఏ పనెలా చెయ్యాలో బోధపరిచేడు వీరేశుకి. వ్యాపారంలో లావాదేవీలు చెప్పాడు. బాగా తెల్సినోళ్లు బడ్డీకి వస్తే ఏం మొహమాట పడవద్దన్నాడు. వాళ్లు బాకీలు పెట్టేసారన్నాడు. ఆ తర్వాత గోతిలో దించేసారన్నాడు.

బ్బుర వూపేడు వీరేశు.

కానీ యిరకాటంలో పడిపోయాడు

నర్శింహులు వస్తే నిర్మొగమాటంగా చెప్పేశాడు — బాకీల్లేవని. డబ్బులిచ్చి కొనుక్కు వెళ్ళమన్నాడు. అంతలో గంగులు వచ్చాడు. వీరేశు తుళ్ళిపడ్డాడు భయంవేసింది.

"రెండరిటిపళ్లియ్యిరా!" గంగులు బడ్డీకి చేరగిలబడి నించున్నాడు. వాడప్పుడు యములాడిలాగే కనిపించాడు వీరేశుకి. 'చచ్చే' ననుకున్నాడు.

"ఇయ్యిరారో! ఓ బీడీకూడా..."

"అయ్యేనేవు..."

"నేవా? పోనీ సిగిరెట్టియ్యి మరీ మంచిది"

'నీయెమ్మా!' అనుకున్నాడు వీరేశు చిరాగ్గా, కోపంగా. 'ఏం చెయ్యడం? ఇవ్వడమా? మానడమా? ఇస్తే డబ్బులిస్తాడా? ఇవ్వకపోతే ?! ఏం చేస్తాడు? ఆడు నారాయణతో చెప్తానని మళ్ళా బెదిరిస్తాడా? ఇంకా . ?!'

ఈడు తనని అడకత్తెర్లో ఎడ్తన్నాడు!

బేగా నస్తే బావుండును !

హుఁ! ఆడెందుకు నస్తాడూ ?

తన కష్టాన్నీ, బాధనీ ఆడాయుస్సుకింద పోసుకుని ఇంకా ఇంకా నిబ్బరంగా, నికార్సుగా బతికే వుంటాడాడు గానీ...!

గంగులు కదల్లేదు. వీరేశుని వదల్లేదు. దబాయించి అడిగాడు అరటిపళ్లు,సిగిరెట్టూ యియ్యమని.

"ఏట్రా? ఆలోసిస్తన్నవా? డబ్బులా? పద్దుల రాస్కోయ్!"

"అదేం కుదరదు. ఇంకామొన్నే బడ్డీ ఎట్టేం"

గెల్లోంచి రెండు పళ్లు తనే తెంపుకున్నాడు గంగులు. వీరేశు చేతో అడ్డు బోయేడు. తోసేసి, పళ్ళు తీస్కుని, వొలిచి అక్కడే తినేస్తూ నవ్వాడు గంగులు. "డబ్బులు కావాలా? కాంతాన్నడుగుదాం పద!"

వీరేశుకి వెన్నెముక జలదరించింది. లోపల తిట్టుకున్నాడు వాడిని ఏం చెయ్యలేక. గంగులు వెళ్ళిపోతూ — "అయితే నీళ్లు మానేసేవేటి?" అన్నాడు. జవాబివ్వలేదు వీరేశు.

"టిక్కట్లు కూడానా?"

గుండె క్షణం ఆగి మళ్లా కొట్టుకోసాగింది.

"వొస్తాన్నా. అవుసరంపడితే ... తప్పుద్దా మరి"

ఎవరో సిగరెట్లు అడిగితే, వక్క

పొడి పొట్లాలిచ్చాడు. గంగులన్నా కొడుకు మతిపోగొట్టేసున్నాడు! తిట్టుకుంటూ మళ్ళా ఆయన అడిగింది తీసి ఇచ్చాడు.

ఎవరో ఒకరు వొస్తున్నారు. ఫరా లేదు. గంగులన్నా కొడుకు మాత్రం రాకే తవని దేవుడికి దండం పెట్టుకున్నాడు. ఆడు, అమ్మోరొచ్చి ఆయుర్దాయాన్నట్టుకు పోయినట్టూ బడ్డీకాడకొస్సే బలిమినేదో వొస్తువున్నట్టుకు పోతాడు వూరికే. తన ధైర్యాన్నెత్తుకుపోతాడు. ఆలోచనల్నెత్తుకు పోతాడు.

వీరేసుకి బడ్డీలో కూచుంటే సుకం గుందనిపించింది. ఎండదసరునేదు. ఘుజాల మోతనేదు. వుక్కబోసినా, వుండుండి గాలి అలావొచ్చి ఎక్కువ సరుకులడిగిన జనాల్లా కొంత సేద తీరుసాది. సరుకులయిపోతే, నారాయణ కొని తెచ్చిపెడుతున్నాడు బడ్డీలో. చీకటిపడి బడ్డీ కట్టేసేక ఆరోజు వచ్చింది, పైస లాభవూ లెక్క చూస్తున్నాడు.

మెయిన్‌రోడ్డు మోతెక్కిపోతోంది వాహనాలతో, జనం రద్దీతో. దుమ్ముగాల్లో లేచి విన్యాసాలు చేస్తోంది. కూచుని కూచుని కాళ్ళుపట్టేసి, కొంచెం గాలికి బడ్డీ దిగి, బైటికి వచ్చి నిలబడ్డాడు వీరేసు.

ఎదురుగా, ఆ వెపున వున్న బడ్డీని చూశాడు. అది దీనికంటే పెద్దబడ్డీ! చాలా సామాన్లున్నాయి. అందులో చిన్న సీలింగు ఫేనుంది. బారులై టుంది. ఆ బడ్డీకెప్పుడూ జనం పెద్ద నటుడున్న సినీమా కెళ్ళినట్టు ఎడతారు. ఎంతేనా పెద్దోళ్ళ గిరాకీ పెద్దోళ్ళగిరాకీయే.

నిట్టూర్చాడు వీరేసు ఆ బడ్డీని చూస్తూ.

ఆరోజు వరాలు బడ్డీ దగ్గరికి వచ్చింది. వీరేసు నవ్వి పలకరించాడు. "మీ నాన్న బావున్నాడా?"

"బాగేటింక? ఎన్నాళ్ళుంటే ఎళ్లుండే నంటన్నాడు"

"ఏటిలావొచ్చేవడగొచ్చునా?"

"నీ జాతకం మారిపోయినట్టుందే!"

"మార్చేడు మా నారాయణ..."

"సెక్క పొట్లం ఇవ్వు! విప్పుడు సుఖంగున్నట్టుందే నీపని?" అన్నవ్వింది వరాలు.

పక్కపొట్లం ఇస్తూ, "ఎక్కడున్న తంటాలక్కడుంటాయిలే. దీనికంతా ఇదుండాల" తలకాయ చూపించాడు తనూ నవ్వి.

డబ్బులిస్తూ, "ఏటో నాకు అంట్లు తోమి, నీళ్ళుమోసి చెడ్డ చిరాకెత్తిపోత న్నాది" అంది విసుగ్గా వరాలు.

"మరేం సేద్దారనీ?"

"నివ్వే సెప్పు?"

"నేనా?" ఆశ్చర్యపోయాడు వీరేసు. "నా మొకం! నాకేం తెల్సు? నారాయణ ఇంతచేస్సే నేనిదెక్కనంతే!"

"పెళ్ళి చేసేస్కుందారనుకుంటు న్నాను..."

ఉలిక్కిపడ్డాడు.

"పెళ్ళి చేసేస్కుంటే ఆడే పోసా కారం సేస్సాడు. నాను ఇంత వొండి పెట్టే సాలు."

"ఎప్పట్టా?"

"లగ్గం ఎట్టు నివ్వు"

"బావుందే. నీ పెళ్ళికి నేను లగ్గం ఎట్టాలా?"

"మరయితే ఇంకోడి సేతెట్టించు కునేదా?"

వీరేసు అయోమయంగా చూశాడు. ఆశ్చర్యంగా చూశాడు. ఇదెంత తెలివైన

దైపోయింది? సినీమాల్చూస్సూసి మాటలు బాగా నేర్చింది. దీన్ని పెళ్లాడితే బుట్టలో పెట్టేసి, పైన ఇంకోతట్ట బోర్లించేసి సిన్నాకి చెక్కేస్తాది.

"వరాలూ ! ఇదెప్పుడొచ్చిందే ఇంత దయ నా మీదా?"

"ఎప్పుడేన్లే!"

"కారణమేంటో?"

"యింత సేపూ సోదెవ్వరికి చెప్పేసు? నీకా? అల్లా బడ్డీవోడికా?"

వీరేశ గుటక మింగాడు. వరాలు ఒక పరిస్థితిలో మంచంలోవున్న ముసలి తండ్రితో అమ్మ [illegible], అన్నదమ్ములు, అక్కచెల్లెళ్లెవరూ [illegible] వొంటరితనంతో విసుగెత్తిపోతున్నాది! ఆ తర్వాత పాచి పని, నీళ్ళ చాకిరీ ఎలా వున్నా, వంటరి తనాన్ని వయసులో భరించడం చాలా కష్టం. ఆమధ్య ఎంత నీలిగినా ఇపుడు తనదారికొచ్చింది.

వీరేశుకాబడ్డీ ఇప్పుడు ఏనుగంబారీలా వున్నాది. రంగులరాట్నంలా వున్నాది ఏనుగంబారీ తనెక్కకపోయినా ఒకసారెః

క్కడో బొమ్మచూసి అలా కలగన్నాడు.

కలలు నిజం అయితే మనిషికెంత హాయి! వెంత సుకవూ! అయితే ఈ బడ్డీ లేపినవేళ శానా మంచిదన్నమాట.

వీరేశు అటు ఇటు చూశాడు. ఎవరూ ఇటు రావడం లేదు. అమ్మయ్య! చేత్తో దగ్గరికి పిల్చాడు. వరాలు నవ్వుతూ వచ్చింది "వెందుకూ?" అంటూ.

"విందుకూ" వరాలు చెయ్యి పట్టుకుని చప్పున అరచేతిలో ముద్దుపెట్టుకున్నాడు.

"స్సీ! ఏటిది?"

"అదేంటో తెలీదే? అన్ని సినీమా ల్చూసేవూ?"

"ఒల్లకో! నీకు జోరునావయిపోత న్నాదీమధ్య"

"పోనలాగే అనుకో! విద్దరవూ ఒక్క జోరుతోనే వున్నాం!"

ఎవరోవచ్చి సిగరెట్ పాకెట్టు అడిగితే తీసిచ్చాడు. అతన్ని పంపించేసి వరాల్తో ఏదో చెప్పబోతుంటే బిళ్ళలు కావాలని ఒక పిల్లాడు వచ్చాడు. వరాలు నవ్వుతూ "ఆనక సెప్పుదువుగానీలే! ఇంటికాడికి రా!" అని వెళ్ళిపోయింది.

బిళ్ళలు తీస్కుని ఆ పిల్లాడెళ్ళి పోయాడు.

వరాలు కనుమరుగయిందాకా వీరేశు చూసి, బడ్డీలోకి తలవంచేడు.

యింకెంతసేపుండాలి తనీ బడ్డీలో?

* * *

కంటికి కడివెడుగా ఏడుస్తోంది వరాలు నేలమీద చతికిలబడి రెండు చేతులతో తల పట్టుకుని. జుత్తు అస్తవ్యస్తంగా వుంది. కన్నీటితో మొహం ముద్దయింది. గుండెలు ముద్దయినాయి. అది జలపాతం. ఆగి పొమ్మంటే ఆగిపోయేది కాదు. కష్టం ఎదనిపుట్టి ఏ భాగాన్నీ వదలక శరీర మంతా ప్రవహించి కళ్ళే తనకో దారి చూపిస్తాయని తెల్సుకుని వాటిలోంచి ఎద తెగకుండా వెలువడుతుంది.

వరాలు పక్కన నేలమీద ఒకచాప పరిచి నాగుల్ని పడుకోబెట్టారు ఇరుగూ, పొరుగూ. కాళ్ళూ, చేతులూ తిన్నగాసాచి ఆకాశంకేసి చూస్తోన్నట్టూ, కళ్లు విప్పి అక్కడెవరో తనని పిలుస్తోంటే 'సరే వొచ్చేస్తానింక'ని చెప్పి వెళ్ళిపోయినట్టూ పోయాడు నాగులు.

"వూరుకోయే వొరాలూ! నివ్వెంతే డిస్తే మట్టుకూ ఏటి? మీ అయ్య తిరి గొస్తాడా? నెగు! కల్లు తుడ్సుకో!" అంది పొరుగమ్మ.

పాపం!దానికున్న ఆసరాఆడేగదుటే? వింతకాలం ఆడికి అదీ... దానికాడూ...! మంచికీ, సెడ్డకీ దేనికయినా ఆళ్లే గుంజు కున్నారా? ఇప్పుడొక్కసారాడు 'లేను నేనని'పోతే ఎంత కస్టంగుంటాద్దాని కాలోసించాదినే" అంది యిరుగమ్మ.

వాళ్ళ ఓదార్పులు, సానుభూతి మాటలు వరాలు కళ్ళని తుడవలేక పోయాయి.

కర్రలు తెచ్చేరు. పాడె కట్టేసేరు. నాగుల్ని చాపతో దానికేసి కట్టేసేరు. "సావుబాజా ఎట్టాలా?" అడిగాడు నర్సింహులెవరో పెదతన్ని. "దానికి డబ్బో? యిప్పటికే శానైంది..." అన్నాడు నాగులు అంత్యక్రియకి డబ్బు సాయం కొంత చేసినతను. మిగతాది నర్సింహులు యిచ్చాడు. వరాలు దగ్గ రప్పుడు అయిదు రూపాయలకంటే లేవు.

ఇలా అయ్యేపోయేదని వరాలు వెళ్ళె మొదట వీరేశుతో చెప్పింది. అప్పుడు బడ్డీ మాంచి రద్దీగా వుంది. దిగడానికవ





లేదు. నారాయణని కేకేసి, బడ్డీ అప్పగించీ, వరాలు వెంటవెడదామని చూశాడు వీరేశు. 'కర్మకొద్దీ' అన్నట్టు నారాయణ వూళ్ళో ఏదో పెళ్ళికి బాజావాయించడానికెళ్ళేడని తెలిసింది.

వీరేశు ఎవర్ని బడ్డీలో కూచోబెట్టేదాని ఆలోచించాడు. అంత నమ్మకస్థులెవరూ కనిపించలేదు. వీరేశు మనసు విలవిల్లాడింది. నారాయణ కొడుకుని అప్పుడు పిలుద్దామనుకున్నాడు. వెళ్ళి వచ్చేసరికి చాలా సేపే పడుతుంది. వరాలు పరిస్థితి చాలా దయనీయంగా వుంది.

"వరాలూ! ఇప్పుడే వొస్తాను. ఎళ్ళు నువ్వు. చూసినావుగదా నా సంగతిక్కడ? బడ్డీ కట్టేసి వొస్తాను.." అని చెప్పాడు వీరేశు అనునయంగా.

వరాలు వెళ్ళిపోయింది. వీరేశు సోడా కొట్టి ఎవరికో యిస్తోంటే, మనసు బాగో లేనందుకో ఏవిటోగానీ చెయ్యి పట్టు దప్పి, సోడాకాయి జారిపడి భళ్ళున బద్దలైంది! ఓ గాజు ముక్క కాలిలో కెళ్ళి గుచ్చుకుంటే బాధపడ్తూ, తిట్టుకుంటూ అతను వెళ్ళిపోయాడు. ఆ ముక్కలన్నీ ఏరి అక్కడ శుభ్రం చేశాడు వీరేశు.

కొట్టు మూసి వరాలు ఇంటి దగ్గరికి వెళ్ళేసరికి ఆలీశెం అయింది. అప్పటికే యిరుగూ, పొరుగూ నాగుల్ని పాడెతో ఎత్తేస్తున్నారు. నర్సింహులు పాడెఎత్తిన వాళ్ళతో ఏదో చెబుతూ, ఇటు వీరేశుని చూసి, "ఇప్పుడు వొచ్చేవా? పెళ్ళనుకున్నావేంటి పెళ్ళోరిలా ఆలీశెంగా రాడానికి?" అని కసిరినట్టని, అటు తిరిగి—"పదండెహె!" అంటూ నడిచాడు.

వీరేశు ఆ మాటకి సిగ్గయిపోయాడు. వరాలు తనని విచారంగా, బాధతో, కష్టంతో, అసహ్యంతో 'ఛీ! నివ్వేం మనిషివి?' అన్నట్టు చూస్తోంటే 'ఛీ!ఛీ! నేనేం మనిషిని? ఇంత కష్టంలో వచ్చి ఆదుకోలేకపోయేను! నా జన్మ తగలడా! వరాలేం అనుకుందో? ఎంత తిట్టుకుందో? నేనంటే దానికి చాలా అసహ్యం పుట్టేసుంటాది...' అనుకుని లజ్జతో కుంచించుకుపోయాడు.

తండ్రి పాడెతో వెళ్ళిపోతోంటే వరాలు గొల్లుమంది. దానికి తన శరీరంలో పెద్ద భాగాన్నెవరో కోసేసి పట్టుకుపోయినట్టుంది. నెత్తురేడ్చింది. నరాలు మూలిగేయి. గుండె కుమిలింది.

ఇప్పుడు తనెవరు? తన చుట్టూ అంతా ఖాళీగా, బోసిగా కన్పించింది వరాలుకి. ఎక్కడో, ఒంటరి స్థలంలో దిక్కూ దివాణం లేకుండా పడివుండి ఏడ్చే పసిపిల్లలా విలపించింది.

వీరేశు దగ్గరగా వెళ్ళి ఓదార్చబోయేడు. వరాలు ఏడుస్తోనే నిస్సారంగా చూసింది. గతుక్కుమన్నాడు వీరేశు. దాన్నెట్లా వూరుకోబెట్టాలో వీరేశుకి తెలీడం లేదు. పైగా అది తనని వెలపరించుకుంటోంది. ప్చ్!

"ఏటలా రాయిబొమ్మలా వుండిపోతావ్? ఎళ్ళి దాన్నోదార్చు! దాంతో పెళ్ళికి తయారవుతున్నోడివి దాని కష్టానికి రానేవా? అంతేనేటి నీగుణవు?"

వాళ్ళంతా మాటల్ని రాళ్ళు చేసి తనని చావగొడుతున్నట్టుంది వీరేశుకి. నిస్పృహతో అలా కూచునుండిపోయాడు.

కొంతసేపటికి నర్సింహులు వాళ్ళూ వచ్చేశారు.

"ఇంకా వున్నావేటయ్యోవ్? అంత టయింవుందా నీకు?" అన్నాడు నర్సింహులు.

"వొరాలూ..నెగు. పద ఇంటికి. ఒరే! దాన్ని తీస్కుపదరా!" అంటూ నర్శింహులు కొడుక్కి చెప్పి, "నెగు నెగు! మీ అయ్యపోతే మాఁవూ పోయి నట్లేనంటే? ద్దా! ఇక్కఁ ౽ ము కు?" అని దాన్ని చెయ్యి పట్టుకు లేవదీసేడు.

వీరేశు గుండె కీచుమంఁ వరాలు మారు పలక్కుండా లేచింది. ఇటు తిరిగి అయినా చూడకుండా నర్శింహులు వెన కాల నర్శింహులు కొడుకు చెయ్యి పట్టు కొని నడిచిపోయింది...

నిట్టూర్పులు నిప్పురవ్వలయి, అస మర్థత అంత లోతు గోతిలోకి తోసే స్తూంటే...కళ్ళు గట్టిగామూసుకున్నాడు వీరేశు—అంత బాధకి అదే వుపశమనం అన్నట్టు.

* * *

ఒక్కోసారెంతో రద్దీగా ఉండే బడ్డీ ఒక్కోసారి 'ఈగలు తోలుకో' మన్నట్టు టుంది! ఈదార్న పోయే జనం, ఇటు చూసి 'అవసరం' పడే జనం మాత్రమే ఈ బడ్డీ దగ్గరికి వస్తారు. అవతలి బడ్డీ ఎప్పుడూ బిజీ బిజీగా ఉంటే ఇది మాత్రం ఈసురోమనిఉంటుంది 'వచ్చినోళ్ళదయా, ఇచ్చినోడి ప్రాప్తం' అన్నట్టు.

కాల్తూన్నచేంతాడు కొసతో బీడీ వెలి గించుకుని బలంగా ఒక్క దమ్ములాగి ఎండలోకి చూశాడు వీరేశు. వరాలి మధ్య ఇటుగా రావడం లేదు. ఎలా వొస్తుంది? తండ్రిపోయిన కష్టంలోంచి ఇంకా తేరు కొనుండదు. దాన్ని గ్రహణం పట్టుకు పుందిప్పుడు. వదిలితే మాత్రం ఒస్తాదా?

నిట్టూర్చాడు వీరేశు. అంతకంటే చెసేదేంలేదు తను. తన పరిస్థితంతే! మనసులో మంచి ఉన్నా ఎదరోళ్ళకి ఎడం అయిపోతున్నాడు. ఏటిదీ ఇస్త్రితం మూగొప్ప గ్రహచారం కాపోతేనూ!.

నారాయణతో వరాలు నాన్న పోయేడని తన్చెబితే, వెళ్ళి చూసొచ్చేడు. వరాలింకా నర్శింహులింట్లోనే వుందిట, అక్కడే ఉంటాదిట! ఎంతకాలం? ఆడికి పోయీకాలం ఒచ్చి దాకానా? సరే. వుణ్ణీయి. అక్కడే వుణ్నీయి!

"ఒరే, ఈరేశా! నర్శిమ్ములుగాడు వరాలు నాన్నని సాగనంపడానికి సాయం జేస్త్రాటా...ఆ కర్చు ఆడూ పెట్టేట. ఇంకొకదు కొంతెడితే!" అని చెప్పాడు నారాయణ.

'అలాగా?' అనుకున్నాడు వీరేశు.

"మ రైతే ఆ మొగమాటానికే ఆడింట్లో ఉండిపోనాదంటావా వరాలు?"

ఏటి సెప్తాడు తను? తన మొఖం.

"నర్శిమ్ములుగాడేజో ప్లానేస్తన్నా డోయ్! ఆడి బుర్ర సామాన్యందిగాదు. అరొండలబీడీల్ని అరనిమిషంలో తగలెట్టే బుర్ర. దాన్ని వుపకారంతో, మొగ మాటంతో తనింటికి లాక్కుపోయి పోసాకారం జేస్తన్నాడంటే తరవాత ఏదేనా జేస్తాడు. ఏం జేస్తాదది? ఆడది. ఒంటరిది.—ఆడి బలిమికి బానిసయిపోతం కంటే"

నారాయణ అప్పుడు తిట్టిన తిట్లు కూడా ఈ మాటలంత బాధించలేదు వీరేశుని. విలవిల్లాడిపోయేడు. నారాయణ దయచేస్తే బావుణ్ణనుకున్నాడు చిరాగ్గా. వంటరిగా ఉంటే అంత కష్టంలో ఏదో తశ్శాంతి. చిట్టచీకట్లో చిన్న గుడ్డివెలుగ్లా!

అలాపోతోన్న కుర్రాణ్ణి కేకేసేడు వీరేశు.

"ఏయ్యేయ్. ఇటిటూ. ఇలా..."

వచ్చినవాడు నర్శింహులు కొడుకు.

"ఏం?" అడిగాడు వాడు అదోకలా చూస్తూ.

"ఏట్నేదూ...వరాలు ఎట్టా వుంది?"

"వరాలా? బాగానే వున్నది· ఏం?"

"ఏట్నేదూ...బైటికెల్లడం నేదాని?"

"నిన్న బజారుకెల్లిఎండుసేప లెచ్చింది. ఏం?"

నీ'ఏం' బంగారంగానూ అనుకొని "ఏట్నేదూ...అయితేవరాలుకులాసాగానే ఉందంటా? పోన్లే..." అన్నాడు. ఆ కుర్రాడు బుర్రవూఫి, వెళ్లిపోతోంటే పిల్చాడు మళ్ళా.

"ఏం?"

"అయితే అక్కడే ఉంటాదంటా వరాలు? మీ ఇంటికాడే?"

"వుంటాది...మా అమ్మ కిష్టంనేదు. అయ్యతో దాన్ని పంపించీమంటే అయ్య ఇన్నేదు. నిన్న అమ్మతగు వెడితేతన్నే సేడు. అమ్మ సచ్చిపోతానంటే జేగా సచ్చిపొమ్మన్నాడయ్య. ఎంటనే వరాల్ని పెల్లి సేసీస్కుంటానన్నాడు ..." గబగబా చెప్పేడాకుర్రాడు.

వీరేశు వెన్నెముక జలదరించింది. 'అమ్మీడి ప్లాను మండిపోనూ !' అనుకున్నాడు మంటగా.

"అయితే అప్పుడు వరాలేం అన్లేదా?"

"పోతానంది. అయ్య ఎక్కడికంటే, ఇంటికంది. ఎల్తానికీల్లేదన్నాడయ్య. మీ నాన్న చచ్చిపోయినప్పుడు ఎవుడు నిన్నాదుకున్నాడన్నాడు. వరాలప్పుడు కోపంగా ఏదో అంది. అయినా అయ్య యిన్లేదు. అక్కడినించీ కదిలితే కాళ్ళిరగ్గొడ్డా సన్నాడు. రోజూ మా యింట్లో తగువే"

"ఓర్నాకొడకా!" పైకే అనేశాడు వీరేశు యింక లోపల దాచుకోలేక.

"నివ్వెళ్ళు!" అనివాడిని పంపించేశాడు.

వీరేశు నోట్లో బీడీ ఎర్రెర్రగా రగుల్తోందప్పుడు.



## 7

వీరేశుకి ఇరవయి రూపాయల అద్దెకి ఇల్లోటి కుదిర్చాడు నారాయణ.

ఒక గది. అదీ సిగరెట్ పెట్టంతా! దాన్నానుకునో బాత్రూమ్. అదిఅగ్గిపెట్టంత అంతే! అంత పొడూగనోడయితే, నిటారుగ పడుకుందికీ ల్లేపనుకున్నాడు వీరేశు. తలా,కాళ్ళూ గోడగుద్దుకుంటాయి. మూడంకేసుకోవాలాడు! తనం టే పొట్టోడు గనకా సద్దుకుంటాడా కొంపలో. గోడల్ని పెచ్చులూడినా, నేలని సిమెంటు గచ్చుకాకపోయినా, పైనటాపారం కమ్మ రేకుల్దే అయినా– ఇరవయ్యి ఇంచక్కా ఇచ్చేయాల! లేకపోతే పో! అంతే...!

గృహప్రవేశం చేశాడు వీరేశు. ఇంక తిండి ప్రయత్నం? చేతనయినంత వరకూ వొండుకుంటున్నాడు. వంట సామాన్లు కొనుక్కున్నాడు. మెల్లిగా తనవంటూ సామాన్లు ఓటీ ఓటీ చేరేస్తున్నాడు. ఫర్వానేదు ఏదో గుడ్డికంటే మెల్ల మేలు అన్నట్టూ.

నెలసరాదాయం ఫర్వాలేదు. బడ్డీ ఒకసారి వూ్యజుపోయినా, మళ్లీ అదే ఎలుగుతాది......

ఇప్పుడు తన ఇంటి దగ్గర పడుకోవ

డంలో ఒక తృప్తి కలుగుతూంది. దాని వెనకనే వెలుగు వెంట నీడలా—ఒకలోటు కూడా కనిపిస్తోంది! ఒంటరితనం తంటా! తోడు కోసం వెంపర్లాట!

అప్పుడు ఎవరెవరో గుర్తుకి వస్తారు. వరాలు—కాంతం!

చాపమీద బొంతేసుకున్నాడు. ఒక దుప్పటి కాస్త గట్టిది కొనుక్కున్నాడీ మధ్యను. అది ఎండాకాలం పరుచుకుందికీ మిగతా రెండు కాలాలూ కప్పుకుందికీను. తలగడ్డోటి. పక్క బాగానే కుదిరింది. పక్కమీదికే కుదర్లేదనుకున్నాడు విచారంతో కూడిన నవ్వుతో.

గోడకి నారాయణ షాపులోంచి ఆడ బొమ్మ కాలెండరు తెచ్చి తగిలించేడు. "ఓర్నీ అదా! ఈ ఎంకటేశ్వరుడి బొమ్మ వొద్దా?" అన్నాడు నారాయణ.

"అది జుత్తుతెల్లబడ్డాకా! ఇది యిప్పుడే కావాల..." అన్నాడు వీరేశు.

నారాయణ గొల్లున నవ్వి "ఓర్నీ! సరేగానీ బొమ్మతో సరిపెట్టు! ఒక్కడివీ వున్నానని నిజం బొమ్మనేదేనా తేకేం?" హెచ్చరించాడు.

అప్పుడు టయిమెంతయిందో తెలీదు. ఆ గదికి వున్న చిన్న కిటికీలోంచి అవతల చీకటి చిక్కగానే కనిపిస్తోంది. ఎక్కడో ఏదో పక్షి వికృతంగా కూత పెడుతోంది వుండుండి. రాత్రి నిశ్శబ్దం బరువుగా వుంటుంది. నిద్రరాని నిశ్శబ్దం. కాలం కదులుతోందా అని సందేహం రాకమానదు. గతం తలంపుకి రాక మానదు. వర్తమానం ఎదని తలుపులా తట్టక వూరుకోదు. భవిష్యత్తు గురించి భయం ఏర్పడకండా వుండదు!

తర్వాతేమవుతుంది? రేపేం జరుగుతుంది? తనేమౌతాడు? సుఖపడ్తాడా? మార్పు వొస్తుందా... అదెలా వొస్తుంది... అదెలా వుంటుంది...?

లక్ష ప్రశ్నలు—లాటరీ కట్టిన వాడిలా గుండెని పట్టుకు దొలిచేస్తాయి.

వీరేశుకి మళ్ళా కాంతం గుర్తొచ్చింది తన జీవితంలో తననింతదాకా సంతోష పెట్టినవాళ్ళిద్దరే. ఒకరు నారాయణ, ఇంకోరు కాంతం. మంచి కవనియ్యి, చెడ్డ కవనియ్యి అది తనకి సుఖం యిచ్చింది! అది నిజం, అందుకు తను దానికి కృతజ్ఞుడయి వుంటాడు! ఏ మాటకామాటే చెప్పుకోవాలి...

ఏకాంతంలో కాంతం వీరేశు మనసుని వెచ్చచేసింది. మూలిగాడు, నిట్టూర్చాడు. నిద్రపోయాడు వీరేశు.

తలుపు చప్పుడయింది. తెలివి వచ్చింది.

ఎవరో కొడుతున్నారు... ఎవరు?

భయం వేసింది వీరేశుకి. ఎవరది? కొంపదీసి ఆ యములోడు గంగులు మాషా? అమ్మో!

కళ్ళు గట్టిగా మూసేసుకున్నాడు. విప్పడానికి భయం వేసింది.

మళ్ళా తలుపు చప్పుడు. కళ్లు తెరిచాడు.

లేవడానికి భయం వేసింది. మళ్ళా చప్పుడు. లేచాడెలాగో. నడవలేక పోయాడు.

"ఎవ...రెవురూ?" తడబడ్తూనే అడిగాడు. ఒకేళ నర్సింహులా?

"నేను..."

ఆడగొంతు!

కొంచెం కుదుటపడి తలుపు దగ్గరికెళ్ళాడు. తుళ్ళిపడి ఆగిపోయాడు

"తలుపు తియ్యి ఈరేశా"

ఆ గొంతు వరాలు... వరాలుదది!

గెడ తీశాడు వెంటనే. "నివ్వా?"

వరాలు వీరేశుని తోసుకున్నట్టే లోప లికి వచ్చేసింది. వెంటనే తనే తలుపుకి గెడ పెట్టేసింది. అప్పుడు గుండెలమీద చెయ్యి వేసుకుని వూపిరి వదిలింది బరువుగా.

"ఏటది వరాలూ?"

"సెప్తా. కొంచెం మంచినీళ్లివ్వు. నోరెండిపోతున్నాది"

గ్లాసుతో తెచ్చిచ్చాడు. గటగటా తాగేసి గ్లాసిచ్చేస్తూ—

"మరదక్కు! నా కరమకాలిపోనాది. మా నాన్న కాలిపోగానే" అంది వరాలు.

వీరేశు గుండె ఝల్లుమంది. అంటే ఏటయింది...కొంపదీసి దీన్నేంచేసేడాడు? 'ఒరే నర్శిమ్మా!' పళ్లుకొరుక్కున్నాడు.

"కూకో" నీర్సంగా చెప్పాడు దానికి.

వరాలు చతికిలబడింది కింద. గొంతు తగ్గించి చెప్పింది. నర్శింహులు తనని కాలెయ్యడానికే వాడింటికి తీసుకు వెళ్లాడు. వాడి పెళ్ళానికది ఇష్టంలేదు. రోజూ మొగుడ్ని పోరేటి. వరాల్ని పెళ్లి చేసుకుంటానని బాహాటంగానే చెప్పేశాడు నర్శింహులు. దాంతో వరాలు భయపడి పోయింది. అక్కడినించి కదిలితే చంపే సానని బెదిరించాడు నర్శింహులు. వరాలు కేంతోచలేదు. ప్రాణభయం మాన భయం!

అవాళ నర్శింహులు బాగా తాగి వచ్చేడు కొంపకి. వాడి నోట్లోంచి వాసన కంటే వెలపరంగా ఉన్నాయి వాడి కూతలు. వరాల్ని పిల్చాడు. దగ్గరికి రమ్మన్నాడు. రాలేదని తనే మీదికి వెళ్ళాడు. పోరాడించ ఓపిక తెచ్చుకుని. పెళ్ళాం అదంతా భరించలేక అడ్డం వస్తే దాన్నోతోపు తోసేసేడు నర్శింహులు. అది కిందపడి హరీ మన్నాది. వరాలది చూసి కెవ్వుమంది భయంతో.నర్శింహులు పట్టునించి తప్పించుకోడం చాలా కష్టంగా ఉంది అయినా పోరాడింది. చేతికి దొరికిన వస్తువుతో కొట్టింది. నర్శింహులి పిల్లల్ని వాడిమీదికి బలంగా తోసేసి, వాడు కింద పడితే మంచం వాడిమీద ఎత్తేసి, ఒక్క వుదుట్న ఆ కొంపలోంచి బైటపడి, పరి గెత్తింది. నర్శింహులి కొడుకువల్ల వీరేశు ఇంటి గురించి తెల్సుకుంది ఒకసారి. పరిగెత్తి అక్కడికి వచ్చేసింది. ఇంకె క్కడ తనకిప్పుడు రక్షణ...?

అప్పటికి కుదుటపడింది వీరేశు గుండె.

మళ్ళామంచినీళ్ళడిగితాగితేకానీవరాలు గొంతు తడవలేదు. అలిసిపోయిందేమో ఆయాసంతో వరాలు గుండెలు ఎగిరెగిరి పడ్తున్నాయి. చీరె కొంగుతో మొఖం, మెడా తుడుచుకుని, చుట్టూచూసి "ఇద్దా నీ యిల్లూ?" అంది.

తలూపేడు వీరేశు.

"ఏంటో నాకు బయ్యింగుందీరేశా! ఆడు ఎంటాడ్తాడేవో?"

"నివ్విక్కడికొస్తావనాడికేంతెల్సూ?"

"ఏవో! ఆడు నీమీదా ఓ కన్నేసే ఉంచేడుగదా?"

ఆశ్చర్యంగా చూశాడు వీరేశు.

"నీకు నామీద మనసుందనాడికి తెల్సుగదా? అందికే...ఆడు నన్ను చెర బట్టాలన్నూసే నేనొప్పుకోలేదని, నిన్నూ బూతులు తిట్టేవోడు"

వరాల్ని చూస్తూ నిట్టూర్చాడు వీరేశు. తనో మాయగుండంలో పడిపోతే... ఇదో మాయగుండంలో కెళ్ళింది.

"ఆడొస్తే...?"

"వొచ్చినప్పుడు సూద్దారి...తొంగో!

ఇంకా శానారే తిరున్నాది''

దానికో పక్క ఏర్పాటుచేసి, తను దుప్పటితో సర్దుకున్నాడు వీరేశు కొంచెం ఎడంగా.

వరాలు ఆశ్చర్యంగా చూసింది వీరేశుని.

'నీకు ధైర్యం లేకపోయినా నిజాయితీ ఉన్నాది...' అనే మెచ్చుకోలు ఉన్నదా చూపులో. 'నీకు కండలేకపోయినా గుండె ఉన్నాది...' అనే అభిప్రాయం కన బడిందా కళ్ళల్లో.

* * *

"ఏంట్రా ? ఎవర్ని ఇంటికి తీసు కొచ్చేవు?" అడిగాడు నారాయణ - ఆ ఉదయం వీరేశు బడ్డీదగ్గరికి వస్తూంటే ఎదురొచ్చి.

వీరేశు తడబడ్డాడు. బుర్రొంచుకుని, "వరాలే..." అన్నాడు.

"వరాలే! అదాడదే. వయసులో ఉన్నదే!'' ఎకసక్కెం చేస్తున్నట్టూ నారాయణ గొంతు ధ్వనించింది.

"నేనేం తీసుకురాలేదు. అదే వొచ్చే సింది రాత్రి..." అంటూ వరాలు ఏ పరిస్థితిలో వచ్చిందో చెప్పాడు వీరేశు.

అంతా విని, నారాయణ కాసేపు ఆలోచించాడు.




"అయితే ఏం చేద్దామని నీ వుద్దేశం?"

"ఇంకా ఏటనుకోనేదు..వచ్చినదాన్ని ఎలాపొమ్మననూ – అసలే అది సగం చచ్చి ఉంటేను...!" అన్నాడు వీరేశు నారాయణని చూస్తూ. అతనేమయినా సలహా చెప్తాడని చూశాడు.

"నువ్వు దాన్ని పొమ్మన్లేవురా! ఏం? ఎందుకంటే అది 'వరాలు' కాబట్టి?"

నవ్వి వూరుకున్నాడు వీరేశు.

నారాయణ దగ్గరగా వచ్చాడు.

"ఒరే! దానిమీద నీ జాలి, మమకారం అంతా బానేవున్నాది గానీ...నర్శింహులు గాడు వొచ్చి నీ పీకెమీద కూసుంటే ఏం జేస్తావురా?" అడిగాడు తాపీగా.

"అదే బయ్యంగుంది నాకు..." నసిగాడు వీరేశు.

"ఆడసలే జెబ్బపుష్టిగలోడు ! తాగు బోతోడు! నీ పీకె పటక్కానిరిచేసి, నీ చేతిలోనే పెట్టేసి వరాలు చెయ్యి పట్టుకు ఈడ్చుకుబోతే...?"

గుభేల్మంది వీరేశుగుండె. నర్శింహులు గాడంత పనీ చేసీగల్డు! ఆడి గుణం తెల్దా తనకి?

"ఏదో దారి సెప్పు..." ప్రాధేయ తగా చూశాడు నారాయణని. అతను చిరాకుపడ్డాడు.

"నువ్వెప్పుడూ పీకె మీది కత్తి గొడవలే తెస్తావురా?" అన్నాడు కోపంగా.

'తన అసలు గొడవ' నారాయణకి తెలీదు. అదిగానీ తెలిస్తే ఇంకేవయినా వుందా !? ముందు గంగులు చేతే తనని చావ గొట్టించేస్తాడేవో నారాయణ?!' అనుకున్నాడు వీరేశు భయంగా.

అప్పటికి ఎండెక్కిపోయింది బాగా.





"ఎక్కెక్కు"

బడ్డీ ఎక్కేడు వీరేశు.

"నాను షాపుకి పోతున్నాను... చూడూ! ఆ ముండాకొడుకుగానీ ఇటు వొస్తే... నాక్కాబురెట్టు షాపులోకి?" అని వెళ్ళిపోయాడు నారాయణ.

బుర్ర దిమ్ముగా వున్నాది.

ఒక సోడాకాయ కీచుమన్నాది.

గుండె అస్థిమితంగా వున్నాది.

ఓ సిగరెట్టు కాల్తున్న చేంతాడుతో కల్సి, వెలిగి, రగిలింది.

ఆతర్వాతేం బేరాలు లేవు.

అవతల ఎండ, లోపల తనూ!

కాకా హొటేల్లో కెవరెవరో పోతున్నారు. మెక్కుతున్నారు. వొస్తున్నారు. కడుపు నిండితే కిళ్లీ కావాలి. వక్కపొట్లం కావాలి. సిగరెట్ కావాలి. అప్పటిగ్గానీ, బాబులుకి కథ పూర్తవదు.

వాళ్ళకి దగ్గర చుట్టం ఆ బడ్డీవాడు! పెద్దలెటు ముందు రెక్కపుచుగుల్లాగా మూగేస్తున్నారు జనం– ఆ బడ్డీముందు.

బస్సుల్లోంచీ, రిక్షాల్లోంచీ కొంతమంది రోడ్డుమీద దృశ్యాల్ని సినిమా అంత కుతూహలంతో చూస్తున్నారు. నడిచిపోయే వాళ్ళంత యిదిగా చూడరు. వాళ్ళ దృష్టి వెళ్ళబోయే చోటుమీదే, అవబోయే పనిమీదే, నడిచే కాళ్ళ కష్టం మీదే వుంటుంది. సుఖంగా వాహనాల్లో వున్నోళ్ళకే 'సీన్లు' కావాలి!

బస్సులు దింపేస్తున్నాయి ఇద్దర్ని. ఎక్కించేస్తున్నాయి ఎనమండుగుర్ని! కొన్ని బస్సుల్నిండా బస్తాల్లోకి ఏదో కూరేసినట్టూ మనుషుల్ని కూరేసేరు కండక్టరు!

ఇలా చూస్తోంటే తనకి కాస్త కులాసాగా అన్పిస్తోంది.

మునుపింత కుదురుగా వున్నాడా?

అప్పుడిది లేదు. కాని—

ఆరాటవూ, ఆందోళనా ఎప్పుడూ వున్నాయి!

అవెప్పుడు పోతాయో?!

ఎంత ఎంతో ఎక్కి పోయింది.

సూర్యుడు మధ్య పాపిట్లో వున్నాడు.

ఎదురు బడ్డీవోడు ఎండాకాలం సూర్యుళ్లా ఫెళఫెళ్ళాడుతున్నాడు. మొన్న ఆ బడ్డీలోకి రేడియో తెచ్చేడు! అది ఝామ్మంటూ గాలిని పాటల్తో, వార్తల్తో, సంగీతంతో, వాటితో పీటితో, పొలాల్తో, తెగుళ్ళతో నింపేస్తోంది. ఒక్కో అయిటముకి ఒక్కో పోజు కొడు తాడాడు అందులో కూచుని. చూడాల్నా కొడుకునప్పుడు... ఏం పోజండీ! ఎన్టీవోడు రాజకుమా రైతో సరసం ఆడినప్పుడంత పోజెయ్యడు. కత్తి, గుర్రంతో ఉన్నప్పుడంత పోజెయ్యడు.

నిట్టూర్చాడు వీరేశు. ఆ పాటల్తో, ఆ మాటల్తో, ఆ సందడితో, ఆ వెలుగుల్తో, ఫెళఫెళల్తో అది వంద వోల్టుల బల్బులా వుంటే తనబడ్డీ ఎలా వున్నాది. హుఁ! నలభయ్యా?అబ్బే! అంతకూడా కాదు. ఇరవయ్యా...వుఁహు! పదో, అయిదో... అంతే. అంతే!

విచారించాడు వీరేశు. తన బడ్డీ దవునైపోతున్నాది. అవున్నిజెం. ఆడు హంగామా పెంచేస్తోంటే తనది ఎందుకు దవునైపోదూ? తన బడ్డీలో ఏటుందని? రేడియో వుందా, లైటుందా, ఫేనుందా? అన్ని రకాల సామాన్లున్నాయా...? సోడాలుకొట్టే మిషనుందా? అబ్బెబ్బే. మరెందుకు జనం వొస్తారు?

నారాయణకిదంతా తెలీదా, తెల్సా? తెల్సి వూరుకుంటున్నాడా?

ఎందుకూరుకుంటాడూ, అన్ని పాట్లు పడి బడ్డీ వేసినోడు? నారాయణతో చెప్పాల!

అవునేటి చెప్తాడు?

సందేహంలో పడిపోయాడు వీరేశు.

'ఇలావుంది పరిస్థితి' అంటే అతనేం చేస్తాడు?

చేసేదేదో ముందే చేసేడు!

ఇంకా ఏం చెయ్యడానికి స్తోమతెక్కడుందతనికి?

అంతపాటి ఉపకారం చేసినోడెవ డుంటాడసలు?

నెత్తుటి ముడి వున్నోళ్లే నెత్తిన చేతు లెట్టుకో పొమ్మంటారు గదా?!

ఎదరబడ్డీ ఎములోళ్లా...గంగుల్లా... నర్శింహుల్లా కనిపించసాగింది వీరేశుకి.

మద్యాన్నం అయింది. బడ్డీ కట్టేసి ఇంటికి వెళ్లాడు. తోవలో ఓ సందేహం... నర్శింహులెంచేత రాలేదు....!

ఇంట్లో ఆ రోజు వంట వరాలు చేసింది.

ఆ పరిస్థితెంతో సంతోషం కలిగించింది వీరేశుకి. ఆ మార్పు ఎంతో తృప్తినిచ్చింది. ఆ సమయం తర్వాత కూడా ఎప్పటికీ అలాగే ఉండిపోవాలనీ, వరాలు వొండుతూంటే తను తినాలనీ, అది తన ఇంట్లో ఉంచటమే తన కెప్పటికీ కావాలనీ అనుకుంటూ మురిసిపోయాడు.

"నిన్నటి పప్పంటే పప్పుశారు కాసేను... ఈదిలోకి వొంజవాలొస్తే వొండేను..."అని చెప్పింది వరాలు.

ఇష్టంగా తింటూ, "అయితే, ఆడు రానేదా?" అడిగాడు.

"ఇంటికా? నేను...కొట్టుకాడికి?"

"రానేదు..."

"ఆడి పెళ్లాం సచ్చిపోనాది గదా? ఆ గొడవిలో పడుండిపోనాడు గాబోసు"

అంది.

"అద్దా సంగతి!"

"దాన్నో తోపు తోసేస్తే అదా యింతా పడీ, కునికిసిందని చెప్పేను గదా?"

"అవునవును. ఆడి వుత్తుపాతం అలా ఉన్నాది. పెళ్ళాన్ని చంపుతాడు. వూరి ఆడోల్లని సెరుస్తాడు. నాలాంటోడు ఏదేనా అంటే కలబడిపోతాడు. ఎంత కాలం ఎగురాదిలే ఆడి జెండా? సూడమా!"

వరాలు వుస్సుమని నిట్టూర్చింది. "ఇయాళ కాకపోతే రేపయినా ఆడు రాడంటావా?"

వీరేశు దాన్ని కిందా మీదా చూస్తూ "రానియ్యే! రానీ. దేనికేనా తరుగూ విరుగూ ఉండుద్ది. రానీ ముండాకొడుకుని ...! ఆడాడి పెళ్లాన్నెలా చంపీసేడో నానూ ఆడినలాగే చంపీస్తాను వొరాలూ! నేన్నీ చూపుకెంత బక్కోడినైనా నాకూ రోసవ్వూ, పట్టూ, తెగువా వున్నయ్యే. నేనాడంతం సూస్తాను"

పళ్లు బిగించాడు. ఆవేశంతో మెతుకులు గొంతులో కొరబోయి దగ్గొచ్చింది. మంచినీళ్లుతాగి "ఆడేకాదు అల్లాడి అంతం గూడా సూసేస్తాను" అన్నాడు.

"ఆడెవడు?" వరాలు ఆశ్చర్యంగా అడిగింది.

అప్పటికి వీరేశు తను నోరు జారేసని తెలుసుకున్నాడు.

"ఇంకోడెవడీరేశా?"

ఎవడని చెబుతాడు?

భోజనం ముగించి చెయ్యికడుక్కుని లేచాడు. అవతలికి చూశాడు. ఎంత యిందో ఏళ మళ్లా ఎల్లాలి! బడ్డీ ఎలా గున్నా దానిమీద కూచోవాల-కట్టుకున్న దెలాంటిదయినా దాంతో సంసారం చెయ్యక తప్పనట్టూ...!

"ఎల్తానే"

"బడ్డీకా? అప్పుడేనా" అంది వరాలు. "నివ్వు బడ్డీ మధ్యాన్నం రెండు గంటలకగ్గాదా తెరుస్తావూ"

'అంతదాకా నీ ఎదరగా వుండడాని కిష్టమేగానీ నా నోరు జారడం ఇష్టంనేకా, నీ ముందు నా రంకులు బైటపడిపోడం ఇష్టంనేకా బేగెల్లిపోదారని...' అని చెప్పలేదు వీరేశు.

వరాలు మాత్రం ఇందాకటినించీ ఆలోచిస్తోనేవుంది. వీరేశు ఆవేశాన్ని చూసి 'ఎవుడాడూ? ఈరేశులాంటోడితో తగిలేవోడు ఆ నర్సిమ్ములు కాకా?

ఇద్దరూ ఒకరిని ఒకరు నిలువునా చూసుకున్నారు.

ఆ గదిలో అప్పుడు అనుమానం, సంశయం, వ్యాకులపాటూ, ఆవేశం వుండకపోతే – వాళ్లిద్దరూ చూపుల్తోనే ఎడంగా వుండేవాళ్లుకారు.

గట్టిగా నిట్టూర్చి-"ఎల్తాను" అని బయలుదేరాడు వీరేశు.

* * *

ఎదురు చూడ్డంలో ఎంత ఆత్రం ఉంటుందో, ఫలితం దక్కకపోతే అంత వుసూరుమనిపిస్తుంది. ఆ లోటు ఎంత బాధాకరమో వీరేశుకి బాగా తెలుసు. తనకా అనుభవాలన్నీ తటస్థించకపోవచ్చు కానీ ... తను కళ్ళారా వాళ్ళందర్నీ చూశాడు. వాళ్ళ అసంతృప్తికి వాళ్ళతో తనూ విచారించాడు.

ఇప్పుడీ కిళ్ళీబడ్డీమీద తన ఉద్యోగం అలాంటి ఎదురుచూపే....అలాంటి ఆసం

తృప్తే...అలాంటి లోటే!

ఎవరెవరో ఈ రోడ్డుమీద తిరుగుతారు తనదితప్పా ఎన్నో బస్సులొచ్చినట్టూ, తనదితప్పా ఎన్నో నంబర్లున్నట్టూ ఒక్కరూ రారిటు. బేరాల్లేవు. బడ్డీలో సామానలాగే ఉంటోంది.

కొన్ని ఇచ్చేస్తున్నాడు తెచ్చిన వాళ్ళకే-ఎటూకాకుండా అవి పాడయి పోతే నష్టమని.

ఎదర బడ్డీవోడు అలా వస్తున్నాడిటుగా. తెల్లటి షరాయి కోడిగాడు. తెల్లటి కళ్ళీ లాల్చీ వేశాడు. మల్లెపువ్వుల్లాంటి బట్టల్లో నల్లని హీరోలా ఉన్నాడాడు. క్రాపింగు స్టయిల్‌గాచేయించేడు.చేతికివాచీ పెట్టాడు. ఎండకో, షోకుకోగానీ నల్ల కళ్ళద్దాలు పెట్టాడు. వాడి వొంటిమీద అయిశ్వర్యం, వాడి బడ్డీలోని సంపదా వాడి బడ్డీకి వెళ్ళే జనం పెంచుతున్నారు.

పలకరించాడు. చేతులు కలుపుకున్నారు. వీరేశుకిబ్బందిగా ఉంది.

''ఎలావున్నాది కొట్టు?'' అడిగాడు అతగాడు.

వీరేశు పలకలేదు.

"ఇదీ సెంటరేనే! ఎంచేత ఎవురూ రావడంనేదూ?"

''అదేవో...'' ముక్తసరిగా చెప్పాడు వీరేశు.

ఆడి బడ్డీలో ఎవరో ఆడమనిషి కూచుని సరుకులమ్మేస్తోంది ఎడతెరిపి లేకండా. ఆ సంగతెలుసు వీరేశుకు. కాని ఆ మాటన్లేదు పైకి.

"ఎవురా అమ్మాయీ?" అటు చూస్తూ అడిగేడు.

"మా మరదలు! నాల్గేళ్ళక్రితం పెళ్ళి చేసేం. మొగుడు చచ్చేడు బస్సు గుద్దేసి. మా ఇంటికాడే వుంటోందిలే. ఇయాళ బడ్డీలో కూచోమన్నాను. ఆడదమ్మితే అవ్వరాఘవరుమని వొస్తారు జనం! చూడు అటు!'

చూశాడు వీరేశు మళ్ళీ అటుకేసి.

బడ్డీకట్టిన బోర్డుతప్పా ఇంకేం కనిపించడం లేదు వీరేశుకళ్ళకి. అంత జనం!

"అదున్నన్నాళ్ళు బడ్డీలో కూకోబెడ్తాను"

తన బడ్డీలోకీమధ్యన పేపర్లూ, పుస్తకాలూ తెప్పించి అమ్మిస్తున్నాడు ఆడు. వాటికోసం ఎగబడేవాళ్ళెందరో?!

రోడ్డుకడెళ్ళి ఆ బడ్డీవాడు కాకా హోటల్లో టీ తాగేసి వచ్చాడు. తనడబ్బా వాయించుకోడం ఆరంభించేశాడు.

వాడి బడ్డీ గొప్పదనవూ, రాబడీ వినలేకపోయాడు వీరేశు. కచ్చితంగా తన బడ్డీని పడగొడదామని వాడు వాడి బడ్డీని బాగా పెంచేశాడీమధ్య.

వాగి వాగి వాడెళ్ళిపోయాడు.

వినీ వినీ తన ప్రాణం విసుగిపోయింది.

'అయితే ఆడమనిషిని బడ్డీలో కూచోపెడ్తే బాగా అమ్ముడుపోతాయా సరుకులు...?'

వరాల్ని అడిగితే? ఒప్పుకుంటాదా?

నారాయణ ఏవంటాడో? ఏవంటాడు?

ఏదో తీర్మానానికి రాకపోతే బడ్డీ ఏవైపోతాది? తనేవైపోతాడు...?

ఎండకో, భోజనం పడిన అలసటకో గానీ కునుకువస్తూంటే వీరేశు కళ్ళు అరమూతలేస్తూ కూచున్నాడు.

అడుగుల చప్పుడు... బేరం!

కళ్ళు విప్పి చూశాడు

గంగులు!

నిద్ర తోక తెంచుకుని పారిపోయింది.

"నేన్రా ఈరేశా! ఏంటలా చూస్తన్నావు ఎరగనోణ్ణి చూసినట్టూ? ఆ!?

మని ఏడు జలమలబంధంరొరే! తెంపేస్తే తెగేదికాదురోరే. అంచేతెలా రాకుండుంటా న్నెప్పూ?" పకపకా నవ్వేశాడు గంగులు.

వీరేశు బిక్కమొహం వేసుకున్నాడు. వాడినవ్వు తనకేడుపు!

"ఏటిటా? నీ కొట్టిలా తెల్లమొగం వేసు కుందీ? ఎంచేతటా?"

"..........."

"మాటాడవేంరా?"

వీ రే శు గుండెలో భయం, కోపం, అనుమానం, దుఃఖం... ఎలా వొదిలించు కోడం ఈడిని?

అరటిపళ్ల తీసుకోబోయేడు. వొద్ద న్నాడు. సిగరెట్లిమ్మన్నాడు. యివ్వ నన్నాడు. గంగులు వీరేశని కిందా మీదా చూశాడు.

"అంత బిగుసుకున్నావేందిరోయ్? ఆ! ఆ... ! అయితే ఏటీ యియ్యవన్న మాట?"

"నష్టం వొసాది..."

"నష్టంవా? నీవల్లనానెంత నష్టపోయేనో తెల్సా ఒరే?"

పలకలేదు.

"కాంతం నన్ను సూడకండా వున్నాది"

వులిక్కిపడ్డాడు. అదబద్దం కాదు గదా?

గంగులు తొందరపెట్టేడు.

"పదరా! అలా ఎళ్లాల మనం!"

"ఏడకి?"

"డబ్బవసరంగుంది"

"అయితే?"

"నువ్విస్తావని వొచ్చేను! ఇవ్వవేటి?"

"నాదగ్గరేటేన్నేడు. సూస్తన్నావు గదా కొట్టిలా ఏడుసోంది. వొచ్చి నాలుగు డబ్బులూ ఆగిపోనాయి...."

"అలగా! పోనీ నువ్వివ్వొద్దులే! నీ చేతులిసాయి!పదా....పదమంటేనూ..."

వీరేశు ఆలోచించేడు. వీడి ప్లాను కూలి పోనూ!

"బడ్డీ కట్టేయేస్! బేరాల్లేని బడ్డీ అక్కరకురాని సుట్టంలాంటిది! నువ్వొస్తా వనుకో! దాన్ని దాని కర్మానికాగి! రా!"

"నారాయణ వస్తే తిడ్తాడు. నేరానను"

"ఏటిటా? మురిపించుకుంటన్నావు? సరేరా. నేనే నారాయణతో చెప్పి తీసుకుపోతాన్లే! అలాగేనా?"

హడిలిపోయాడు. నా రా య ణ తో చెప్తాడా ఏటని?

మళ్ళా కోపం...నిస్సహాయత... దుఃఖం.

"వొద్దు! పదా..."

బడ్డీ మూసేసాడు. గంగులు వెంట బైల్దేరాడు,

అప్పుడు నాలుగు దగ్గరవుతుంది టైము. ఎండదనరు కొంచెం తగ్గింది. గుండెదనరు పెరిగింది. తోవలో వరాలు ఎదురైంది! చేతిలో ఏదో పొట్లం! "ఏటెక్కడికి కెల్తున్నావూ?" అనడిగింది ఆశ్చర్యంతో.

"అదేటదా పొట్లం? నివ్వేటిన్నించి?"

"మద్యాన్నం మళ్ళా పాచిపని కొప్పుకున్నాన్లే. ఆ యింటోరు నంచు కుందికని వూరగాయిసేనూ... కొట్టు కట్టేసేవా? ఎక్కడికో సెప్పకూడదేటి?"

ఎక్కడికని చెప్తాడు? సినిమా చూడ్డానికా? షికారు కొట్టడానికా దేనికని?

"సిన్న పనుందిలే. వరిజెంటు ... అందుకనీ.." అనేశాడు. గంగులు ఇద్దర్నీ కలిపి చూస్తున్నాడు. విడదీసీ చూస్తు





న్నాడు. వాడేదేనా చెయ్యగలడు.

"నివ్వింకా ఆ నర్సిమ్ములు కాడే 'వుంటన్నావా?" అడిగేడు గంగులు.

"నేదు..." పొడిగా చెప్పింది వరాలు.

"ఆడి పెల్లాం పోయిందంటా? ఆడే చంపేసేడని ఆడి పిల్లలే అందరికీ సెప్త న్నారంట! ఇదేం యిసిత్రం ఈరేశా!"

"యిసిత్రం కాదులే! ఆడి పాపానికి శిక్సది. పిల్లలబద్దం ఆడరు.." అంది వరాలు.

"పోలీసులొచ్చి నర్సిమ్ముల్ని తీసుకు పోయి కటకటాల్లో ఎట్టేసేరు!"

"మంచి పనైంది తొత్తుకొడుక్కి" చేతి మెటికలు విరిచింది వరాలు. వాళ్ళిద్దరి మధ్యా మాటలు వీరేశు సహనాన్ని చంపు తోంటే భరించలేకా "ఎల్దాం వరాలూ" అన్నాడు.

గంగులు గేలానికి మనుషులంతా చేపలే! దానికి మగా లేదు! ఆడా లేదు. అందుకే తన భయం!

గంగులు వెంట నడవసాగాడు. గుండెలో ఇప్పుడు ఒక వేపు భయం. ఇంకో వేపు నిబ్బరం! నర్సిమ్ముల్లి పీడ తప్పింది. ఇంకా ఈడి పీడ ఇరగడవడం నేదు. అదెప్పుడో? ప్చ్!

రోడ్డు మీద గాలి కొంచెం చల్లగా వచ్చి పలకరిస్తోంది. అది మనిషినే తడుతోంది మనసుని తప్పా...!

ఒక రోడ్డు ఎత్తయితే, ఇంకో రోడ్డు పల్లం ఈ వూర్లో. అంతా ఎగుడూదిగుడు! అన్ని రోడ్లూ ఒక్కలా వుండవు. అన్ని వీధులూ ఒక్కలా వుండవు. కొన్ని పెద్దవి. కొన్ని గల్లీలు బాగా చిన్నవి! మెయిను రోడ్డు మాత్రం అదెక్కితే పెళ్ళోరి విడిదిలోకెళ్ళి నట్టుంటాది. అంత సందడీ, అంత కులాసా, అంత రొదా, అంత ఆర్భాట వును!

ఓ సైకిల్ని గుద్దేబోయీ, ఓ స్కూటర్నించి తప్పించుకునీ, ఓ కారు కింద పడబోయీ, దేనివల్లా ప్రమాదం లేకుండా వెళ్ళీ వెళ్ళీ సినీమాహాలు దగ్గరాగేడు వీరేశు గంగులతో.

హాలు గోడలకి అప్పుడాడుతోన్న సినీమా బొమ్మలు పెట్టబడి వున్నాయి. ఫైటింగు పిక్చర్లా వుందది! పిస్తోళ్ళు, తుపాకులు, కత్తులూ, గుర్రాలూ, మంటలూ, ఏంటో? అంతా గొప్ప స్టంటులా వుంది! ఆమధ్యన-ఒక ఆడది-జుత్తు మీదికి గుర్రం తోకలా వున్నాది. రెవిక వున్నా, వుండాల్సిన చోట వుండ లేనన్నట్టుంది. ఆయమ్మ బొడ్డెప్పుడూ ఆకాశంలో చంద్రుళ్ళా అందరికీ అందు బాటుగానే దర్శనం ఇస్తాది! ఇంక మొలకి రంగు రంగుల రిబ్బన్లు వేలాడు తున్నాయి!

క్యూ చేంతాడులా వున్నాది! వాళ్ళ కళ్ళు గోడల మీదా, మనసు టిక్కెట్ల మీదా.

ఆ అత్రాన్ని తన లాభానికి పిండు కుంటున్న గంగులు, గబగబా హాలు యజమాని దగ్గరిక్కా-బోలెళ్ళాడు!

కాసేపట్లో టిక్కెట్లు తెచ్చేడు. బెల్లు కొట్టేరు. చేంతాడు కదులుతోంది. ఆవాళ తను దగ్గరుండీ ఈరేశు చేత టిక్కెట్లు అమ్మించాడు గంగులు. అవి నలభయ్యి. జనం ఆ అంకెకి ఆరింతలున్నారు. అంచేత నిక్షేపంగా చెల్లిపోయేయి!

మొత్తం డబ్బు గంగులు పట్టికెళ్ళి, హాలతనికి ఇవ్వాల్సినది ఇచ్చేశాడు. మిగిలింది తనది.



డబ్బు జేబిలోకెళ్లింది.

చెయ్యి వీరేశని పోయిరమ్మంది.

పైసా కూడా అందులో తనకి వాడివ్వడు! ఎంతదారుణం? అడిగినా యివ్వడాడు. తనని వాడి ప్రయోజనానికి వాడుకుంటున్నాడు. ఇలా ఎన్నాళ్లు? ఎన్నాళ్లు?

వీరేశు పిడికిళ్లు బిగుసుకున్నాయి.

పళ్లు ఫటపటమన్నాయి.

కళ్లు ఎర్రజీరల్లో కదంతొక్కాయి.

అడుగులు అతివేగంగా పడుతున్నాయి.

*　　　*　　　*

ఇంటికి చేరేసరికి చీకటి పడింది. లాంతరు వెలుగులో వరాలు లక్షణంగా కనిపిస్తోంది! జుత్తు నున్నగాదువ్వుకుంది. నుదుట్న గుండ్రటి చిన్నబొట్టు దిద్దుకుంది. నల్లటి చెంపలు నునుపుగా మెరుస్తున్నాయి- తమని తాకితే తప్పేం లేదన్నట్టూ.

వీరేశు గుండె గబగబ కొట్టుకుంది. నరాలు వుద్రేకంతో వుప్పొంగేయి. అంతలోనే ఆవేశం ఒక్కసారి దిగిపోయింది.

వరాలు చీరెచెంగు సవరించుకుంటూంటే, కప్పుకునే చోట కనిపించిన చిరుగులు వీరేశు మనసుకి చీమలై



కుట్టాయి. వరాలుకి వున్నవి మూడే చీరెలు. తండ్రి చనిపోయినప్పుడు, నర్సింహులో వాళ్ళ యింటికి వెళ్ళిపోయింది కట్టుకున్న దాంతోనే. తర్వాత నర్సింహులు కొడుకు చేత తన చీరెలు తెప్పించుకుందామంటే, ఆ అబ్బాయి వెళ్ళి వచ్చి ఒక్కటే చీరె వుందని తీసుకు వచ్చేడది. అది అక్కడక్కడా మాసికలున్న చీరె! మంచి చీరె కాసా ఎవరో కాజేసేసేరు. ఇంటిని అలా వదిలివేసి వచ్చేస్తే ఏమవుతుందనుకుంది విచారిస్తూ.

తమ యింటిలోంచి ఎత్తుకుపోయింది ఆ చీరేకాదు. వంటపాత్రలు లాంటి కాస్త పనికొచ్చే వస్తువులు కూడా!

దొంగలెవరో తెలీదు. వాళ్ళని తిట్టుకుంది వరాలు.

"కక్కూర్తినాయాళ్లు !" మెటికలు విరిచింది.

తను ఎలాంటి పరిస్థితిలో వచ్చేసిందా యింటినించీను?

తమ చుట్టూ వున్న పాకల్లోవాళ్ళే ఎవరో ఆపని చేశారని గట్టిగా తీర్మానించుకుంది. వాళ్ళంతా ఏరోజుకారోజు జరుగుబడి వాళ్లే! కక్కూర్తి మనుషులే. అవకాశం బట్టీ, సమయాన్ని బట్టి దొంగ తనమాడీడం వాళ్ళకలవాటే! తను మళ్లా ఇంకోచీరె కొనుక్కోవాలంటే ఎంతో శ్రమ. డబ్బు కూడెట్టాల. అందుకే మళ్లా పాచిపనికి వెడుతోంది. తనకీ, వీరేశుకీ కూడ కాస్త సాయం అది.

చీరె భుజాల మీంచి కప్పుకుని వీరేశుని చూసింది వరాలు.

అతగాడి కళ్లు విచారంగా వున్నాయి.

వీరేశు వరాలు దగ్గరకి వెళ్ళాడు

"ఎందుకట్టా బిడియం పడ్తావు? చీరె చింకిదనేనా? మంచిది కొందాం లే" అన్నాడు.

"నివ్వుకొంటావా?" అందిఆశ్చర్యంగా.

"ఏం, కొన్లేనా?"

"నీ దగ్గర ఏటుందనికొంటావు? బ్లాకు టిక్కట్ల సొమ్మా?"

ఒక్కసారి సిగ్గుపడిపోయాడు వీరేశు. ఎంతలా కొట్టిందీ దెబ్బ!

కొంతసేపు ఏంమాటల్లేవిద్దరి మధ్యా. లాంతరు వెలుగు, గోడల మీద తమ నీడలు, ఆ గదిలో వున్న సామాను ఇద్దర్నీ నిశ్శబ్దంగా చూస్తున్నాయి.

"వరాలూ!"

వీరేశుకి మళ్ళా యిందాకటి తమకం వొస్తూంది వరాలు కళ్ళని చూస్తోంటే.

దాన్ని సమీపించి, భుజాల మీద చేతులు వేశాడు.

"తీసేయ్!" అంది వరాలు గంభీరంగా.

"అలా అనకే! మనం ఎట్టాగూ పెళ్ళాడబోయే వోళ్ళమేగదటే?"

"ముందా సేతుల్తీసేస్తావా? తోసేమన్నావా?"

తెల్లబోయి తీసేశాడు వీరేశు.

"అంత కోపంగుందేటే?" అన్నాడు నెమ్మదిగా.

"నివ్వు చేసే పన్లు సూస్తావుంటే... మురిసిపోయీ ముద్దెట్టుకుంటారేటి ఎవురయినానూ ?"

దాని కంఠంలో తీక్షణతకి కొంచెం భయపడ్డాడు వీరేశు. ఇప్పుడిది వెన్నెల కాదు. ఎండే. దగ్గరికెడ్తే మండిపడ్తోంది.

"ఆడు గంగులుగాడు మళ్లా నీసేత టిక్కెట్లు బ్లాకుల అమ్మించినాడుకదూ?" అడిగింది వరాలు గట్టిగా.

ఆ మాట అబద్దమని తనెలా అనగలడు.

మధ్యాన్నం వరాలు తమకెద... చూసిందిగదా ఇద్దరినీనూ. అంతకు ముందు వరాలుకేగదా తాము టిక్కెట్లు బ్లాకులో అమ్మేరు?

బుర్ర గోంచుకున్నాడు వీరేశు.

"ఇట్టా ఎన్నిసార్లు ఇప్పటికి? ఆడేం యిసాడు నీకు బ్లాకుల అమ్మినందుకు?"

"ఏం ఇవ్వడు..."

వరాలు ఆశ్చర్యపోయింది.

"ఇవ్వడూ? ఏమీ"

తల తిప్పాడు అడ్డంగా.

"మరైతే ఎందుకా గాడిదచాకిరీ?"

"గాడిదకి బుద్ధుంటదేటి?" అన్నాడు.

వరాలుకి నవ్వొచ్చింది కాని, దాన్ని కోపంతో గట్టిగా మూత వేసింది. "నువ్వు తినే అలా ఆడికి ఉపకారం ఎందుకు సేసన్నావో, ఏంటో? ఏదో వున్నట్టుంది మీ ఇద్దరికీ లాలూచీ. ఏటది? సెప్పు? నానే గదా అడిగిందీ? మీ నారాయణ కాదు గదా?"

'కాదు. నాకిప్పుడు మీ రిద్దరూ మొగుళ్ళే'

అనందామనుకుని అనలేకపోయాడు.

వరాలెంత అడిగినా వీరేశు చెప్పలేదు.

కోపంవచ్చేసింది వరాలుకి. వీరేశునే అన్నం పెట్టుకోమని తను ముడుచుకు పడుకుంది.

"నువ్వన్నం తినవే" అన్నాడు వీరేశు.

"ఎందుకూ?"

"అదేటే? అన్నం ఎందుకేటే!"

"అవునెందుకూ?"నీవూసే నాకు అనవసరంగదా? నీ అన్నం మాత్రం ఎందుకూ!" అని, మళ్ళా ముడుచుకు పడుకుంది.

నవ్వుకున్నాడు వీరేశు. దాని మాట వింటే దాని మీద ప్రేమ సముద్రంలో కెరటంలా లేచింది. అంతా దానికి చెప్పేద్దా మనిపించింది. చెప్పేసి, గుండెని శుభ్రం చేసేసుకోవాలనిపించింది. కానీ, చెప్పేడానికిది ఎలాంటి సంగతి...?

వరాలు అనుమానం రెండింతలవుతుంది. వరాలు కోపం నాలుగింతలవుతుంది. వరాలప్పుడు...పార్వతీదేవల్లా కాళికాదేవి అయితీరుతుంది.

తనకింక ఒక్కపిసరు కుదురుండదు. సుఖంవుండదు. సంతోషం ఉండదు.

ఏం చేయడం?

అన్నం సయించలేదు. ఆకలేసున్నానూ ఒక్క ముద్దేతిన్నాడు. రెండో ముద్ద నీళ్ళలో కరిగిపోయింది.

కంచం, అవీ మూలకి నెట్టేసి లేచాడు. బీడీ వెలిగించాడు. గుండెలోకి పొగ దూరి వెచ్చచేసి, శమానంగా అనిపించింది.

రాత్రి గడుస్తోంది తనమానాన్నతను. ఎవరు తిండి తినినా, తినకపోయినా దానికి లెక్కలేదు. ఎవరు సుఖపడినా, కష్టంలోవున్నా దానికక్కర్లేదు..

దాని డ్యూటీ తెల్లవారిందాకానూ.

ఆతర్వాత వెలుగుకి లోకాన్నప్పచెప్పి వెళ్లిపోతుంది.

వీరేశు పక్క వేసుకు పడుకున్నాడు. నిద్దరావడంలేదు.

వరాల్ని చూశాడు. అది కదలడం లేదు. ముడుచుకునే వుందింకా. నిద్దరపోతోందా? నిజంగా! అనుమానం వచ్చింది. దగ్గరకెళ్ళి చూడాలనిపించింది. ఆ తలపుని కాస్సేపాపుకున్నాడు.

ఎంతోసేపు ఆపుకోలేకపోయాడు. నింపాదిగా లేచాడు. చప్పుడవకుండా, మెత్తగా అడుగులేస్తూ వరాలు దగ్గరకి వెళ్ళాడు. వరాలు శరీరం కదలడంలేదు. గుండెలు కదులుతున్నాయి వుచ్ఛ్వాస

నిశ్వాసాలతో. అయితే నిద్దేనన్నమాట! అలా చూశాడు.

జుత్తు కొంచెం చెదిరింది. పవిటపూ రిగా విడి నేలన పడుంది. జాకెట్టు తమని బంధించినందుకు రోషంతో బలంగా రొప్పుతున్నాయి దాని రొమ్ములు. పిక్కల దాకా లేచిన చీరె పిడికెడంత గుండెని ఎంతో పెంచి, వుద్రేకంతో నింపుతోంది.

వీరేశు కళ్లు కోరికతో నిండిపోయాయి. ఒంట్లో నెత్తురు వురుకూ పరుగూ పెడ్తోంటే దానిమీదకి వొంగాడు ... వొరిగాడు. చేతుల్లోకి ముఖాన్ని తీసుకుని పెదిమలతో పెదిమల్ని కలిపాడు. నిద్రలో వరాలు ఏదో అనుభూతిని పొందుతోన్నట్టు దాని పరిస్థితి చెప్పింది వీరేశుకి. వరాలు లేవలేదు. కళ్లు తెరవ లేదు. వీరేశు చుట్టూ చేతులేస్తోంటే కద ల్లేదు. మత్తుగా, మైకంగా, పరవశంగా అలా వుండిపోయింది! వీరేశు వరాలు మీద తను ఇంతకాలం నించీ పెంచుకుంటూ వస్తోన్న ప్రేమని, అనురాగాన్ని, కోరికని, వాంఛని కొద్ది సేపట్లో తృప్తితీరా తీర్చేసు కున్నాడు.

ఆరాటానికి పదేళ్లు పైన పట్టవచ్చు.

అనుభవానికి పది నిమిషాలు చాలు.

ఆఖరి వుద్రేకంలో వీరేశు చేసిన అల్లరి పనికి వరాలు నిద్రలోంచి మత్తు, మైకం, అనుభవం అన్నీ అంతా విడి, వదిలి...దిగ్గున లేచింది. వీడిన కళ్లకి వీరేశు!!

అప్పుడే పుట్టినట్టూ-యిద్దరూ!

ఏమీ లేని ఎదరుల్లుమంది. గబ గబా చీరె లాక్కుని లేచి చుట్టబెట్టుకుంది. "వీరేశా !" వరాలు గొంతు ఖంగుమని మోగలేదు. ఖణేల్మని రంకెయ్యలేదది. గొంతులో నిండిపోయిన ఆశ్చర్యం, కలవరపాటు, భయం, దుఃఖం అన్నీ స్వరాన్ని బలంగా నొక్కేసాయి.

"వీరేశా!" మెల్లిగా, జీరగా వచ్చింది మాట!

"ఏట్నువ్వు సేసింది? నువ్వీరేశు వేనా?"

"... ... ..."

"ఛా !! ఈరేశువనుకునే ఇన్నాళ్లు నీ యింట్లో వుంటన్నాను! నువ్వు నర్శిం హులి వనుకోలేదు. నాదే పొరబాటు. యిద్దరిదీ ఒకటే బుద్ది. జెంతు బుద్ధి"

బావురుమంది వరాలు.

వీరేశు కుంచించుకుపోయాడు.

"వీరేశా ! నేన్నిన్ను నీడిమ్మంటే నిప్పులా ఇస్తావు?''

కన్నీళ్లు జలజలా రాలుతూంటే అడిగింది వరాలు.

"తప్పయి పోయింది వరాలూ !" గొణిగాడు వీరేశు.

వరాలు, "నేను పోతాన్లే! తెల్లార్నీ! అందాకా మాత్రం ఇంకేం సెయ్యకు నన్ను! అయినా ఇంకేటి సేస్తావులే! చేసే దేటో చేసేసేవుగదా.." అంది ఏడుస్తూ.

వీరేశు తుళ్లిపడ్డాడు. వరాలు వెళ్ళి పోతుంది! ఎలా? ఎలా...? ఆగమంటే ఆగదింక! తనవల్లనే, తన్నించే వరాలు వెళ్లిపోతూంది!

బతిమాలేడు వీరేశు. వరాలు వినలేదు.

"నీకు రోషం నేదు! సిగ్గు నేదు! అవమానం నేదు! ఎలాంటి ఎదవపనైనా చేస్తావు!" అని తిట్టింది.

"నీలాంటోడి దగ్గరుంటే నాకు పాచి పన్లు పోతాయి. నిలవ నీడుండదు. నీ దవుర్భాగ్యం నీతోనే వుంచుకోక నాకూ పట్టించాలన్చుస్నావా?"





అవి పలుకులా ? పదునైన ములు కులుగాని ?

వీరేశు వరాలుని వెళ్లొద్దని ప్రాధేయ పడ్డాడు.

ఆఖరికి, లోపల్నుంచి ఒక వేట కత్తి తెచ్చాడు. అది వరాలుకిస్తూ, దాంతో తనని నరికేసి వెళ్లిపొమ్మన్నాడు. వేగిర పెట్టాడు. వరాలు వేట కత్తిని ఆ గదిలో మూలకి విసిరి వేసింది.




ఒకటి...రెండు...మూడు...నాలుగయి దారేడు రోజులు తిరిగిపోతున్నాయి.

పగలు ఎండే కాస్తోంది. రాత్రి వెన్నెలో, చీకటో పంచుకొంటూనే వున్నాయి. చెట్టూ చేమా ఎప్పుడో అప్పుడు గాలినింత ఒలకబోస్తోంది.

బడ్డీ అదే మొహం వేసుకునుంది.

జనం దాన్ని పనికిరాని పెళ్ళికూతుర్ని చూసినట్టూ చూసిపోతున్నారు. ఏవుంది? అందవా, చందవా? డబ్బా, చదువా? —అన్నట్టూ!

ఎప్పుడో ఎవరో ఓసారి మాత్రం!

"నువ్వొకత్తివున్నావూ?" అంటూ, సరసానికి దిగినట్టూ వచ్చి ఒక్కటే సిగ రెట్టూ (నయం! సగం అడగలేదింకానూ.), ఒక్కటే ఒక్క పొట్లం, ఒహటే సోడా, చాక్లెట్టూ అడుగుతున్నారు.

ఇలా ఎన్నాళ్ళు?

ఏం వొస్తుందిలా ? ఏం జరుగుబడి వుంటుంది?

బొత్తిగా డబ్బులకి మొహం వాచి పోతున్నాడీ మధ్య ! టీ తాగివచ్చి కూచుంటున్నాడు. భోజనం సరిగ్గా లేదు. బియ్యం, కూరానారా కొండానికి ఏం డబ్బుల్లేవు! కంచంకేసి తనూ, తనకేసి అదీ చూస్కోడం వెర్రి మొహాల్తో!

తను ఎవర్ని అడుగుతాడు డబ్బులు? వరాలునా? అది ఇవ్వదు. అడక్కుండా తీసుకున్న 'ఆ పెద్ద నేరానికి' అది చాలా పెద్దశిక్ష వేసేసింది. నిజవే. వరాల్లాంటి ఆడదాన్ని అడక్కుండా తను 'గొప్ప చోరీ' చేసేడు.

వరాలు వులకడం లేదు. పలకడంలేదు.

పాచిపనికెడ్తోంది. వస్తోంది.

ఎక్కడేం తింటోందో, మానుతోందో?

తనింట్లో ఆ వూసు లేదు.

వుంటే పడుకుంటుంది. పక్కఇంటి వాళ్ళతో ఏవో కబుర్లలోకి దిగుతుంది.

అలా సమయాన్ని గడిపేస్తోంది. తను పోవద్దన్నాడు గనకా,పోతే నరికేసి పొమ్మ న్నాడు గనకా, సరకడం యిష్టంలేకా, నరకంలో మాత్రం పడుండమని ఇలా బాధపెడ్తోంది వుండీ !

'స్సరే ! కానియ్యి' అనుకున్నాడు.

'దాని కోపం, మంటా, కసీ ఎన్నాళ్ళు రగులుద్దో రగల్నీ ! ఆరిపోయినప్పుడే రానియ్యి దగ్గరికి" అని ఒక తీర్మానాని కొచ్చేశాడు.

ఏ యింత ఆధరువు దొరికినా పొయ్యి కిందా మీదా తనే పడాల......!

ప్రాణం కటకటలాడి పోతున్నాది!

ఒకప్పుడు తను ఏదీ చెప్పకండానే, నారాయణే తన పరిస్థితిని కనిబెట్టేవాడు!

చేతనయినంత చేసేవాడు.

చేతనయ్యీ ఇప్పుడేం చేయడం లేదు నారాయణ.

తన సంగతెలీదూ? తన బడ్డీ ఎలా ఆరిపోతోందో చూడ్డంలేదూ? చూసీ కూడా 'ఎవరిదో' అన్నట్టూ వుంటున్నాడేం? ఎందుకు తనంటే నారాయణకంత 'ఎడం'?

ఏమీ బోధపడడం లేదు వీరేశుకి.

తనది అవసరం! నారాయణ దగ్గరికి వెళ్లాడు.

బాధంతా చెప్పుకున్నాడు. నారాయణ రెండు నిముషాలు మౌనంగా ఉండిపోయి అన్నాడు.

"చూస్తన్నాన్రా! అవునేం సేద్దారంటావ్?"

"ఏంటో నాకంతా అయోమయంగుంది. బడ్డీకి పోనీ అద్దేనా కట్టాలా? ఆ మాత్రవేనా రావాలా... ? కొనేవోళ్ళు లేక మురిగిపోతుంటే అరటిపళ్లు కొన్ని కాలవలో పారేసేను నిన్న! ఎవడూ దాని వంక సూడ్డంనేదు. నా ప్రాణం వుస్సూరుమనిపించినాదనుకో పళ్ళు పారేస్తే! ఇంక నానే తినాల బడ్డీలో సరుకులు. అలగే వుంది..."

"ఏటి సేద్దారంట-వ్?"

"చెప్పు! నాకది తెలవకే నీ కాడ కొచ్చేను...బడ్డీ లేపినోడివి నువ్వు. నాకు బడ్డీ అప్పగించి నోడివి నువ్వు. ఇంత వుపకారం చేసేవు. అది నాకు అపకారం అవకుండా ఓ కాపు కాయాల్సిన భారం గూడా నీదేగద్దా మరి?"

వీరేశు గొంతులో బాధ, విచారం, ఆందోళన, ఆశోకం సుళ్ళుతిరిగాయి. నారాయణ దేవుడయ్యాడు తనకి. వరాలు ఇచ్చేడు. అవి బెడిసి కొడుతున్నాయి తనకి. అంచేత వాటిని మళ్ళా ఆ దేవుడే చక్కదిద్దాల...సరిజెయ్యాల.

నారాయణ చేత్తో వీరేశు భుజాన్ని తట్టాడు.

"నేనదే ఆలోచిస్తన్నాన్రా! ఇంత చేసేనా? ఏదో నువ్వు బాగుపడతావనే గదా! నీకు మరి నాలుగు డబ్బులు వొస్తాయి అనీ, నీ తరువాత రోజులు సుకంగా ఎల్తాయనేగదా అంత కష్టవూ పడ్డాను"

"అవును..."

"మరి చుక్కెదురైతే ఏం సేస్తాంరా? ఇలా అవుతాదని ఎవురనుకుంటాంరా? ఆ ఎదర బడ్డీ దొంగనాయాలకి పావు కరుస్తాదనీ, మన బడ్డీచూసి ఆడికి విషం ఎక్కిపోతాదనీ మనకేం తెలుసాది? ఒక్కసారికొక్కసారెంతగా పెంచీసేడూ ఆడి బడ్డీని?! ఇంతకాలవూ ఆ తెలివేవైపోనాదాడికీ? ఆఁ....?"

వీరేశు నిట్టూర్చడం మినహా ఏవంటాడు?

"చూడు. ఇప్పుడాడింత పెంచేడంటే అదేటంటావు? మన బడ్డీమీద చావుదెబ్బ కొట్టడవే గదా?"

"అదే..."

"దానికి ఇరుగుడుంది. కాని అది చాలా డబ్బుతో మాటొరే ఈఁరేశా! చాలా డబ్బుతోపని"

"అవును!"

"నాకంతా తెల్సురా!కానేటి సెయ్యన్రా! అంతమట్టుకే. అప్పుడెంత యాతనపడ్డానో చూసేవు గదా?"

నారాయణ చాలా బాధపడుతున్నాడని వీరేశు ఇంకేం పలకలేకపోయాడు.

"నేన్నీకుపకారం చేసినా, ఎంత కష్టపడినా దానికి ప్రయోజనం లేక




పోయింది. ఫలితం ఇలా ఉన్నాది. ఇంతకీ అదృష్టం ఉండాల్ల. దేనికయినా అదుం డాల. అదుంటే మట్టి పట్టుకుంటే బంగారం అయిపోతాది – లేకపోతే ఆ బంగారవే మట్టయిపోతాది..."

వీరేశు విచారిస్తూ కూచున్నాడు.

"నీఖర్మ అలా ఉంది. నేనేం చెయ్యనూ? నీళ్ళుమోసుకునీ, కష్టపడ తన్నావనీ, కూడూ-గూడూ సరిగ్గాలేవనీ ఏర్పాటుచేసేను. చేసినా నీ బతుకిలాగే ఉన్నాదాయె. నీ దవుర్భాగ్యం నిన్ను వొదలనప్పుడు ఎవరెంతజేస్తేమట్టుకూ ఏం లాభం?"

నారాయణ భార్య కాఫీ ఇచ్చింది. కాఫీ నోటికి రుచిగా ఉన్నా, గొంతు దిగడం కష్టమయింది. అప్పటికే నారాయణ మాటల్ని మింగీ, మింగీ గొంతు పూడు కుంది.

లేచాడు. అక్కడెందుకింక?

నారాయణ అదివరకు తనదగ్గర పైసాల్లేనప్పుడు ఇచ్చి ఆదుకునేవోడు. ఇప్పుడా వూసేలేదు.

"ఎల్తాను..."

"వూఁ..."

'ఇదీ తన దవుర్భాగ్యవే'అనుకున్నాడు వచ్చేస్తూ.

ప్రారబ్ధం బాగోలేకపోతే నాలుగు చేతుల నారాయణమూర్తి కూడా తొంటి చెయ్యే చూపిస్తాడు– ప్చ్!

ఆర్రాత్రి కడుపులో కాళ్ళుపెట్టుకుని పడుకున్నాడు వీరేశు. ఆకలి ఆశి రెమ్మలా పీడిస్తోంది. అయినా సరే... నోరు మెదపలేదు.

"వరాలూ!"

పిలిచాడు వీరేశు వుదయం.

మొదట పలకలేదు. మళ్ళాపిల్చాడు. కళ్లు తిప్పింది. మళ్లా పిలిచాడు. వొళ్లు తిప్పింది. 'ఏటి?' అన్నట్టు చూసింది.

"నీకాడ..."

"ఏటి నాకాడ? పొగాక్కాడా?"

గుటక మింగాడు. "ఆకలేస్తాదే! శానా ఆకలేస్తాంది"

"అయితే ? నానేం చేస్తానూ? వొండి పెట్టాలా ?"

"అదికాదే, నీకాడ డబ్బు లేవయి నానూ..."

"నేవు"

"సేవా?"

"వున్నాయని సెప్పేనా యిప్పుడు?"

"ఎట్టాగే? కడుపు మండిపోతావుందే! పైసానేదు బడ్డీ పడుకుంది. నా ఖర మంతా ఒక్కలాగుంది!" చేత్తో నెత్తి మొత్తుకున్నాడు.

"మీ నారాయణ నడగలేదేటి?"

"ఎళ్లేనే! అంతా వినీ ఏం ఇవ్వనేదు. నీ కరమ పొమ్మన్నాడు."

వరాలు వీరేశుని కిందా మీ దా చూసింది.

ఆకలి, నీరసం, పరిస్థితుల ప్రభావం వీరేశుని బాగా యిగిర్చేసేయి. కళ్ళు లోతుకు పోయున్నాయి. మెడ దగ్గర నరాలు తేలి వున్నాయి. నాగులు ఎదలో కదిలాడు వరాలుకి. బలవంతాన బిగ పట్టింది ఏదో...!

"నీబడ్డీ కెవుడూ రావడం నేదుగదా! వున్నవేవో కడుపులో వేసేస్కో! అంత కంటే ఏం చేసావు?"

'ఇదా నీ సలహా యింతా వినీ?' అనుకున్నాడు వీరేశు బాధగా. "అయితే ఏట్నేదా నీకాడా? సూడే!" బతిమాలు కున్నాడు. ఆ కళ్ళల్లో నిలిచిన నీళ్లు...

కడుపుని దేవినట్టయింది వరాలుకి. 'యిద్దామా, యిద్దామా?' అని మనసు గొణిగింది. 'ఎందుకే, ఎందుకే? ఇంక వాడికేమీ యివ్వకు. యిచ్చింది చాలు' అని గుండె సతాయించింది.

కళ్లకప్పని నిజం గుండెని కసిరి నోర్మూసుకోమంది. వరాలు లేచి, తను ఆ గదిలో మూల చిన్న చెక్కపెట్టె లోపల దాచుకున్న రూపాయి నోట్లు రెండు తీసింది.

"ఇందా! యియ్యంచు!"

రెండు రూపాయలు!

బడ్డీ మీద చకచకా బేరాలు జరిగిపోయి, ఆ రెండు రూపాయలు చేతిలోకి వచ్చినట్టనిపించింది వీరేశుకి. కాదు వరాలిచ్చింది రెండ్రూపాయల్ని - రెండు వరాల్ని!

"నీకో, అంతా నాకిచ్చేస్తే నూ?" అన్నాడు.

వరాలు ఎటోచూస్తూ "నాకా ? నాకేం పర్వానేదు. నేను పనిచేస్తున్నకాడ ఏ అమ్మయినా నాకింత ముద్ద పడేస్తాది...'' అంది. వీరేశు తను అర్జెంటుగా ఆకలి తీర్చుకుందికి హోటలుకి పరిగెత్తాడు. ఏదో ఇంత టిఫినూ, టీ వేసుకున్నాడు. మిగినడబ్బుల్లో కాస్త

బియ్యం కొని తెచ్చాడు.

'వరాలూ! అప్పుడు నారాయణాదు కున్నాడు నన్ను. ఇక ం నువ్వాదు కున్నావు' అనుకున్నా వీరేశు.

* * *

"వరాలూ!"

"ఎందుకూ?"

"మాట..."

"మాటా? మనకేంమాటలూ? అవస రంపడితే అడిగో, అడక్కుండానో పుచ్చు కొంటన్నాపుగదా? అయ్యిసాలక మాట లెందుకింకానూ?"

వీరేశు కొంచెం సిగ్గుపడ్డాడు. మరి కొంచెం బాధపడ్డాడు. ఇంకొంచెం విసుక్కున్నాడు.

"అబ్బబ్బా! ఏటిది వరాలూ...మాట లెందుకంటూనే ఆడిన నాలుగు మాటల్లో కొట్టిన రెండు దెబ్బలూ చాలే"

"సాలుగదా, మరి వూరుకో!"

"అదిగాదే! నువ్వు పోలీస్టేషన్కి, కోరుటుకీ ఎల్లేవంటా?"

"ఎల్లేను. అయితే ఏం?"

"అదిగాదే స్టేషన్కి ఎందుకెల్లేవనీ? తెలవక అడుగుతున్నా!"

"ఆత్రంగుందా? బ్లాకు టిక్కట్లమ్మ డానికెల్లాలే"

వీరేశు వులిక్కిపడ్డాడు. గుటక మింగాడు.

వరాలు చూసింది. నవ్వుకుంది.

"పోలీస్టేషనికి ఎందుకు వెడతానూ? పోలీసులు పదమంటే ఎల్లాను. నర్సిం హులు పెళ్ళాన్నితోసి, చంపేసినప్పుడు ఎందుకు దాన్నలా చంపీనాడో కారణం వివరంగా చెప్పమంటే చెప్పేను!"

"ఏం చెప్పేవ్?"

"నర్సింహులు నన్ను చెరచడానికి బలవంతం పెడుతూంటే వాడి పెళ్ళాం వచ్చి అడ్డుకుందని, నర్సింహులు బాగా నిషా ఎక్కివున్నాడేమో ఎంటనే దాన్నో తోపు బలంగా తోసేసినాడని, అదా యింతాపడి చచ్చూరుకుందని చెప్పేను. నర్సింహులి పిల్లలు పోలీసుల్తో తమ తల్లిని తండ్రి చంపేసేడని చెప్పేసి పట్టిచ్చేస్తే, ఆళ్ళ తీగెలాగి, డొంక కదిలించి, అప్పుడే పరిస్థితిలో అలా వాడు చేసేడో, అందు క్కారణం ఎవరో కెలికి నన్ను లాగేరు. ఇంక ఒకటే నస నస. ఆడెందుకు నిన్ను చెరచబోయేడు? ఆడికి నివ్వేం అవుతావు? అసలాడింట్లో వెందుకున్నావు? ఆడింటి కెలావొచ్చినావు..? కిందేసి, మీదేసి, ఇటు తిప్పి, అటుతిప్పి.. మడిసిని మూడు వేల ముక్కలు చేసినట్టు ముక్క ముక్కలెచ్చె య్యడం పోలీసులికి తెల్సినంతెవరికీ తెల్దు! అన్నట్టు కోర్టోళ్ళకినూ! ఆళ్ళిద్దరూ పోలీసూ, వాకీలూ రావుడి కాలంలో మారీచుడూ,సుబాహుడూ అయుండొచ్చు. లేకపోతే - యిష్ణుమూర్తిని అన్ని అవ తారాల్లో యాతనెట్టిన రాక్షసులేనా అయుంటొచ్చు!"

అని, ఆగి వూపిరి పీల్చుకుంది వరాలు.

"అది నొాదుల్తారంటా?"

"సాచ్చీకం బలంగుంటే వొదుల్తారు"

"వుందా?"

"ఏవో?!"

"నివ్వేం జెప్పేవ్?"

"బడ్డీ వొదిలేసి పోలీసుజ్జోగంలో దూర్నావేటి? అలా అడుగుతున్నావు?"

వీరేశు నవ్వేసి, "ఎహే చెప్పే కోపం అయిపోక. నీసాచ్చీకంబట్టీ అడు! బొక్క

ఉండిపోడవూ, ఇవతలికి రాడవూ వుంటాది గదే!"

వరాలు "వూ౦..." అని నిట్టూర్చింది పొడుగ్గా.

"నర్సింహులి పిల్లల్చెప్పింది తిన్నగా నేదు. ఆళ్ళాడిని బొక్కలో తొయ్యా లనుకునీ, ఇవతలికి లాగినట్టూ చెప్పేరు! తమ తల్లిని తోసి చంపేసేడన్నారు. ఆ ఒక్క ముక్కతో వూరుకుందికి పోలీసులు ఎర్రోళ్ళా? ఓ సారి! నన్ను లాగినారుగదా? నా వల్లనే పెళ్ళాన్నాడు తోసేసేడుగినకా, చంపాలని చంపనేదనీ, అది అడ్డంవొచ్చింది గనక తోసేస్తే అదెళ్ళి పడిపోనాదనీ, కానూపిరినుంది కాబట్టి ఆయింతాచచ్చిందనీ రాసుకున్నారు కాయితాల మీదన.

''దాన్నిబట్టి నర్సిమ్ములు దాన్ని సంపసేదని శానామట్టుకి రుజువయిపోనాది గదా? కేసు నా మీదికి తిరిగింది. ఆడెలాగూ వొచ్చేస్తాడు బెటికి. నన్ను అలా సంపే స్తాడు రాగానే"

''నువ్వింకోలాగ సాచ్చీకం చెప్పేస్తే నర్సిమ్ములుగాడింక బైటికిరానేడుగదే?"

"ఎలాగా?"

''ఎలాఏవిటి? ఆడు కావాలనీ, సంపా లనే పెళ్ళాన్ని బలంగా తోసేసేడనీ, దాంతో అది సచ్చూరుకుందనీ, దాన్ని సంపేస్తే నిన్నాడు పెళ్ళాడొచ్చన్న ప్లానుమీదున్నాడనీ, అందికే నీమీద కుతి ఆపుకోనేకా తాగొచ్చి బలవంతం చేసేడనీ..."

వరాలు వింది జాగ్రత్తగా.

''ఆళ్ళు నా బుర్ర పాడు పాడు సేసేరు? ఏటడిగితే దానికే జవాబియ్యా లంట. ఆళ్ళకి జవాబులేగానీ మన ఆలోచన్లు ముఖ్యంకాదు"

''ఈపాలి పిలిస్తే అదేసెప్పు. ఆ తర్వాతేటయితే అదవుద్ది"

"అలగే...''

''వరాలూ! ఆడు బైటికివస్తే నీకు బయ్యేవే గదూ?''

వరాలు వుస్సుమని నిట్టూర్చింది.

''ఏం బయ్యెం? ఆడది చెడ్డోడికే గాదు మంచోడికికూడా బయపడాలనీ, అసలు మగాడికే బయపడాలనీ నివ్వు చెప్పక చెప్పేవుగదా?"

గతుక్కుమన్నాడు వీరేశు.

సందు దొరికితేసాలు ఏస్తోందిది పదునైన బాణం.

నిజం నోరుమూస్తే, తప్పుకున్నా డక్కడినించి.




నర్సింహులు కాకపోతే వాడి మొగుడింకోడు.

వచ్చి పలకరించాడు ఆ మధ్యాన్నం.

అప్పుడు కొట్లోలేడు వీరేశు. కొంపలో ఉన్నాడు. వరాలు కూడా ఉంది. "వండి పెట్టకూడదా?'' అనడిగేడు దాన్ని ఆకలేస్తోంటే.

"అలా అడక్కు"

"ఏం?''

"నమ్మి ఇంటజేరిన ఆడదాన్ని ఏం చేసేవు? వొండి పెట్టేదాన్నిగా చేసు

కున్నావా ? సానిముండలాగా చూసుకున్నావా నివ్వు ?''

''వరాలూ!''

"ఎందుకంత గొంతూ? నామాట తప్పొచ్చిందేం నీ చేతకంటే?"

"ఆ సమానం ఆవూసెత్తి కుళ్ళ బొడవకు వరాలూ! నిజెంగా చెప్తన్నాను. భూమ్మీ కొట్టేసి చెప్తన్నాను. ఆకాశంమీద ఆనేసి చెప్తన్నాను''

"ఒల్లకో, ఒల్లకో! భూవీ, ఆకాశం అయ్యేవీ నన్నిప్పుడు కన్నె పిల్లన్నెయ్యవు. పోయిందాన్ని లాక్కురావు. నా కడుపుల గుడ్డుని పెరగనీకండా సెయ్యవు''

''వరాలూ...సిజెవా?''

వీరేశు ఆశ్చర్యంతో కిందుమీదయ్యేడు.

దగ్గరగా వెళ్ళాడు.

దూరంగా వెళ్ళింది వరాలు.

"నాదితప్పని ఒప్పుకున్నాగదే! కావాలన్నెయ్యనేదే. అప్పుడేటో... అలా జరిగిపోయిందే! ఆ తరవాతెంత విచారించేనో? స్సి...జెంతువయిపోనానని ఎంత తిట్టుకున్నానో ? వరాలూ నన్ను తిట్టిందంతా ఇంకచాలే! మనకు బాబో, పాపో సెప్పవే. అది ఇన్నదాకా నీ ఇష్ట మొచ్చినట్లు తిట్టవే"

ఆమాటతో వరాలు ఆవేశం దిగిపోయింది.

మన బాబో పాపో...!

"వరాలూ! నీ కసితీరకపోతే ఎవరూ చూడకండా నన్ను సావగొట్టు. అంతేగానీ..."

వరాలు వీరేశని చూస్తోంది. కడుపులో ఆకలి. కళ్ళల్లో పశ్చాత్తాపం.

మౌనంగా వెళ్ళింది పొయ్యిదగ్గిరికి.

బియ్యం కడిగి, పొయ్యిమీదికి నీళ్ళ తప్పేలాతో ఎక్కించింది. కింద మంట రాజుకుంది.

తలుపు చప్పుడైంది. "ఎవరూ?" అని వెళ్ళి తలుపు తీసేడు వీరేశు.

గంగులు!

తుళ్ళిపడ్డాడు వీరేశు.

మనిషి ప్రతివాడూ తలుపు తీసే సమయాలు, సందర్భాలుంటాయి...... కొట్టినవాడు తెలిస్తే, తీసే అనుభూతి వేరు! స్నేహితుడైతే సంతోషం–చుట్టం అయితే సాన్నిహిత్యంలో, రక్తసంబంధంలో ఆప్యాయతా–భార్య అయితే ఉల్లాసం–అప్పులాడయితే బెంగా, భయం–యములాడైతే...??

యములాడు ఒక్కసారే లాక్కుపోతాడు.

ఈడు...??

వీరేశు అటుచూస్తున్నాడు. వాడి పక్కన ఎద్దులేదు. సైకిలుంది. వాడి చేతిలో పాశంలేదు. చిన్న పుస్తకం ఉంది! బ్రాకెట్లు రాసుకునేదది!

నవ్వేడు గంగులు.

లోపల్లోపలే ఏడ్చుకున్నాడు వీరేశు.

"పదరా ఈరేశా! పనిబడింది..."

"వొదలవేటి?"

"సిరాగ్గుందేట్రా?"

"ఎన్ని మార్లిట్రా!"

"లెక్కకావాలేట్రా? నా ఇష్టం వొచ్చినన్నిసార్లురా. పదా."

"నేన్రాను"

"ఏం?"

"రాను. రానంతే."

"ఏట్రారే! అలా బిగుసుకుపోతన్నావేంటిడు?"

వీరేశుకి కోపంగవుంది. తిక్కగా వుంది. ఈణ్ణికూడా జెయిల్లోఎట్టెయ్యాలి. బ్లాకుల ఎంత గడిస్తాడో? కానదంతా





తాగుళ్ళకీ, ముండలకీ సరి.

"ఎవురదీ ?" వరాలు వీధి ద్వారం దగ్గరికి వెళ్ళి చూసింది గంగుల్ని.

గంగులు వరాల్ని చూశాడు.

"ఇక్కడున్నావేటి కోడలా ?" అడిగాడు.

మాట్లాడలేదు వరాలు. మంటగా ఉంది వాడిని చూసే.

"చూడు! నా కొడుకు రానంటన్నాడు. నివ్వు చెప్పి పమ్మించు. తొరగానూ"

"ఏడకి రాడం?"

"పనుంది..."

"ఏటా ముంచుకొచ్చిన పని ?"

"ముంచుకొస్తేనే ఒస్తానే ఓలమ్మా కోడలా ! ఈరేశు కావాల్నాకు. మళ్ళా పంపించేస్తాన్లే. ఈ దేట యి పో డు. అవునింతకీ ఈడింట్లో ఉన్నావే... ? సుట్టాలా మీరిద్దరూనూ?"

"కాదు"

"మరీ?"

"నీకెందుకులే" వరాలు కయ్యిమని రివ్వున ఇంట్లోకొచ్చేసింది. పొయ్యికింద మంట రగులోంది. గిన్నెలో అన్నం వుడుకుతోంది.

గంగులు వీరేశుని బలవంత పెడుతున్నాడు.

"నాకాకలిగుంది. రాను..."

"భోంచెయ్యనేదా?"

"నేదు...నువ్వుపో"

"ఏంటీ పొమ్మంటావా ? వరాలూ ! ఇల్లా. చూడీరేశాని. ఈ దొంగనా కొడుకు అన్ని ఎధవపన్లు చెయ్యడానికీ రెడీ. టిక్కట్లమ్మడానికి మాత్రం నామోషీ"

"ఎహె పూర్కో"

"నువ్వొస్తేగానీ నా నోరూర్కోదు!"

'నీయమ్మా' తిట్టుకున్నాడు వీరేశు వరాలు వచ్చి నిలబడింది. "ఆడు రాడు!" తెగేసి చెప్పింది.

"ఆడే వొస్తాడు! నా కాదు బాకీ! ఎవుడికోసం రాకా?"

"బాకీయా?"

"అవును కోడలా! కొంత దీర్చేసేడు. ఇంకొంత దీర్చాల!"

"నిజమా ఈరేశూ! వెందుకు బాకీ పడ్డావూ?"

వీరేశు తడుముకున్నాడు మాటకోసం.

"బడ్డీకా?"

గంగులు నవ్వేడు.

"బడ్డీకయితే ఇలా ఎందుకు ఏడుస్తాదా బడ్డీ? ఇలాసాలకీ, ఇనోదాలకీనూ. మరేటనుకున్నావు మనోడంటేనూ? మా గొప్ప రసికుళ్లే!"

వీరేశు గంగుల్ని చూశాడు. అవి కళ్ళు....

ఒకటి ప్రాధేయత. ఒకటి విధేయత.

గంగులు పోల్చాడు. ఇంక నోటికి తాళం వేసేద్దామనుకున్నాడు. కానయితే మాట జారిపోయిందే!

వరాలు వీరేశుని కిందా మీదా చూసింది.

"ఏటి చేసేడు? చెప్పు, ఫరవాలేదు."

"ఎందుకులే? వొద్దు! బేగా అన్నం తినీ ఈరేశా! కూకుంటాన్లే. తినీసిరా. పోదాం"

వరాలు ఆ ఇద్దర్నీ కొంచెం అవతలికి వెళ్ళమంది. అంతే! వెళ్ళగానే తలుపు వేసేసి, గెడ పెట్టేసింది. కిటికీలోంచి వీరేశు చొక్కా ఇచ్చేసింది.

"పొండిద్దరూ. తోడుదొంగలు! మీ లాలూచీలు మీకాడనే ఉండనీండి. మీ

ాంటి మడుసులికి ఇల్లెందుకు? వాకిలెందుకు? పెళ్లాం ఎందుకు? పిల్లలెందుకు? ఓటళ్ళు, సినిమాహాళ్లూ, బజార్లూ, కంపినీలూసాలవా?"

'ఎండదనరెక్కువా? వరాలు కోపం ఎక్కువా?' అనిపించింది వీరేశుకు.

* * *

సరిగ్గా రెండు రోజులయింది

వీరేశు గంగులుతో వెళ్ళి రెండు రోజులయింది. రెండు పగళ్లు, రాత్రుళ్లూ. సూర్యుడు ఆకాశంలోకి వస్తున్నాడు. చంద్రుడూ వస్తున్నాడు. చుక్కలొస్తున్నాయి. ఎండా, గాలీ వస్తున్నాయి. వీరేశు రాలేదింటికి. నిమిషాలూ, గంటల కంటే రోజుకి ప్రాముఖ్యం ఎక్కువ. అది సుదీర్ఘ కాలం!

వీరేశు రాలేదే...అతగాడేమయ్యేడని ఎవరు ఎదురు చూస్తారు?

ఎండలో కాలుతూ తలుపులు మూసుకుని, తన యజమాని కోసం ధ్యానం చేస్తోంది బడ్డీ. దాని అవసరం ఎవరికున్నాది గనక దాని వేపు చూడ్డానికి? అది తెరవని లోటుకి విచారించడానికి?

దానికి జన్మయిచ్చిన నారాయణే దాన్ని వదిలివేశాడు. వీరేశుతో దానికి పుస్తె కట్టించాక, తన బాధ్యత తీరిపోయినట్టు వూరుకున్నాడు. కాపురం బాగో లేదని తెలిసీ విచారించి వాళ్ళ ఖర్మానికి వదిలేశాడు.

ఈ రెండు రోజుల్లోనూ నారాయణ కొడుకు ఆ బడ్డీ పక్కనించి వెడుతూ చూసి, బడ్డీ కట్టేసి వున్నాదని నారాయణకి చెబితే, అతను ఆశ్చర్యపోకుండా ఆలోచించి వూరుకున్నాడు. ఆ తరవాత కొడుకుని దగ్గరికి పిలిచి చాలా సేపు ఏదేదో మాట్లాడేడు.

వరాలుకి వీరేశుమీద వచ్చిన కోపం కొన్ని గంటలసేపు మండింది. కాని గంటలసేపే! ఆ తరవాత కోపం స్థానంలో ఆశ్చర్యం వచ్చి చేరింది. తనెంత దెబ్బలాడినా ఇదివరకు ఇంటికి వచ్చేసేవోడే ఈరేశు!? మాటల్లేకపోయినా ఓమూల తొంగొనేవాడే! మాట కలవకపోయినా-మనసులు ఎడం అయినా గదిమాత్రం కలిపింది ఇద్దరినీ!

తనింటికి తను రాక ఎక్కడ ఉంటాడు? ఎటు పోతాడు రెండ్రోజులు? వరాలుక్కోపం వచ్చిందని జడుపా? వరాలుమీద కోపం వచ్చి అలకా...?

గంగులుగాడెంట లాక్కుపోయేడంటే అది అవసరం అయిందాకా ఉపయోగించుకుంటాడు. ఆ తరవాత పొమ్మంటాడు. ఆ తరవాత ఈరేశు ఎటు పోయేడో?

వంట వండమన్నాడు ఈరేశు. ఎసరెక్కించింది. అన్నం ఉడకలేదు. తనని ఉడికించి లాక్కుపోయేడాడీరేశుని. అది జిమ్మడా! అయినా ఈరేశుకేం బుద్దదీ? తనకే సోమతుండనీ ఇలాసాలకి ఎళ్లాడు? స్స్! ఎదవబుద్ధి... మగబుద్ధి!! ఆడది మొగాణ్ని నూరుపైసలా నమ్ముతాది! నూటికి నూరుపైసలా. ఆడుమాత్రం పావలా లోపునే!

ఏం ఎదవ పనులు చేసినాడో గంగులుకి తెలిసి??

లేకపోతే అడంత నిగడదన్ని కూస్తాడా? ఈడంత వొంగి సలాం చేస్తాడా ఆడికి?

తను ఈ కొంపకి సేరింది ఆ నర్నిమ్మలు సచ్చినోడికి జడిసి! పులికి జడిసొచ్చి పిల్లివాతే పడిపోనాదదేంఖరమ!

అయినా ఎన్ని తిట్టుకున్నా, ఎంత ఎనక్కి తోసినా ముందుకి తోసుకొచ్చే దాడిదానవే!!

ఈ నిజానికి, ఈ బరువుకి, ఈ డి కేనా ఆడికి తనప్పగింతవకుండనే

మనసు వీరేశు తలపుల్లో, కళ్ళు ఎదురు చూపుల్తో ఈ రెండ్రోజులు గడిపింది వరాలు.

రాత్రి ఒంటరిగా పడుకుందుకి భయపడింది.

అప్పుడంతా నాన్న తోడున్నాడు.

ఆ తరవాత నర్సిమ్మలింట.

ఇప్పుడు ఈరేశుతో

పక్కలో ఆడు పడుకుందికి భయపడ్డది గాని పక్కనే ఉన్నాడని ధైర్యిపడ్డది.

'తోడు'లో దొరికే నిబ్బరం, ధిలాసా, కుదురూ, తాపీ ఏ గొప్ప అనుభవానికీ తీసిపోవు.

గదంతా గుడ్డిలాంతరు వెలుగులో, నిశ్శబ్దం చేసే గుండె చప్పుడుతో, అప్పుడప్పుడూ ఏ ఎలకో పాకిన శబ్దంతో దిగు దిగుమని వుంది. ఎలక చప్పుడుకి ఎవడో దొంగెధవ అనే భయం గుండెని గుబులు మనిపిస్తోంది. ఇంట్లో దూరి డబ్బులూ, వొస్తువులూ ఎత్తుకుపోయే దొంగెధవకీ జడిస్నావాలి. ఒంట్లో దూరి మానాన్నెత్తుకుపోయే దొంగెధవకీజడిస్నావాలి. ఆడెవడేనా కావొచ్చు. నర్సిమ్మతే కావొచ్చు. తన పరిస్థితిని కనిపెట్టిన గంగుల్నాకొడుకేనా కావొచ్చు! ఏవో! ఏటి సెప్పగల్దు?

పిడికిట్లో ప్రాణం పెట్టుకుని పడుకుంది వరాలు.

ఒంటరితనం...ఒచ్చేస్తే బావుణ్ను ఈరేశని కోరుకుంటోంది. కడుపులో కదిలినట్టయిండేదో. వులిక్కిపడింది. అదీ ఆడిగురించేనా ఆరాటపడ్డం?

తలుపు చప్పుడయింది !

గుండె గుభిల్లుమందొక్కసారి.

మొదట భయం, వణుకు — దొంగనాకొడుకేవోనని!

తరవాత సంతోషం, కుదురూ—ఈరేశేవోనని!

రెండింటి కలగలుపూను !

తీద్దునా, మానుదునా ? తీద్దునా, మానుదునా? ఏటిసెయ్యడ విప్పుడేటి సెయ్యడవెలా? ఎలా ? భగమంతుడా ఎలా? అన్ని కొండలదేవుళ్ళకీ ఎన్నో దండాలు పెట్టుకుంది వరాలు. ఒకడు కాకపోతే ఒకదేవుడేనా ఆదుకోడా...? ఆదుకోకపోతే అవతారం ఎత్తుతాడంతే. ఇంకోటి ... మరంతే! ఒళ్ళు మా సెడ్డ సిరాగ్గుంది తనకి. ఇలాంటి దవుర్భాగ్యెం ఏ ఆడకూతురికీ – సవితున్నా దానికూ్కడా రాకూడదని కోరుకుంది.

ఆలోచనలు ఆగడంలేదు.

తలుపు చప్పుడు ఆగలేదు.

లేచిందేమయితే అదే అవనియ్యి! అనుకుంటూ. చీరె సర్దుకుని తలుపు దగ్గరికి నడిచింది.

"ఎవురూ?"

చప్పుడు.

"ఎవురంటే?"

చప్పుడే!

వోలమ్మో! జవాబియ్యడేం ? అయితే ఎవడో మాయదారి సచ్చినాడేనంటావా..? ఈడికన్ను ఈ తలుపుమీద పడిందేటి. దేవుడా!సచ్చిపోనాన్రా!అయ్యో పలకడేటి!

"ఇదిగో! ఎవురో సెబితేనే తీస్తానంతే. తొలుత నీపేరు సెప్పు. ఆనక నా పేరు

సెప్పు. లేకపోతే నువ్వు సచ్చినా నా నియ్యనంతే! తెల్లారీ నిన్నెవురో మోసే సేదాకా తియ్యనలుపు!"

దడదడదడమంది తలుపు!

"తియ్యవే బేగా. నేన్నారాయణ్ణే!"

"నివ్వా!"

'నారాయణమూర్తీ,తండ్రీ కాపాడేవా!' అనుకుని తలుపు గెడ తీసింది వరాలు. అవతల చీకట్లోంచి నారాయణ ఒక్కడే లోపలికి రాలేదు! వీరేశని దాదాపు మోసు కొచ్చినట్టే...భుజాల చుట్టూ, నడుము చుట్టూ చేతులు చుట్టి తెచ్చాడు లోపలికి. వీరేశ కళ్ల అరమూతలు పడివున్నాయి. జుత్తు చిందరవందరగ దుమ్ముకొట్టు కొనుంది. ముఖంలో నీరసం, ఆరాటం, ఆందోళనా, బాధా తాండవిస్తున్నాయి. బట్టలనిండా దుమ్మే!

అవతల రిషా వుంది. రిషావాడు కేకేస్తే వెళ్ళి వాడిని పంపించాడు నారాయణ.

"ఇదిగో నీ మొనగాడు. వూరంట తిరుగుతూ నాకు ఎక్కడవుబించేడో తెల్సా? బీచ్ రోడ్డుకాడ! అక్కడ పడి వున్నాడు. నేనేమో పసుండి స్నేహితుల్తో ఆటుకాసీ వెళ్ళొస్తున్నాను... రాత్రి టైములో ఎవర్రా ఇక్కడ ఇలా పడి వుందనిచూస్తే ... ఈడూ! ఒంటిమీద

తెలివిలేదు. ఇసికా, మట్టీ చూడెలా దుమ్ము ...ుకునున్నాడో ? అప్పుడేం చేసాం ? ... మాట్లాడి, అందులో ఈణ్ణేసి తీసుకువొచ్చేను!"

అని వూపిరిపీల్చుకున్నాడు నారాయణ.

"అవునింతకీ ఏటయిందీడిదికెందుకలా అక్కడికి పోయేడు ? ఇద్దరికీ దెబ్బ లాటొచ్చిందా?"

"అదేంకాదు" అంటూ గంగులు గురించి చెప్పింది వరాలు. గంగులు వీరేశు బలహీనత ఏదో కనిబెట్టి, దానిమీద వాడిని నొక్కుతూ, అస్తమానం వొచ్చి వీరేశుని లాక్కుపోయి బ్లాకు టిక్కెట్లు అమ్మించి ఆ డబ్బంతా తనే తీసుకుంటు న్నాడనీ, మొన్నలాగే వచ్చి లాక్కుపోయేడనీ, వీరేశు బాగా చికాకయిపోయే డనీ, అప్పట్నించే అలా తిరిగీ తిరిగీ అక్కడెక్కడో పడిపోయేడేవోనంటూ చెప్పింది వరాలు.

నారాయణ రెప్పలు వాల్చక విన్నా డంతాను.

''అలాగా?'' అన్నాడు నిట్టూర్చి.

"కదల్నియ్యక ఎక్కడికీను. మళ్ళా గంగులొస్తే నివ్వే రేవెట్టి!" అంటూ, వరాలు వీరేశుని పక్కమీద పడుకో బెట్టితే, వాడి దగ్గరగాపోయి. తదేకంగా నిమిషంచూసి "హుఁ!" అని, "ఎళ్తాను'' అన్నాడు. అప్పుడు వీరేశుని చూసిన నారాయణ మొహంలో కనిపించిన భావం వరాల్ని చకితురాలిని చేసింది. అది ఆశ్చర్యంకాదు. విచారమూకాదు. జాలి అంతకంటే కాదు.

తండ్రిని బతికించమని తను ఆఖరు సారి డాక్టరుని అడిగితే అప్పుడాయన నాగుల్ని చూసిన చూపది.

నారాయణ వెళ్ళిపోయాడు.

వరాలు తలుపు గెడవేసి వచ్చింది.

"నీ స్తోమతెంతా? నీ బలం ఎంతా? ఉన్నోడివుండకండా, నీపాటేదో నివ్వు పడకండా వూరి తగువులెందుకు నీకు? ఆ లొసుగుల్లో దూరడవెందుకు? నీ బతుక్కి ఇలాసాలేవిటి? మనం ఇలాసాలు చేసేపాటోళ్ళవా? ఆ పూటకి ఇంతన్నవూ, ఉండడానికి గూడూ ఉంటే సాలనిపించే జల్మలుగదా మనవి?"

వరాలు గుండె క్షోభిస్తోంది.

"ఏదో నారాయణ నీకింత నీడ కల్పించేడా? అయినా అదీ లేకండా పోయింది. ప్చ్!"

వీరేశు కదిలాడు. కళ్లు విడినాయి. చూశాడు వరాల్ని.

"వ... వరా ... లూ" అన్నాడు ఆశ్చర్యంతో.

మాట నూతిలోంచి వొస్తున్నట్టు వచ్చింది.

''ఇక్కడికెలా...వొచ్చేనూ?"

"నారాయణ తెచ్చిపడేసేడు"

వీరేశు ఆశ్చర్యం ఇంకా పెరిగింది.

"న్నారాయణా?"

వరాలు చెప్పింది – నారాయణ ఏ పరిసితిలో వీరేశుని ఎక్కడచూసి తీసుకు వచ్చేడో.

వీరేశు మొహంలో ఆశ్చర్యం మాయ మైంది. ...ద ఇప్పుడు లజ్జ తప్పా ఏం లేదు.

వరాలు కొంపలో ఉన్నదేంటో చూసి ఇంతన్నం వొండి పెట్టింది. వీరేశుకి. నింపాదిగ తినిపించింది. మొదట ఏం వొద్దన్నాడు. కసిరింది. తినకపోతే సచ్చి పోతావంది.

పలకలేదు వీరేశు.

"కోపం వొచ్చేసిందా న్నామీదా పొమ్మన్నాననని?"

వులకలేదు.

"చెప్పెవరిమీద నీ కోపం?"

"అందరిమీదాను. నామీదాను"

"అందుకనీ చచ్చిపోదారనుకున్నావా? అందరి పీడా వదిలిపోద్దనా?"

"మంచినీళ్ళియ్యి..."

తాగి పడుకున్నాడు వీరేశు.



10

వరాలు మరోసారి కోర్టుకి వెళ్ళి వచ్చింది.

సంగతులు చెప్పమన్నాడు వీరేశు.

నర్సింహులు జెయిల్లోకెళ్ళి, అక్కడే కూచోడానికి కావల్సిన విధంగా తను సాచ్చీకం చెప్పేసంది వరాలు.

వాడు పెళ్ళాన్ని చంపేయాలన్న తలంపుతోనే, కసిగా నేలమీదికి బలంగా తోసేసి చంపేసేడని చెప్పింది. అలా చంపేస్తే ఇంక దాని పీడ వాడికి విరగడవుతుందని అలా చేసేడనిచెప్పింది. ఆ తర్వాత పెళ్ళాం పోరులేకండా, వరాల్ని పెళ్ళి చేసేసుకోవచ్చని వాడి ప్లానని చెప్పింది. అయితే భగవంతుడనేవాడొకడు వున్నాడు కాబట్టీ, ఆయినంతా చూస్తానే వుంటాడు కాబట్టి...నర్సింహులు ప్లాను నెగ్గలేదన్నాది. నర్సింహులు పిల్లలు, వరాలు ఒక్కుమ్మడిగా ఇచ్చిన సాక్షాలని బట్టి కోర్టువాళ్లు నర్సింహులుకి శిక్షవేశారు.

'కొంతకాలందాకా ఆడి పీడ తన కుండద'ని తృప్తిపడింది వరాలు.

నర్సింహులి పిల్లలకి తండ్రి మీద కోపం, కసి ఎప్పటినించో వున్నాయి. వాళ్ళముందే వాడు తాగొచ్చి తందాన లాడ్డం, పెళ్ళాన్ని చావగొట్టడం-వాళ్ళలో ఒక విధమైన ద్వేషాన్ని, పగని రగిల్చేయి.

వూహించని స్థితిలో తల్లి చని పోయింది. తండ్రి జెయిలుకెళ్ళాడు. పిల్లలు నిరాధారంగా వుండిపోయారు. కొంచెం పెద్దపిల్లలు పనీ పాటూ చేసుకో గలిగేవాళ్ళు కూలీనాలీ చేస్తూ తక్కిన పిల్లల్ని పోషించడానికి పూనుకున్నారు. వరాలు వాళ్ళల్లో ఇద్దర్ని తనతో వచ్చి వుండమంది. రామని చెప్పేశారు వాళ్లు. ఆపాటి గెంజీ, వణ్ణివూ తాము తినలేని రోజున వస్తామన్నారు!

వరాలూ,వీరేశూ ఆ పిల్లల పౌరుషానికి ఎంతో ఆశ్చర్యపోయారు.

"వయసుకి చిన్నోళ్ళే అయినా పౌరుషానికి పెద్దోళ్ళు" అన్నాడు వీరేశు.

"అదంతేలే. అమ్మ పరపతీ, అయ్య తిరపతీగా వుంటే పిల్లలు చాకుల్లాగే వుంటారు. ఆళ్ళు అన్నీ అవిర్చి, ముద్దు జేస్తే పిల్లలు మట్టి ముద్దలేనా అవుతారు, రవుడీ ఎదవలేనా అవుతారు"

"మరి నా సంగతేటి ?" అన్నాడు వీరేశు.

"నీదోరకం. ఎర్రి ఎయ్యి ఇదా లన్నట్టూ నీదో ఇద్దం. గాలికి పెరిగిన గాలి గొడ్డువి నువ్వు. ఎటేగాలేస్తే అటేపు ఎళ్ళి పడ్తావు"

మొత్తానికి నర్సింహులు పీడ తప్పిం

దని వరాలూ, వీరేశూ చాలా సంతోషించారు.

"ఆడు బైటికొస్తే నామీద కోపం తీర్చుకోడూ?" అంది వరాలు.

"అప్పటి సంగతది. ఇప్పుడెందుకా వూసు? ఆ సరికి మనం ఎక్కడుంటామో?"

"అదేటి? వూరిడిచి పోతావేటి? అలా అంటన్నావేటి?"

"మరనక ఇక్కడేటుందే మనకి? నీకు నాలుగిళ్లు వుండొచ్చు పాచిపనికి. నాకేటుంది చెప్పు? బడ్డీ అలా ఏడ్సిందా. నారాయణ వరాల్ని కట్టేసుకున్నావుగా, ఇంక నీ దోవేదో నివ్వే జూసుకో పొమ్మన్నాడా? ఇంకేంటుందే నాకాడెరు ఇక్కడ?"

కొంచం కోపంగా, ఎంతో విరక్తిగా చాలా విసుగ్గా అన్నాడు వీరేశు.

తనకి మాత్రం ఏటుందిక్కడ అనుకుంది వరాలు.

నాన్న పోయాడు. నెత్తుటిముడి వున్నోళ్ళెవరున్నారింక? మంచికో, సెడ్డకో ఈరేశు బతుక్కి తను లంపటం అయిపోయింది. ఇదింక ఇడదీద్దామన్నా ఇడదియ్యలేని ముడి. బతుకంతా ఈరేశుతోనే. కడుపులో పడింది వంతెన. ఒడ్డులు రెండయినా ఒక్కటే వంతెన.

అవాళ వరాలు వీరేశుకి తల పద్ది నీళ్లు పోసింది తనే. అప్పుడు వీరేశు ఒళ్లు పులకల్లో, గిలిగింతల్లో నిండింది. అంతదాకా తను ఎవరిచేతా నీళ్ళోయించుకోలేదు. చాలా మందికి అమ్మయినా తలంటి పోసాది. ఆలిఅయినా పోస్తాది. తనకి వరాలే పోసింది.

"ఏటలా బెకబెకలాడిపోతావు? సరిగ్గా కూకో. సరిగ్గ రుద్దనీయి" కసురుకుంది వరాలు.

ఎంత తిన్నగా కూచున్నా ఒళ్ళు ఒక్క పిసరు కుదురుగా వుండక యాతన పడ్డాడు.

వరాలు సాధింపులో చల్లదనం, వరాలు కోపంలో మెత్తదనం, వరాలు సామీప్యంలో తీయదనం వీరేశుకి ఇప్పటికి పూర్తిగా అనుభవానికివచ్చాయి.

అవాళ వరాలు రొయ్యలు వండింది. ఇగురు చేసింది. ఇష్టమైన తిండి. ఇంపైన వరాలు. అంతకంటే ఏం కావాలనుకున్నాడు వీరేశు అన్నంతిని పడుకుంటూ.

'ఏం కావాలింక?'

చప్పున భవిష్యత్తు వెన్ను తట్టింది. బడ్డీ గురుతొచ్చింది.

వరాలు వీరేశు మెదడుని మాత్రం ఆలోచనకి వదలి,వొంటిని తనుఆక్రమించుకుంది. మొదటిసారిగా తనంతట తను వచ్చి పడ్డ బంగారంలాంటి వరాలు పరిష్వంగంలో, బడ్డీ వూసు పత్తాలేకుండా పోయింది వీరేశుకు.

* * *

"తాళం ఏసేశావేంట్రా ఈరేశా బడ్డీకి?"

"అవును. అదే దానికి అవుసరం పడిందనీ..."

"మరెతే ఏం చేద్దారనీ?"

"ఏట్నేదు..."

"బతుకెలారా?"

"... ..."

"వొరాలుందనా? ఆడదాని సంపాదనెంతకాలం తింటావురా?"

వులిక్కి పడ్డాడు వీరేశు. మొహం ఎర్రబడింది.

"సూడు! మళ్ళా కావిడట్టుకో. అదే గదా నీకు మొదటిదారి! అంతకంటే ఇంకేటుంది?"

మళ్ళా కావిడి!

"కూచో! నిలబడి పోనావు. నారాయణ లేడు. పనిమీద ఎల్లేడూరికి. రేపొచ్చేస్తాడు. నిలబడి పోనావు, కూచో!"

వీరేసు నిలబడలేసట్టే బెంచీమీద చతికిలబడ్డాడు.

నారాయణ అసిస్టెంటు అప్పన్న వీరేసుని జాలిగాచూశాడు. "టీ తాగుతావా? తెప్పించనా?"

"ఒద్దులే..."

"ఏటలావుంది మొకం?"

"ఏట్నేదు..."

"వరాలు పెళ్ళి వూసెత్తనేదా యింకానూ?"

తలెత్తి చూశాడు అప్పన్నని.

"బిడ్డ తండ్రి వంటాగదా?"

"ఎవురు సెప్పేరు నీకు?''

"ఎర్రిమొకవాని! కడుపులూ అయీ ఒకళ్లు పనిగట్టుకుని సెబితేనే ఇనాలంట్రా? ఆడంగులు ఇట్టే యినపర్మిసను లాగీసార్లే. నోళ్ళూ, చెవులూ ఏకం అయిపోతే ఏ మూలకెళ్ళదు భోగట్టా?"

నోరెత్తలేదు వీరేసు.

"తొరగా ఆ వుస్తేదో కట్టి! మెళ్ళో ఏటీనేకుండా, కడుపుల బిడ్డేటని కులాయి కాడ అమ్మలక్కలు సెవులు కొరుక్కుంటున్నారుట!"

గుండె బరువెక్కింది.

"సవ్వనీయి! మా కాడకొచ్చి అడగమను సెప్తాం!"

"అంతేగానీ ఆ పని చెయ్యనంటావు?"

వీరేసు అప్పన్నని కోపంగా చూశాడు.

"నీకు పన్లేకపోతే ఆళ్ళకాడకిపో! పోయీ సువ్వూ కోసుకో - ఆళ్ళవో, నీవో..." అని లేచి నడిచాడు.

"రేయ్, ఆగరా!" అప్పన్న కేకేశాడు.

"వెందుకూ? నన్నేం కొరక్కు!"

"కోపం అయిపోకరా! ఒకమాట యిను! యింటావా? యింటానంటే సెప్తాను"

''ఏటది"?

"నారాయణ బడ్డీతీ సేసుకుంటాడంట! తెల్సా నీకూ"

"అలాగ్గా?"

"అవూసింకా నీకేం చెప్పనేదా నారాయణా?"

"నేదు..."

"సెప్తాళ్ళే! నీకు ఇదే సెప్దారని పిల్చేను...ఎళ్ళిరా!''

వీరేసు రెండు చేతుల్తో, రెండు వేపులా గుండెల్ని తడువుకున్నాడు బాధగా, విచారంగా.

వరలుతో చెప్పుకున్నాడు గుండె గోడుని.

ఒకమాటకది మండిపడింది.

"ఎవురాళ్ళు? కులాయకాడ అమ్మలక్కలా? నాతో కూడా కూసేర్లే! బేగా పుసెకట్టించేసుకోమని. నాకు పుస్తె నేకపోతే ఆళ్ళ పుస్తెలు తెగినట్టూ ఎందుకో ఆగోల!నా కొళ్లు మండిపోయీ మీకెందుకు నా వూసని అడిగాను!

"ఆ మాటకి - 'తప్పమ్మాయీ! పుసె నేకపోతే సానోళ్ళకీ, మనకీ ఏటి తేడా?' అన్నారు. సూడెంతమాటన్నారో! రోడ్డుమీద, అంతమంది మద్యన ఏంటి జగడం ఆడను? అదేం సినీమావూసా కిందా మీదా పడ్డానికి?"

"వరాలూ !రేపు మనం గుడికెల్దారి"

"గుడికా?"

"అవునే ... ఎంకటేశ్వరుడి గుడికి. అక్కడ దేవుడిముందు నీక్కట్టేస్తాను.."

వరాలు ఆశ్చర్యంగా చూసింది.

"ఏబైతే చేయించేవేటి పుస్తెలు? కొన్నావా?"

తలొంచుకున్నాడు వీరేశు.

"నా స్తోమత నీకు తెల్దేటే?"

ఇప్పుడు వరాలు తలొంచుకుంది.

"పసుపుకొమ్ము కడ్తానే..."

పసుపుకొమ్ము సూత్రం కాదా? పచ్చగా పదికాలాలపాటు కాపరాన్నది నిలపదా?

ఇద్దరూ ఆ సాయంత్రం వెంకటేశ్వరుడి గుడికి వెళ్ళారు.

వరాలు పూజారికి అయిదు రూపాయిలు ఇచ్చింది.

అదే తమ పెళ్ళికి బ్రాహ్మడికిచ్చే కట్నం!

దేవుడెదుట పసుపుకొమ్ము సూత్రధారణతో వీరేశుకి, వరాలుకి పెళ్ళి జరిగిపోయింది. తమకి కలిగినంతలోనే ఆరోజు ఇద్దరూ పెళ్ళివేడుకని జరుపుకున్నారు. నారాయణ దగ్గరికి వెళ్ళి చెప్పాడు వీరేశు తమ పెళ్ళి గురించి. నారాయణ నవ్వి, జేబులోంచి పది రూపాయలు తీసి, "ఇది నా కట్నం.." అని ఇచ్చాడు.

అక్కడికి వీరేశు మనసు పరవశించింది.

తను ఏదేనా జయించలేకపోవచ్చు.

కాని – వరాలు ప్రేమని గెలుచుకున్నాడు.

ఈ తృప్తిచాలు! ఈ భాగ్యంచాలు!

ఒకరికిద్దరు తోడయితే మనసుకి బలం ఎక్కువౌతుంది. అదే ఒంటికీ బలం.

వరాలు కుండపట్టుకుని వీధి కుళాయికి వెళ్ళింది.

దాని మెళ్ళో వేలాడుతూన్న పసుపు కొమ్ముని ఆశ్చర్యంగా చూశారక్కడ ఆడవాళ్ళు. "మాకు సెప్పాసెయ్యకండా ఎప్పుడు చేసేసుకున్నావే పెళ్ళి?"

"ఎందుకూ మీకు సెప్పడం?"

"ఓలమ్మ అదేటే? అంతిరగబాటూ!"

"మీకెందుకూ సెప్పడం? నన్నంత లేసి మాటలన్నందుకా? పుస్తె నేక పోయినంతమాత్రాన నాను సానాన్నయి పోయేనా? ఛీ! ఇంకా సెప్పాలంట సెప్పడం. సిగ్గునేకపోతే సరి"

ధుమధుమలాడ్తూ కుండనింపుకుని, వెళుతూ అంది వరాలు. "సాపత్యం ఉండాలంటే ... కసింత మరియాదగా ఉండాల. మాటని చూసుకు ఆడాల. వింత కాలం నించీ నా పుట్టుకతెల్సి, పెరగడం తెల్సి, నా స్వభావంతెల్సి మీరంతమాటన్నారు.సర్లెండి మీ గుణం తెల్సింది మాకు. ఇలాంటి మడుసుల మధ్యన వుండడవూ మాక్కష్టవే. ఇయాలోటి అన్నోళ్ళు రేపింకో సెద్దమాట అననేటుంది?''

కాస్సేపు కుళాయిదగ్గర నిశ్శబ్దం నిండింది.

* * *

"వరాలూ"

"ఏం?"

"ఇయ్యాల ఇంకో భోగట్టా తెలిసిందే!"

"ఏటది?"

"నారాయణ బడ్డీమీద తన కొడుకుని కూచోపెట్టేడే. మళ్ళాబడ్డీ తెరవబడదనుకున్నాను...కానీ..."

వరాలు వీరేశవంక సానుభూతిగా చూసింది.

"నీకింకా ప్రాణం అటే లాగుతోందా ఈరేశా?"

"మర్నాగదేంటే? ఇంతకాలం నించీ నేను కూకున్న బడ్డీయా?" విచారం వీరేశ స్వరంలో గమకాలు పలికింది.

"మొన్ననో మంత్రి కుర్చీ ఎక్కుతాడు. అది దైవయిపోతే దిగి పోతాడు. మల్లా ఇంకోడెక్కుతాడా మానాడా?"

వీరేశ వరాలు వంక చూస్తున్నాడు. ఆ కళ్లు విచారంతో నిండివున్నాయి. తన వసువు నెవరో దొంగతనం చేసినట్టు, తనెదురగానే ఆ దొంగ ఆ వస్తువుని అను భవిస్తున్నట్టు – బాధపడుతున్నాడు.

"నానన్నదరద వైందా నేదా?" అడిగిందివరాలు.

"అయింది..."

"అయితే ఇంకూరుకో! అంతే! నీ దై వయిపోయింది అనుకో! అలాగను కుంటే ఏ బాదా నేదు..."

"నువ్వింత సులాగ్గా సెప్పేసేవు కానీ..."

"కానీనేదూ. అర్దనానేదూ... కానీల కాలాన్ని తేకు! ఎక్కనీయి! ఎవుడెక్కితే నీకేం? నీకు మల్లా పిల్చి, దండేసి, అదెక్కించడుగదా నారాయణా? అత గాని సుదుపది!"

"నాదీ కొంత వాటా వుందే..."

"అది ఇంత కాలంవూ నివ్వు దాని మీద తిన్నదానికి సరి! కావలిస్తే ఎల్లి డగు! నారాయణా ఆ ముక్కే సెప్తాడు! అయినా బడ్డీన్నివ్వే మూసేసి వొదిలేసి నావు గదా? ఇంకెందుకు మల్లా బాధడి పోతావట్టాగా?"

'నా బాధ నీకు తెల్దే!' అనుకున్నాడు వీరేశ మనసులో

బైటకి వెళ్ళకుండా వుండలేడు. వెడితే బడ్డీవేపు చూడకుండా వుండలేడు. చూస్తే బాధపడకుండా వుండలేడు.

అన్నాళ్ళు తెరవబడివుండి తననది యాతనెట్టింది!

కొన్నాళ్ళు మూతపడి యాత నెట్టింది.

ఇప్పుడు ఇంకోడి అధీనమయి యాత నెడుతోంది.

బైటకెళ్ళకండా ఎలా జరుగుద్ది?

సంపాదించడానిక్కాపోయినా, సంసా రాన్నడపడానికెళ్ళాల అవతలకి! పొయ్యి కిందికి, పొయ్యి మీదికి వొస్తువులు కొని తేవడానికెళ్లాల! వరాలు పాచిపని చేసి సంపాదించిన డబ్బులే ఇద్దరి కడుపుల్ని నింపుతున్నాయి. దాని నెల జీతాలూ, రోజూ అంతో యింతో ఆ ఇంటోళ్ళిచ్చే అన్నవూ, కూరా నారాతో ఏదో రోజులు గడిచిపోతున్నాయి. అయితే ఎంతకాలం ఇలాగ?

నారాయణ అసిస్టెంటు అప్పన్న ఏట న్నాడు?

"ఆడదాని సంపాదన్తో వెన్నాళ్లు తింటావురా?" అన్నాడు.

ఎంత మాటన్నాడూ? తనెంత బాద పడిపోయేడలాగన్నాడని?

ఆడి నోరెందుకలా కూసిందీ?

తన చేతకానితనం చూసేనా...?

వీరేశ ఆలోచిస్తున్నాడు.

'బడ్డీ వూసొదిలేయి!' అనుకున్నాడు.

దానికి, తనకి యిడాకు లైపోనాయి!

తరవాత మాటేటి?

మల్లా కావిడట్టుకోవడమేనా??...ప్చ్!

ఒట్టుకోకపోతే ఎలా గ......?
చూశాడటు.

మూలన పడివుంది కావిడి, డబ్బాలు.

వాటిమీద పేరుకున్న దుమ్ము దులిపాడు.

వరాలు చూసి– "ఏంటి ఆటి స్త్రీసేవు, మళ్లా మోస్తావా నీళ్ళు?" అంది.

"వూ..."

"ఓపికుందా?"

వీరేశు నిమిషం వుక్రోషపడ్డాడు. తర్వాత తమాయించుకున్నాడు. ఇదే ప్రశ్న లోగడ ఇదే అందని తను ఎంతో కోపం అయిపోయేడు! ఇప్పుడందులో ఏదోకొంతే వొచ్చింది! వరాలు దగ్గరయితే కోపం కొంచెం కొంచెం దూరమవుతోంది దాని మాటలకి!!

"మోస్తానే ! ఓపికెందుకునేదూ? నువ్వే తెగమేపుతున్నావా? తిండం తప్పా నాకేం పనీ? ఒళ్లు ఇలా తినీ తొంగుంటే వూరిపోతాదే! పనీపాటూ సెయ్యాల! జరుగుబడీ అవ్వద్ది!"

వరాలింకేం అనలేదు అప్పటికి.

"ఎక్కువిళ్లు ఒప్పుకోకు!" అనిఅంది– తర్వాత వీరేశు కావిడి పట్టుకు బయల్దేరుతూంటే.

పూర్వం తను వాడుకలు పట్టిన ఇళ్ళకి వెళ్ళాడు వీరేశు. రెండిళ్ళవాళ్లు

ఇంకెవరినో నీళ్ళ వాడుకలకి పెట్టుకున్నామని, ఇప్పుడు వీరేశు అవసరం లేదని చెప్పారు.

వుసూరుమనిపించింది వీరేశుకి.

వాళ్ళకి నిత్యం నీళ్లు అవసరం అయినప్పుడు-వాడుకకి పెట్టుకున్నవాళ్లు మానేస్తేంటే, ఆ లోపాన్ని ఇంకొకళ్ల ద్వారా భర్తీ చేసుకుంటారుగానీ వూరుకుంటారా? తన ఇష్టం పడినప్పుడు వెడితే వాళ్ళెలా వాడుక పెట్టుకుంటారు - అనుకున్నాడు విచారిస్తూ. ఇంకో ఇంటికి వెళ్ళాడు. వాళ్ళ వీధివాకిట్లోనే పెపు కనిపించి, సమాధానం చెప్పేసి, పొమ్మంటే వచ్చేశాడు.

బతకడానికి తోవలన్నీ మూసుకుపోయేయి!

వీరేశుకి తను ఒక చీమలా, దోమలా, చిన్న పురుగులా కనిపించాడు. బుర్రొంచుకుని బెల్దేరాడింటికేసి...

దోవలో నారాయణ కనిపించాడు.

"ఏట్రా ఎటుకేసి? ఏంటి ... షాపు కాడికొచ్చినావటా? అప్పన్న జెప్పేడు.. ఆరోగ్యం సరిగుందా విప్పుడూ?"

బుర్ర వూపాడు.

కిళ్ళీబడ్డీ మళ్లా తెరిచినట్టు చెప్పాడు నారాయణ. తన కొడుకునందు మీద కూచోపెట్టానన్నాడు.

"ఆడికి చదువు సరిగ్గా రావడం నేదురా! అందుకని ఏదో పన్లో ఎట్టేయాలనుకున్నాను. బడ్డీ మీదెక్కమన్నాను. ఎక్క కూచున్నాడెదవ ఎంతో సంతోషంగాను.. అదీగాక లోను తీర్చాలి గదరా! మూసుంటే ఎలాగ?"

చెవులు వింటున్నాయి-మనసు మరాం చేస్తున్నా.

"మొన్నారి కెళ్లేనా! మా వూళ్ళే. డబ్బు కోసవనీ.. అక్కడ కొంచెం పొలం చెక్కుందిలే! అదమ్మేసినాను... మరేటి సంగతులు? వరాలు బాగుందా? దానొంట్లో...."

బుర్ర వూపాడు.

నారాయణ వీరేశు వద్దంటున్నా కాకా హోటలికి లాక్కెళ్ళి టీ పోయించాడు.

"ఏటిలా బెల్దేరినావేటి? కావిడేటి, డబ్బాలేటి? మాల్లా డూటీకెల్దారనా? ఎనకటిదే?"

"వూఁ..."

"కుదిర్నాయా వాడుకలు?"

"నేదు..."

"ఒక్కటేనా?"

బుర్ర తిప్పాడడ్డుగా.

"ఏంటో నీ గ్రెహచారం! అదిబాగుంటే తక్కినయన్నీ బాగుంటాయి..." అని ఆగి,

"ఎల్తానారే ఈరేశా" అంటూ వెళ్ళిపోయాడు నారాయణ.

"ఏటైంది?" అడిగింది వరాలు.

చెప్పాడు వీరేశు.

"ఒక్కిల్లు కూడా నేదా వాడిక్క? ప్చ్! ఏంటో మ్రినాత!"

పంచె కట్టుకుని, ముడుకుల మీదికి ఎగ్గట్టి నేల మీద పడుకున్నాడు. వరాలు మంచినీళ్లు ఇచ్చింది. వాటిని చూసి నిట్టూర్చాడు. తాగేక ఆఖర్న వుండిపోయిన చుక్కల్లోకి, అంతే లెక్కన కళ్ళల్లోంచి నీళ్లుపడి కలిసాయి.

"వరాలూ! ఒకమాటంటారు మనోళ్లు తెల్సా?"

వరాలు ప్రశ్నార్థకంగా చూసింది.

"కంచంలో పెట్టిన అన్నాన్నలా వొదిలేసిపోతే, మళ్ళా మన కంచంలోకది రాదని.... అలాగా నీళ్ళని వొదిలీసేనా?

 

ఇప్పుడు నీళ్ళ మోత కోసం చూసే అది అందుబాటుకి రాకుండా పోనాది! ఒకదాన్ని నమ్ముకున్నాడు మంచికో, సెడ్డకో, నాజానికో, నస్టానికో దాంతోనే పడుండాలి! ఇప్పుడీ తెలివి పుడితే ఏట్నాబం?"

"కావలనొదిలేసినావేటి నీళ్లు?"

"......"

"జరక్కా వొదిలీనావుగాని..."

రాత్రి వీరేశు కలలో...

నీళ్ళు, నీళ్ళు. ఇల్లు నిండిపోయీ, వాకిలి నిండిపోయీ, వీధులు నిండిపోయీ, వూరే నిండిపోయీ...

ఎటు చూసినా నీళ్ళే!

వానొచ్చిందా,వరదొచ్చిందా?అదేవో! తెలీదు.

ఎట్నుంచి వచ్చేయో నీళ్ళన్ని? జనం గాభరా పడిపోయి, భయంతో కేకలు వేస్తూ, పరిగెడుతూ కొంతమంది నీళ్ళల్లో పడి మునిగిపోతూ, ఆక్రందిస్తూ...

వీరేశు కూడా నీళ్లల్లో పడిపోయి కొట్టుకుపోతూ, పెద్దపెద్ద కేకలెయ్యసాగాడు. అంత బెదురులోనూ, అలజడిలోనూ వరాలు కోసం చూశాడు. నీళ్ళల్లోంచి ఒకసారి వరాలు తలలేచి కనబడింది! అటేపు ఈది వరాల్ని పట్టుకున్నాడు. దాన్ని మోస్తూ కష్టపడి ఈదుతున్నాడు. ఒడ్డు కనిపించడంలేదు! ఒడ్డేదీ? ఎలా...ఎటు చేరాలి?

కల కరిగిపోయింది.

తెలివి వచ్చేక, కొంతసేపలా వుండిపోయాడు. చెమట పట్టేసింది ఒళ్లంతా. ఎంత భయంకరమైన కలది!

కల చెప్పాడా వుదయాన వరాలుకి-

"మనచుట్టూ నీళ్లేనే! మనం మునిగిపోతన్నాం!"

విన్నాది వరాలు.

"ఒడ్డీ ఇంకా కనిపించనేదే, అదేటో?"

"మన భయాలే మన కలలీరేశా!" అంది వరాలు.




"వరాలూ! గంగులొస్తన్నాడే!"

వీధి గుమ్మంలోంచి వీరేశు లోపలికి ఒక్కంగిలో వచ్చి పడ్డాడు.

"ఎవరూ రావడం?"

వంట చేస్తోంది వరాలు. గరిటెతో లేచి అడిగింది.

"గంగులే! గంగులు గోడు"

"అదా! ఏటలా భయపడిపోతున్నావేటలాగ? పులో, భూతవో, పావో వొచ్చిపడినట్టూ? రానియ్యి ముండా కొడుకుని..."

'అవ్వ!నాసిరియ్యా...' అనుకున్నాడు వీరేశు.

రానే వచ్చాడు గంగులు.

"రేయ్,ఈరేశా! ఉన్నావా కొంపల?" కేకేశాడు.

"ఎళ్లు! మరేం పర్వానేదెంతకాలం బయ్యంపడి సస్తావలాగా. ఎళ్లు!"

వీరేశు 'అవునెళ్తా. ఏటిసేస్తాడాడ్నన్ను?' అనుకున్నాడు.

అడుగు తరవాతడుగేసుకుంటూ అటు వెళ్ళాడు.

గుమ్మంలో ఆకారం గుండెని కీచు మనిపించినా చేత్తోదాన్ని నిమురుకొంటూ నిబ్బరాన్ని వెనకనించి అరువు తెచ్చుకున్నాడు.

'అవునెంతకాలం బయ్యంపడి సస్తా నీడికి?' అనుకున్నాడు చికాగ్గా.

గంగులు పలకరించాడు నవ్వి. వాడలా నవ్వితే అది వెటకారంగా అనిపిస్తుంది వీరేశుకి. ఆ వెధవ నవ్వులో కాంతం కనిపిస్తుంది! దాంతో తను జరిపిన రాసలీల కనిపిస్తుంది ! అప్పుడు గంగులు తనని పట్టుకుని బెదిరించడం కనిపిస్తుంది.దాంతో గుండె ఠారెత్తి పోతుంది. చేతులు కాళ్ళాడవు. ఆడేకా ఆడిమాటే యింటా మంటాయి!

బెదిరి సర్దుకున్నాడెలాగో. "ఏంటి వని?!" అన్నాడెలాగో.

"నానెందు కొస్తా[నా. నీకాడికి?"

"పీక్కుతిండానికి వొస్తావు!"

"నా పెళ్లాన్ని నువ్వు పీక్కుతిన్లేదురా?"

తుళ్ళిపడి చూశాడు వెనక్కి, వరాలు ఆ మాట విందేమోనని. అదటేపు తిరిగి వుంది. చెవులెటున్నాయో మరి!

"ఓరే! నాకరిజెంటుగ డబ్బు కావాలా! ఏభయిరూపాయిలు కావాల! నీకాడుంటే యిచ్చి! నిన్నేం పీక్కుతిన్ను!"

"నాకాడ డబ్బునేదు. ఒకేల వున్నా యివ్వను...!"

గంగులు కనుబొమ్మలెత్తి, కళ్ళు చికిలించి అదోలా చూశాడు వీరేశని. "ఏ[టోయ్! మాసెడ్డ బిగురుతున్నావే?! ఆ!ఏంటాధెయిర్నవూ!?ఉన్నా యివ్వవా?"

"ఇవ్వనూ...ఇవ్వనూ! ఇవ్వనూ! అంతే..."

"ఇయ్యవ్, నిజెంగా?" దగ్గరగావచ్చి అడిగాడు గంగులు.

"ఇవ్వను!" అని వెనక్కిచూసి, అక్కడ వరాల్ని చూసి, "నీ దిక్కున్న చోట చెప్పుకో పో!" అన్నాడు వీరేశు ఇటు తిరిగి గంగుల్తో.

"ఏటి! కోడలా!ఏటి? మనీరేశుకన్నం పెట్టనేదేటి. అగ్గిర్రుడుడై పోతున్నాడేటిలాగా?" వరాల్ని చూసి అన్నాడు గంగులు ఇంకా నవ్వుతూనే.

వరాలుకి అప్పటికే గుండె మండుతోంది.

"ఇంతకాలం నించీ అగ్గిర్రుదుడవక పోబట్టే నీ ఆటలా సాగిందనీ, ఇంకా సాగించడం మంచిది కాదనీ, అగ్గిర్రుదుడై పోనాడు మరీ?"అంది కోపంగా చూస్తూ.

గంగులు వరాలువంక ఆశ్చర్యంగా చూశాడు. తెల్లబోయి చూశాడు. "ఏటంటన్నావు కోడలా? ఈరేశని ఎనకేసుకొస్తన్నావా? ఆడిని కట్టేసుకున్నావన్న మాటయితేనూ?" అన్నాడు.

జవాబివ్వలేదు ఇద్దరూ.

"బాగున్నాది. శానా బాగున్నాది! పతి[వత మొగుడువొరికేడని పరమానంద పడిపోతున్నావా కోడలా! ఆడెంత లుచ్చానాకొడుకో నీకసలు తెల్దు!"

"నోరు ముయ్యి" కసిరింది వరాలు వెంటనే.

"ఓసీ! నా నోరు ముయ్యాలా? నా నోరెందుకూ-ఆడితో తిరిగిన కాంతం నోరు మూయించు. ఆడాటలు బావున్నాయా...నా ఆటలు కట్టిసాట్టనాయా!"

వరాలు చప్పున వీరేశువేపు చూసింది. ఆ కళ్లల్లో కోపం, అవమానం, అనుమానం, బాధ కనిపించాయి వీరేశుకి. కలవరపెట్టాయి.

"ఏదిగో! ఆడుకాదు నానగ్గిర్రు దుడవా లసలు. కాంతం ఎవరనుకున్నావ్? నాదీ! నా భార్య! గొప్ప ఇల్లాలు. అలాటి దాన్ని ఈనాకొడుకు మాపేడు. చెప్పు! ఈడిన్నేనేటి సెయ్యాల? నేను నిజంగా గొప్ప మనసుగలోణ్ణి గనకా 'పోనీలే' అనిచెమించేస్తన్నాను.నన్నింతఅన్యాయం చేసినోడు, నా అవుసరానికెందుకు పనికిరాకపోవాలని ఆడిసేత టిక్కట్లమ్మించి డబ్బు మాత్రం పుచ్చుకుంటున్నాను. రా రా నాకొడకా! నాకు చేసిన అన్యాయానికి నామాటినాల్సిందే! రాయ్!"

"ఆడు రాడు. నువ్వెళ్లు!"

"ఏటీ? నామాటసలిన్నావా?"

"ఆహా! అంతా యిన్నానులే ఎళ్లు..."

"ఏటింత నమ్మకం ఎట్టుకున్నావేటీడి మీదా? అయితే నానన్నదంతా అబద్ధవే?"

"నీ మాటలు నేన్నమ్మను. నువ్వు ఎలాంటిపన్లు చేస్తంటావో ఏటో నాకంతా తెల్సు! ఎలా ఎన్ని యిదాలా డబ్బులు గడించొచ్చో నీకు బాగా తెల్సు! అందుకు ఇలాంటోళ్ళని బాగా వుపయోగించుకుంటావు!"

"ఏటిపిల్లా! జాగ్రగగ మాట్లాడుసుమీ. నాకు తిక్కరేగిందంటే దేవుడి ఖాతర్నేదు!" గంగులు గర్జించేడు.

"నాకు తిక్కరేగిందంటే పదిమంది దేవుళ్లు దిగొచ్చినా ఖాతర్చేదేటనుకున్నావో. పో! ఇంక మాటలాడకింక! నీ మూడు ముక్కలూ, బ్లాకెట్లూ, బ్లాకులూ అన్నీ మాకు బాగా తెల్సుగానీ ఎళ్లు"

"మొగుడు మొగుడన్నమ్మితన్నావేవో! ఆడ్నిన్ను ముంచేసి ఇంకో కాంతం కాడికి పోగలు!"

"పోయినప్పుడు సూద్దాల్లే! ముందు నివ్వుపో!...వూ!"

వురిమిందీ వరాలు

"ఏదిగో! ఏటలా బెల్లం కొట్టిన రాయిలా వుండిపోనావేటి? ఎందుకిడికి జడిస్నావాల? మొగాడివి గదా! రావని సెప్పు! మళ్లా రావొద్దన్నెప్పు"

వీరేశు గుండె పౌరుషంతో నిండింది. కోపంతో పూడుకుంది. గబగబా వెళ్లాడటు.

"పోరా! పో! వూరంతా డప్పేసి చాటుకోరా! ఒక్క వరాలికే కాదురా! నారాయనతో కూడా సెప్పుకోరా! ఇంకా కనిపించని దేవుళ్ళక్కూడా సెప్పుకో. నేన్నీకేదో అన్యాయం చేస్తే నని నన్ను యింతకాలంబట్టి పీక్కుతింటున్నావు గదూ! ఏట్రా? నేన్చేసిన అన్యాయంవూ? పదరా! కాంతాన్నడుగుదాం పదా."

గంగులు నోరూ, కళ్ళూ తెరుచుకుపోయేయి.

'ఈరేశేనా ఈడూ?!'

"దాన్ని నా మీదకి తోసిందెవురో దాన్నే అడగరా!"

వెర్రెత్తినట్టే అరవసాగాడు వీరేశు. ఇంతకాలంనించీ లోపల పేరుకుపోయిన కోపం ఇప్పుడు ఫెళ్ళున మూతవూడి, బయటికి వుబికింది.

"నన్నేం చేస్తావురా! ఏటిసేస్తావు? విన్నాళ్ళూనివ్వుబెదిరించింది నారాయణకీ, వరాలికీ ఆ సంగతి చెప్పేస్తాననే గదా? సెప్పుకో. వందమంది వరాళ్ళకీ, ఎయ్యిమంది నారాయన్లకి సెప్పుకో! ఎవ్వరూ నన్నిప్పుడేం సెయ్యనేరు"

అప్రయత్నంగానే అడుగు వెనక్కి పడింది గంగులుకి.

"ఒరే! నాన్జడిస్సచ్చేననే గదరా మీరంతా నన్ను మీ సేతుల్లో పెట్టి

ఆటాడుకున్నారూ? నాకిప్పుడెవరి భయాలూ లేవు. ఎవ్వరిలోనుగులూ లేవు. నా ఒంటికస్టం పడితే తింటాను. నేకపోతే తొంగుంటాను!"

వీరేశు కళ్ళు అగ్నిగోళాల్లా వున్నాయప్పుడు.

ఇద్దరు సూర్యుళ్ళు వుదయించేరేమోననిపించింది వరాలుకి వీరేశు మొహాన్ని చూసే. తనూ జడిసి వీరేశుకి కొంచెం దూరంగా వెళ్ళింది.

వీరేశు గబగబా లోపలికి వెళ్ళాడు.

కావిడి బద్ద తీసుకువచ్చాడు.

వరాలు జడిసిపోయింది.

ఎందుకది తీసుకువచ్చేడీరేశూ? కొంపదీసి కోపంలో దాంతో గంగుల్ని కొడతాడా?! గుండె గుభిల్లుమంది వరాలుకి. "ఈరేశూ!" అంటూ వెళ్ళి కావిడి బద్ద లాక్కుంది.

"స్సె! నువ్వుండు" కసిరాడు వీరేశు. కావిడి బద్ద వరాలు చేతుల్లోంచి లాగేసుకున్నాడు.

"వొద్దీరేశా! నామాటినూ. నీ కోపం బంగారంగానూ అంత పన్చెయ్యకు. మళ్ళా పోలీసులూ, జెయిలూ అంతానూ" దడదడలాడుతోన్న గుండెతో వొణికిపోతోంది వరాలు.

వీరేశు చేతిలో కావడిబద్ద గంగుల్ని ఇంకో అడుగు వెనక్కి వేయించింది. నిజెంగా ఈడగ్గిరుద్రుడయిపోనాడేటి?! దాంతో తనని చంపుతాడేటీడు...??

వీరేశు కావడిబద్ద చేత్తో ఎత్తి పట్టుకున్నాడు.

"ఏదిగో సూడ్రా, ఇది నా కావడిబద్ద. ఇది నా కస్టం! దీన్నే మొదాట నమ్ముకున్నాన్నేను. ఇప్పుడు దీన్నే నమ్ముతున్నాను. ఇక్కడీ వూర్లో నాకు నీళ్ళవాడుకలు దొరక్కపోవచ్చు. కానీ ఎక్కడా దొరక్కపోవు! నీళ్ళున్నంత కాలం, దానవుసరిం వున్నంత కాలం, నా ఒంట్లో ఓపికున్నంతకాలం ఇది నాక్కూడెడతాది..!

"ఒరే సెప్పరా, ఎవురేం సేస్తార్రా నన్ను? నానెవురికి బాకీల్రేనా! వరాల్ని మనువాడేను. దానికీ, బిడ్డకీ బాకీవున్నాను. అంతే...మేవిద్దరం. మాకస్టం మాదీ! అదెవురిసొత్తు కాదు. ఇదిగో మాదీ. మాసొత్తిది!"

నుదుట్న పట్టిన చెమట చేత్తోతీసి అటు విసిరికొట్టాడు వీరేశు.

ఆసరికి గంగులు పదిగజాల దూరానికి వెళ్ళిపోయాడు.

* * *

"నానెళ్ళిపోతన్నాను..."

"ఏటి?"

"నానెళ్ళిపోతన్నాన్నారాయణా!"

నారాయణ క్షణం వీరేశువంక ఎగాదిగా చూశాడు. "ఎళ్ళిపోతన్నావా? ఎక్కడికంట?"

"ఇంకో వూరికి.."

"ఏ వూరు?"

"ఏవో! రెళ్ళెక్కుతాము. దిగాలనిపించిన వూళ్ళో దిగేస్తాం..! మావిద్దరం ఎక్కడ సరిగ్గా బతగ్గలిగితే అక్కడే బతుకులు తెల్లారించీస్తాం! అదే నిశ్చయానికొచ్చీనాము! ఎక్కడుంటే అదే మాకు నిలవనీడ!"

"ఇక్కడ నీళ్ళ వాడుకల్లేవనా?"

వీరేశు నారాయణని చూశాడుతిన్నగా. 'ఇక్కడ నాకేటుందసలు చెప్పు' అనడిగాయి ఆ కళ్ళు.

"అయితే అదే నిశ్చితానికొచ్చినా

రన్నమాట?"

"వూ..."

"ఈరేశా!"

"ఏం?"

"నా న్నీ కేం సె య్య నే క పోతున్నా[నా!"

"సేసింది చాలు నారాయణా!"

నారాయణ కనుబొమలు కల్సు కున్నాయి క్షణం.

"అంటే? ఏట్రా నివ్వంటన్నది?"

వీరేశు సరుదుకున్నాడు.

"నువ్వ నన్నాదుకోలేదా నారాయణా? ఇంతవోణ్ణి సెయ్యేనేదా? కావిడివ్వనేదా? అంతమట్టుకెవ్వరు సేస్తారు. ఆ వుపకారాన్ని నానెప్పుడూ మరిచి పోన్నారాయణా!"

నారాయణ వీరేశుని కావిలించుకొని వదిలాడు.

"వొద్దు వొద్దు" అంటూంటే బలవంతంగా పదిరూపాయలు మడిచి జేబిలో కూరేడు నారాయణ.

"ఎల్తాను..."

ఇంటి దగ్గర వరాలు మూటా, ముల్లే కట్టేసింది.

అసరికి తను పనిచేసిన ఇళ్ళవాళ్ళకి వెళ్ళి, చెప్పేసి వచ్చిందిలా వూరెళ్ళి పోతున్నానని.

వీరేశు వొస్తూ తలెత్తి చూశాడటు.

బడ్డీ కొత్తరంగు వేయబడి మెరిసి పోతోంది. లోపల చాలా సరుకులు నిండి కనిపిస్తున్నాయి. రేడియో కూడా మోగుతోంది. జనం రద్దీగానే వెడుతున్నారు బడ్డీ కాడికి.

బరువయిన గుండెలోంచి నిట్టూర్పు వెలువడింది.

గబగబా నడిచేడు మొహాన్ని తిప్పుకొని.

"వరాలూ! తెవిలిసట్టేగదా?"

వెళ్ళి రిక్షా మాట్లాడుకొని వచ్చాడు.

దాంట్లో సామాను పెట్టేశారు. ఎక్కి కూచున్నారు.

అప్పటికి కొంచెం చీకటి పడింది.

వూరు వెనకపడుతోంది కొంచెం, కొంచెం.

తమ ఇల్లు దాటి, ఇంకొన్ని వీధులు దాటి, వాట్లో ఇంతకాలం తిరిగిన అనుభవాల్ని దాటి, జ్ఞాపకాల్ని దాటి, వుద్రేకాల్నిదాటి, అవమానాన్ని దాటి...దాటి వెడుతోంది రిక్షా. వెడుతున్నారు వీరేశూ, వరాలూ.

'ఈ వూరేం ఇచ్చింది తనకి?'

వీరేశు మనసుని అడిగాడు.

'ఒక పాఠాన్నిచ్చింది. ఇంకా వరాల్నిచ్చింది' అవిచాలు. మిగిలిన జీవితాన్ని, భవిష్యత్తుని నిబ్బరంగా సాగించడానికి.

ఇక్కడ 'నీడ' కోసం తను ఆశ పడ్డాడు. ఆరాటపడ్డాడు. దక్కలేదది.

తనకి కాకుండా పోయిందాని కోసం ఇంకా ఇంకా వుండి, ఎదురు చూడ్డం తెలివితక్కువ.

ఒకదారి మూసుకుపోతే, మరోదారే దొరకదా ? మరోచోట......ఎక్కడ తామిద్దరూ నిబ్బరంగా బతికితే అదే తమ నెలవు.

రిక్షాలోంచి...

రైల్లోకి మారేరు వీరేశూ, వరాలూ.

చల్లటిగాలి మెత్తగావచ్చి వరాలు చెయ్యిలా వీరేశు చెంపని నిమిరింది.

హాయిగా కళ్లు మూసుకున్నాడతను.



# ప్రేమిస్తే..!

మూర్తి



అత్యంత పురాతనమయిన వాటిలో ప్రేమ ఒకటి. మానవ మనుగడ మొదలయినప్పటినించీ కొన్ని కోట్లాది అబ్బాయిలు అమ్మాయిలని ప్రేమించడం జరిగింది. అయినా "నేను నిన్ను ప్రేమిస్తున్నాను. నన్ను పెళ్ళి చేసుకుంటావా?" అనే రెండు ప్రశ్నలని సూటిగా అడిగే ధైర్యం లేని అబ్బాయిలు అధికంగానే వున్నారు ఈ రోజుల్లో కూడా. గమ్మత్తయిన పద్ధతుల ద్వారా తమ ప్రేమని అమ్మాయిలకు వ్యక్తం చేసి వాళ్ళచేత సరేననిపించుకొన్నారు అలాంటివారు కొందరు.

న్యూయార్క్‌లోని ఓ యువకుడు పబ్లిక్ టెలిఫోన్‌లో, చిల్లర వున్న పెద్ద సంచీతో దూరి, ప్రతి అయిదు నిముషాల కోసారి తన ప్రియురాలికి వుదయంనించి రాత్రిదాకా ఫోన్ చేస్తూ "నన్ను పెళ్లి చేసుకోవా" అంటూ ప్రాధేయపడ్డాడు.

అలా 200 టెలిఫోన్ కాల్స్ చేయ

డానికి ఆ మహానుభావుడికి 80 డాలర్లు ఖర్చయ్యాయి. అయితేనేం చివరికి ఆ అమ్మాయి పెళ్ళికి ఒప్పుకుంది.

వియన్నాలోని బ్రెడ్ తయారుచేసే వ్యాపారస్థుడొకడు తన ప్రియురాలికి ప్రతీ రోజు వుదయం హృదయం ఆకారంలో వున్న చాక్లెట్ కేక్‌ని తయారు చేసి పంపేవాడు. కొన్ని వారాల తర్వాత ఆమెకి అర్థమైంది – ఆ వ్యాపారస్థుడు తనని ప్రేమిస్తున్నాడని. అంతే! అతన్ని వివాహం చేసేసుకుంది.




సౌత్ ఆఫ్రికాలో ఓ యువకుడు మాట్లాడే చిలకనొకదాన్ని తెచ్చి దానికి "మేర్లన్ సువు లేకుండా బతకలేడు" అనే మాటలని నేర్పించాడు. మేర్లన్ ఆ చిలకని తన ప్రియురాలికి బహూకరించాడు. అనుకున్న ప్రకారం చిలక రాయబారం జరిపింది. వారిరువురికీ ఘనంగా వివాహం జరిగింది.

అమెరికాలోని ఓ రైతు కొడుకు తన ప్రియురాలికి తన ప్రేమని వ్యక్తం చేయడానికి ఓ కొత్త పద్ధతి అవలంబించాడు. రోజూ వుదయం లేచి తమ గ్రామం పక్కనే వున్న కొండమీద అందమయిన పువ్వుల మొక్కల విత్తనాలని చల్లి, అవి జాగ్రత్తగా పూసేలా చూడసాగాడు. కొద్ది కాలంలోనే మొక్కలు మొలకెత్తి పువ్వులుపూసాయి. తన ప్రియురాలి పేరు రాసి ఆ అక్ష




రాల మీద విత్తనాలు నాటడంతో పువ్వులు అతని ప్రియురాలి పేరులా కనిపించాయి గ్రామంలోంచి చూసే వారికి. ఆమెకి సంగతి అర్థమైంది. అతన్ని ఆనందంగా వివాహం చేసుకుంది.

* * *

పెళ్ళిళ్లు స్వర్గంలో అయ్యాయనే సామెత వుంది. భూమిమీదకి వచ్చాక మళ్లీ విడాకులు తీసుకుంటూంటారు అలా పెళ్ళయినవాళ్లు. విడాకుల చట్టాన్ని అందరికీ అందుబాటులో వుండేలా సవరించబడ్డ విదేశాలలో విడాకులు పొందడానికి కారణాలు ఏమైనా కావచ్చు. ప్రతి పదిమంది దంపతుల్లో సగటున ఒకరు విడాకులు తీసుకునే అమెరికాలో విడాకుల కారణాలు చాలా గమ్మత్తుగా వుంటుంటాయి.

# న్యూట్రమూల్ 'మొనగాడ'వండి
# బలానికి దారాసింగ్ చెప్పే పాఠాలు

**పొడుగును పెంచే కసరత్తు.**
కుడిభుజాన్ని గోడకు ఎదురుగా పెట్టి నిలబడండి. ఊపిరి పీలుస్తూ వేళ్ళ మీద పైకిలేస్తూ, ఎడమ ముంజేతిని పైకి విసరుతూ వీలైనంత ఎత్తుగా గోడను తాకండి. ముందటి స్థానానికి తిరిగివస్తూ ఊపిరి వదలండి. దీన్నే, ఎడమ ముంజేతితో 10 సార్లు కుడి ముంజేతితో 10 సార్లూ చెయ్యండి.



పాదాల మధ్య 10 అంగుళాల దూరం వుండేలా నిల్చోండి. ఊపిరి పీలుస్తూ, వేళ్ళ పైన పైకి లేస్తూ, ముంజేతుల్ని, వేళ్లు తలపైకి వచ్చేదాకా వీలైనంత ఎత్తుగా విసరండి. ముందటి స్థాయికి తిరిగి వస్తూ ఊపిరి వదలండి. దీన్ని 10 సార్లు చెయ్యండి.



కాళ్ళను తిన్నగా పెట్టి నేల మీద కూర్చోండి. కాళ్ళను వీలైనంత ఎక్కువ ఎడంగా పెట్టండి. ఊపిరి పీల్చే టప్పుడు ముందుకు వంగండి. తల చేస్తూ, ఎడమ మోకాళ్ళకు తగిలేలా పాదాన్ని రెండు చేతులతో తాకడానికి ప్రయత్నించండి. మొదటి స్థాయికి తిరిగి వస్తూ ఊపిరి వదలండి. దీన్నే 10 సార్లు ఎడమ పాదంతో 10 సార్లు కుడి పాదంతో చెయ్యండి.



ప్రతి రోజూ ఒక కప్పు న్యూట్రమూల్ తాగి బలాన్ని పొందండి. న్యూట్రమూల్‌లో మీరు యిష్టపడే సమృద్ధి అయిన అమూల్ పాలు, మేలైన మాల్ట్ ఆరోగ్యాన్నిచ్చే విటమిన్లు ప్రొటీన్లు ఖనిజాలు. అదికూడా చాక్లెట్ రుచితో. తల్లులు తెలుసుకోవలసిందేమిటంటే, న్యూట్రమూల్ ధర, బోర్నవిటా, బూస్ట్, మాల్టోవాకన్న తక్కువ అని.





గట్టితనం పొందే మార్గంలో న్యూట్రమూల్ మీకు సహాయం చేయసింది– ఆరోగ్యంగా, మీరు చేసేవన్నీ గొప్పగా కనిపించేలా, గొప్పగా చేసేలా కూడా. న్యూట్రమూల్ మొనగాడవటం అంటే అదేమరి.




daCunha/GCM/69/82/TL

అమూల్ వారి
# న్యూట్రమూల్

అమ్మకందారులు:
గుజరాత్ కో-ఆపరేటివ్ మిల్క్ మార్కెటింగ్ ఫెడరేషన్ లిమిటెడ్ ఆనంద్, గుజరాత్.



పద్దెనిమిది నెలల వివాహానంతరం ఓ భార్య విడాకులకి అప్లికేషన్ పెట్టుకుంది. కారణం-తన భర్త 'అతి మంచితనమే'. అతను ఆమెని కాలు కదపనివ్వడు. ఇంటి పనంతా తానే చేస్తాడు. వెచ్చాలు తేవటంనుంచి, వంట చేసి పాత్రలు కడిగి బోర్లించడంవరకు అంతా అతనే చేస్తాడు- తన భార్య కష్టపడకూడదని. కొత్తలో బాగానే ఉండేది కాని రాను రాను ఆ భార్యకిది భరించరానిదిగా తయారైంది. అన్నీ విన్న జడ్జి ఆమెకి సానుభూతి తెలియచేసి విడాకులు మంజూరు చేశాడు.

మరో వ్యక్తి భార్య విడాకులని కోరింది. కారణం-ఆవిడ భర్త రోజూ ఆమె నవ్వాలనే కోరికతో ఆమె అరి పాదాలకి చక్కిలిగింతలు పెడుతుంటాడు. నవ్వలేక బాధతో అరుస్తున్నా చక్కిలిగింతలు పెడుతూనే ఉంటాడా ప్రబుద్ధుడు. అదేమిటయ్యా అంటే "సరదా" అన్నాడు కోర్టులో. కోర్టు విడాకులు మంజూరు చేసేసింది.

సెక్స్ కూడా విడాకులకు దారి తీసింది అనేక సందర్భాల్లో. 'ప్రతి రాత్రి ఆరుసార్లు సంభోగం జరుపుతాడు నాభర్త. ఇది భరించలేను' అన్న ఓ భార్యమీద జాలిపడి జడ్జి విడాకులు మంజూరు చేస్తూ, "మరో పెళ్లి చేసుకుంటే చేసుకో. కానీ మళ్లీ అలా చేయకు" అని ఆమె భర్తని మందలించాడు.

మరో కేసులోకూడా సెక్సే విడాకులకి కారణం. ముప్పైయ్యేళ్ల భార్యకి ఆమె భర్తనించి విడాకులు ఇచ్చాడు జడ్జి. కారణం - రోజూ ఆఫీసుకి వెళ్లబోయే ముందు ఆమె భర్త పీపిలోంచి ఆ రోజు రాత్రి ఆమెతో ఎన్నిసార్లు సంభోగం చేయదలచుకున్నాడో గట్టిగా అరిచి చెప్పి మరీ వెళ్లాడు. ఇరుగుపొరుగు వాళ్ల ముందు తల ఎత్తుకోలేని పరిస్థితి ఏర్పడింది ఆమెకి.

'నా భర్త నాతో వాదానికి దిగడు కాబట్టి విడాకులు కోరుతున్నాను' అని పిటిషన్ పెట్టిందో భార్య. భర్త ఏవిషయంలోనైనా కాదు కూడదంటే ఆమె వాదనకి దిగి గంటల తరబడి మాట్లాడుతుంది. అతను మాత్రం నిశ్శబ్దంగా ఆమె వంక చూస్తూకూర్చుంటాడు. గోడతో మాట్లాడినట్లే ఉండేదామెకు. జడ్జి విడాకులు మంజూరు చేసాడు.

* * *

ఫ్రాన్స్‌దేశంలో సెయింట్ జాన్ అనే గ్రామంలో ఆడపిల్లలకి పెళ్ళీడు వచ్చి చాలాకాలం అయినా వివాహం కావటం లేదు. 1969 నించి ఎవరికీ వివాహం కాలేదు. ఆరుసంవత్సరాలతర్వాత, అంటే 1975లో గిల్‌మద్ అనే ఆ గ్రామస్థుడు వాళ్ళ వివాహ విషయంలో జోక్యం చేసుకున్నాడు ఆరేళ్లు ఎవరికీ వివాహం కాకపోవడం ఆ గ్రామానికే అవమానకరమయిన విషయం అనుకున్నాడు. తానే పూనుకున్నాడు.

పెళ్ళికొడుకులని ఎలా పిలవడం? 1975 ఈస్టర్ శెలవులకి తన గ్రామంలో లవ్ ఫెస్టివల్ - ప్రేమోత్సవం ఏర్పాటు చేస్తున్నాననీ, వివాహానికి సిద్ధంగావున్న అబ్బాయిలంతా రావచ్చనీ ప్రకటించాడు.

వార్తలు - ముఖ్యంగా ఇలాంటివార్త ఫ్రాన్స్‌దేశంలో దావాలనంలా పాకిపోతుంది. ఆ ఉత్సవంరోజు దేశం నలుమూలలనించి 2000మంది బ్రహ్మచారులు వచ్చారు.

గిల్‌మద్ తమ గ్రామంలో కన్యలంద




రికీ 'బ్రహ్మచారిణి' అని రాసివున్న బేడ్జిలు ఇచ్చాడు. అలాగే ఆ గ్రామానికి వచ్చిన కుర్రాళ్ళకికూడా 'బ్రహ్మచారి' అని రాసి వుండే బేడ్జిలిచ్చాడు.

ఆ శనివారంరాత్రి మద్యం బాగా ఖర్చయింది. నృత్యం, ఇతర వినోదాలు హుషారుగా సాగాయి. ఆ గ్రామంలో 22మంది బ్రహ్మచారిణులున్నారు అంటే సుమారు ప్రతీ ఒక్క అమ్మాయికి సరాసరి 100 మంది బ్రహ్మచారులొచ్చారు.

శని, ఆదివారాలు అబ్బాయిలు తమకి నచ్చిన అమ్మాయిలతో కలసి తిరిగారు. చిన్నవయసులో వున్నవాళ్ళనించి పెద్దవాళ్లుకూడా వున్నారు. పెళ్లికాని ఆడ, మొగవాళ్లలో ముద్దు నిషేధంకాదు కాబట్టి ప్రతీ అమ్మాయి దాదాపు ఆ 2000మంది చేత ముద్దుపెట్టుకోబడింది.

ప్రేమోత్సవం తర్వాత అబ్బాయి లంతా తిరిగి వెళ్ళిపోయారు. పెళ్లిళ్లు ఖాయంకాలేదు. ఒక్క పెళ్ళీ నిర్ణయింప బడలేదు. ఆ గ్రామంలోని బ్రహ్మచారి ఋలు అలాగే వుండిపోయారు. వారికి ప్రేమాభిషేకం జరుగనేలేదు పాపం.

జపాన్ దేశంలో ఇటీవల ఓ కొత్త రకం 'ఆడదళం' స్థాపించబడింది. ఆ దళం పేరు 'పింక్ పేంథర్స్'. వారు పింక్ రంగు హెల్మెట్‌ని ధరిస్తారు కాబట్టి వారి దళానికా పేరు వచ్చింది.

ఏ భార్యకయినా భర్త అన్యాయం చేస్తే వారు ఆ భర్త భరతం పడతారు.

ఓ కంపెనీ ఆఫీసర్ తన భార్యకన్నా తక్కువ వయసుగల ఓ యువతిని మరిగి భార్యని, పిల్లలని నిర్లక్ష్యం చేయసాగాడు.

ఈ సంగతి 'పింక్ పేంథర్స్'కి తెలిసి టోక్యో నగరం ప్రధాన వీధిలోని ఓ బిల్డింగ్‌లోగల ఆ కంపెనీ ఆఫీసుకి పరుగులు తీసారు అతివలు. దానిచుట్టూ చేరి కేకలు పెడుతూ ఆ భర్తని తిడుతూ గొడవచేసారు – పింక్ రంగు హెల్మెట్‌ని ధరించిన ఆ ఆడవాళ్లు.

'మగవాళ్ళంతా స్వార్థపరులైన దుర్మార్గులు. కాని వీడికన్నా దుర్మార్గులు ఈ లోకంలేడు' అని అంతా గొంతు కలిపి పాడసాగారు. దాంతో ఆ మిష్టర్ ఎక్స్ గారు రహస్యంగా ఆ భవంతిలోంచి బయటపడి మర్నాడు మొహం చెల్లక తన వుద్యోగానికి రాజీనామా చేసాడు. జపాన్ దేశంలో కాలు, చెయ్యి పోయినా బాధ పడరుకాని పరువు, గౌరవం పోతే బాధ పడతారు.

'పింక్ పేంథర్స్' స్థాపించబడేదాకా జపనీస్ భర్తలు తమ భార్యల్ని కొట్టే వారు. భార్యని కొట్టడంలో జపనీస్ భర్తలదే ప్రపంచంలోకెల్లా పైచెయ్యి.

అయినా భార్య అణిగి మణిగి పడుండేది ఇంతవరకూ. ఇప్పుడు తన భార్యమీద భర్త చెయ్యి చేసుకున్నాడని పింక్ పేంథర్స్‌కి తెలుస్తేచాలు, కొంప మునిగేలా ఉంది.

టోక్యో నగర పోలీసు శాఖలో పని చేసే ఓ వుద్యోగి తన భార్యని చావ బాదాడని తెలియగానే ఈ దళ సభ్యులు మైకులు పట్టుకుని సరాసరి అతని ఆఫీసు గదిలోకి వెళ్ళారు-అతన్ని తిడుతూ కట్టిన పాటని పాడుతూ. మరెన్నడూ తన భార్యమీద చెయ్యిచేసుకోనని మాట ఇచ్చే దాకా వదలలేదు ఈ పింక్ పేంథర్స్.

ఈ పింక్‌పేంథర్స్‌ని స్థాపించిన మహిళ పేరు మిసాకో ఇనోకి. ఈ దళంలో 40,000 మంది సభ్యులున్నారు. వారికందరికీ ఆయుధాలు లేకుండా పోరాడటంలో, అంటే కరాటేలో శిక్షణ ఇవ్వబడింది. ఏ మగాడైనా వారిమీద చెయ్యి చేసుకోదలిస్తే తమని తాము రక్షించుకోగలరన్నమాట.

* * *

'వద్దుర బాబు. పెళ్లొద్దుర బాబు' అన్నాడో తెలుగు సినిమా కవి. అమెరికా లోని అలెక్స్ జోసెఫ్ అనే పెద్దమనిషి మాత్రం 'పెళ్లాలు కావాలి'అంటాడెప్పుడూ. సదరు పెద్దమనిషి వయసు 44. ప్రయివేట్ డిటెక్టివ్‌గా పనిచేసే అలెక్స్ పన్నెండు మందిని–అంటే సరిగ్గా డజను మందిని పెళ్లాడాడు వరుసగా. అంతేకాదు– 13వ భార్య కోసం వెదుకుతున్నాడు ఇప్పుడు.

27 ఏళ్ళ ఎలిజబెత్ అతని భార్యలలో ఒకరు. ఆమె లాయర్. మరో భార్య బాంక్‌లో పనిచేస్తే, ఇంకో భార్య ఆర్ట్





టీచర్ ఉద్యోగం చేస్తోంది. భార్యలంతా తమ తమ సంపాదనని తీసుకొచ్చి అలెక్స్ చేతిలో పోస్తారు.

మిస్సోలా అనే ఓ ఇంట్లో ఆరుగురు భార్యలు, సాల్ట్‌లేక్ సిటీలోని ఇంకో ఇంట్లో మరో ఆరుగురు భార్యలు నివసిస్తున్నారు. కొంతకాలం ఇక్కడ, కొంత కాలం అక్కడా వుంటాడు అలెక్స్ మహాశయుడు.

భార్యలలో ఒకరిమీద మరొకరికి అసూయలాంటిదేం లేదు.

పదకొండు ఏళ్ళపాటు అలెక్స్ తన మొదటి భార్య షెర్లీతో అందరిలాగా మామూలుగా జీవించాడు. 1970 కల్లా ముగ్గురుని చేసుకున్నాడు. ఫలితంగా విడాకులిచ్చేసింది పెద్దభార్య. అలెక్స్ చర్చిలోకి ప్రవేశించడానికి వీల్లేదని ఆదేశించారు అధికారులు. 'నిజానికి చర్చికి రావడానికి ట్రిబుల్ డ్యూటీ చేసే నాకు టైంఏది. మరేం పర్లేదు'అన్నాడు అలెక్స్.

ఆ తర్వాత మరో 23మందిని వివాహం చేసుకున్నాడు. క్రమంగా వారిలో కొందరు విడాకులిచ్చేశారు తర్వాత్తర్వాత.

అతని భార్యల వయసు 33 నుంచి 10 దాకా వుంటుంది. పదేళ్ళ అమ్మాయి పేరు డాన్. అంత చిన్న వయసులోని అమ్మాయిని వివాహం చేసుకుంటే చట్టం ఒప్పుకోదు కాబట్టి ఇంకా వివాహ కార్యక్రమం మాత్రం పూర్తి చేయలేదు అలెక్స్.

అతనితో అతని పిల్లలు ఆరుమంది కలిసి వుంటున్నారు. రమోనా అనే భార్య వయసు 14. అందరికన్నా తక్కువ వయసు ఆమెదే. ఏరోజు రాత్రిళ్ళు ఎవ రెవరితో వుండాలో ఓ టైంటేబిల్ రాసుకున్నారు. ఆ ప్రకారం నడిచిపోతోంది కార్యక్రమం. కొత్తభార్య వస్తే ఆ టైం టేబిల్ మారుతుంటుంది. *

# చాతుర

## ఓ కూతురి తల్లి....!

ఓ యాభై అయిదేళ్ళ మాజీ నటీమణి విలన్ వెంటపడి తరుముతున్న హీరోయిన్లా పరుగెత్తుకుంటూ వెళ్ళి ఓ డాక్టర్‌గారి గదిలో దూరింది. ఓ పదిక్షణాలు ఆయాసపడి ఆ తరువాత డాక్టర్‌తో అంది.

"డాక్టర్...డాక్టర్... నాకు వెంటనే గర్భనిరోధక మాత్రలు కావాలి"

"మీ వయసుని బట్టి చూస్తే మీకు గర్భనిరోధక మాత్రల అవసరం వున్నట్టు కనిపించదు" డాక్టర్ తాపీగా అన్నాడు.

"కానీ అవి నా దగ్గర వుంటే నాకు చక్కగా నిద్రపడుతుంది" అంతకంటే తాపీగా అంది ఆమె.

"గర్భ నిరోధక మాత్రలతో నిద్రా...?" డాక్టర్ కంగారుపడిపోయి, చేతిలో వున్న స్టెతస్కోపు నేలకు జారవిడిచేశాడు. మళ్ళీ గాభరాపడిపోతూ "ఆ మాత్రల్లో నిద్రకు సంబంధించిన మందు అసలు వుండదు" అన్నాడు.

"అదంతా నాకు అనవసరం. వాటిల్లో నిద్రకు పనికివచ్చే అంశాలున్నాయా, లేదా అన్నది అంతకంటే అనవసరం" అంది నటీమణి. "నా కూతురు పెద్దదైంది. వేషాలకోసం తెగ తిరుగుతోంది. రోజూ రాత్రిళ్ల బయటకు వెళ్ళిపోతోంది. మరి వెళ్ళబోయే ముందు దాని నోట్లో ఓ మాత్రవేసి పంపితేనే గదా నాకు హాయిగా నిద్ర పట్టేది" అంది తాపీగా.

—గౌస్



# కతలు

## ప్రజాస్వామ్యం

ఛప్పన్న దేశాల్లో 'సుసంపన్నం' ఒకటి. దాన్ని మొదట్లో 'సంపన్నం' అనేవారు. అయితే అది తమ దేశపు స్థితి గతులను ప్రతిఫలించేదిగాలేదని నాయకులంతా కలసి, రాజ్యాంగ సవరణతెచ్చి 'సుసంపన్నం'గా మార్చారు.

అట్టి 'సుసంపన్న' దేశరాజధాని సత్సంపన్న నగరంలో, ప్రధాని మహాకర్ణుని అధ్యక్షతన ఛప్పన్నదేశాల ప్రతినిధులూ సమావేశమయ్యారు. పెరిగిపోతున్న ప్రపంచ జనాభా గురించి, ఆకలి చావుల గురించి ఆందోళన వెలిబుచ్చారు. రానున్న యుద్ధాల గురించి, మారణహోమాల గురించి భయాందోళనలను, సందేహాలను, విచారాలను వెలిబుచ్చారు. అలాగే అనేక దేశాలు జరిపే శాంతి యత్నాలను, ప్రజాసేవలను మెచ్చుకొంటూ సంతోషాన్ని వెలిబుచ్చారు. ఇంకా యింకా చేయాలని తీర్మానించారు.

చివరిగా 'సుసంపన్న దేశం' కొన్ని టన్నుల ఆహార ధాన్యాలను బడుగు దేశాలకు, ప్రపంచ శాంతి పథకం కింద పంపిణి చేయనున్నట్టుగా మహాకర్ణుల వారు ప్రకటించారు. అలాగే అపర కర్ణులు, వీరకర్ణులు, శూరకర్ణులు వారి వారి దేశ స్థితిగతులనుబట్టి శక్త్యానుసారం ప్రతిజ్ఞలు చేశారు.

చివరిగా బ్రహ్మాండమైన విందు






జరిగింది.

మర్నాడు పత్రిక[illegible] ఆ సభలను వేనోళ్ళ కొనియాడు[illegible] వార్తలు ప్రచురింపబడ్డాయి. 'సుసంపన్న' దేశపు దాతృత్వాన్ని కొనియాడుతూ, శాంతి బహుమాన గ్రహీత అయిన మరో సంపన్న దేశీయుడుగారు పంపిన సందేశం కూడా అన్ని పత్రికల్లో వచ్చింది. ఇంకా ఇలాంటి కార్యక్రమాల నెన్నింటినో 'సుసంపన్నం' చేపట్టాలనే వారి ఆకాంక్షనూ ప్రకటించేరు.

ఆనాడు జరిగిన విందును గురించి పత్రికలు బోల్డన్ని విశేషాలను కూడా ప్రకటించాయి.

కాని... 'అనాథ' అనే పత్రిక, ఆనాటి విందు జరిగిన తర్వాత విస్తళ్ళను, మిగిలిపోయిన పదార్థాలను గోడ మీంచి బయటకు గిరవాటు వేయగా వాటికోసం కాచుక్కూర్చున్న వందా యాభై మంది బిచ్చగాళ్లు మూకుమ్మడిగా కలియబడ్డారనీ, ఆ గలాటాలో నలుగురు మరణించారనీ వార్త ప్రకటించి ఆ కింద వారి మృతదేహపు ఛాయాచిత్రాన్ని కూడా ప్రచురించింది.

ప్రపంచ ప్రజాస్వామ్య శక్తులకు వ్యతిరేకంగా ప్రచారం చేస్తున్న ఆ పత్రికను 'సుసంపన్న' దేశ ప్రభుత్వం మూసివేయించింది. ప్రజాస్వామ్యంమీద ప్రగాఢ విశ్వాసంగల మిగిలిన పత్రికలన్నీ ప్రభుత్వం తీసుకున్న చర్యను హర్షంతో ఆమోదించాయి.

—వరిగొండ కాంతారావు

# వస నస

వెంకటేశానికి చిన్నప్పుడు వాళ్ళమ్మ ఓ పావు కిలో 'వస' పట్టించి వుంటుంది. ఎప్పుడూ తెరచిన నోరు మూయకుండా ఏదో ఒకటి వాగుతూ వుంటాడు. మాటలు మొదలు పెట్టాడంటే చాలు చుట్టుపక్కల వాళ్లు తనని గమనిస్తున్నారు, వింటున్నారన్నైనా లేకుండా ఒకటే ప్రవాహ వేగం. ఈ వాగ్ధోరణి భరించలేక డాక్టర్లు విసుక్కోవడంతో మెడికల్ రిప్రజెంటేటివ్ ఉద్యోగానికి తప్పనిసరిగ నీళ్ళు వదులుకోవల్సి వచ్చింది. ఇతగ్గాడి ధోరణి తెలిసిన ఏ మందుల కంపెనీ ఇతనికుద్యోగం ఇవ్వననడంతో గత్యంతరం లేక జీవిత భీ[illegible] కంపెనీలో ఏజెంట్‌గా చేరి తన వి[illegible] ప్రజల ముందు ప్రదర్శించి భీమా కంపెనీకి మంచి లాభాలు తెచ్చి పెడుతున్నాడు. ఓనాడు చిన్ననాటి స్నేహితుడు గిరిధారి కనబడితే ఇద్దరూ హోటల్లో దూరారు. శనివారం సాయంత్రమేమో హోటల్ చాలా రష్‌గా వుంది. ఆర్డరిచ్చిన ఇడ్లీ,దోశె సర్వరు తెచ్చేలోపల తనదస్త్రం విప్పాడు వెంకటేశం.ఆఫీసర్‌కి తన మీద వున్న నమ్మకం, కోటీశ్వరులు, లక్షాధికార్లతో తనకున్న పరిచయం, తను వస్తున్నట్లు నాలుగు వీధులవతల్నించే కనిపెట్టే అభిమానులు... అన్నీ అతని కబుర్లలో దొర్లుతున్నాయి.

ఇంతలో సర్వర్ ఇడ్లీ తెచ్చాడు. అది తింటూ "నువ్వు చెబితే నమ్మవు గాని గిరిధారీ నా బ్రీఫ్‌కేసులో ఈ క్షణాన రెండు లక్షల రూపాయలున్నాయంటే అదంతా నా స్వయం కృషి, పూర్వజన్మ సుకృతం అనుకో" అన్నాడు ఉత్సాహంగా. టిఫినూ, కాఫీ పూర్తయ్యాక గిరిధారికి గుడ్‌బై చెప్పి ఇంటిదారి పట్టాడు. శీతాకాలమేమో ఏడుగంటలకే బాగా చీకటి పడింది.





రిట్జ్ హోటలు దాటీ దాటగానే అతని వెనకే పొంచిపొంచి వస్తున్నతను హఠాత్తుగా కత్తి బైటికి తీసి "మర్యాదగా డబ్బు తియ్ బైటికి" అని వెంకటేశాన్ని బెదిరించాడు.

ముందు కాస్త భయపడినా క్షణాల్లో తేరుకుని "నా దగ్గర డబ్బేమీ లేదు" అన్నాడు బింకంగా.

"ఊఁ! ఊరికే ఎక్కువగా మాట్లాడి కాలయాపన చేయకు. ఇందాకా నువ్వు





చెప్పిన రెండు లక్షలూ ఎక్కడ? ఆ బ్రీఫ్ ఇలా ఇయ్యి" ముందుకు వంగి లాక్కోబోయాడు.

వెంకటేశానికి విషయం అర్థం అయిపోయి నవ్వుతూ తన బ్రీఫ్ తెరిచి చూపించాడు.

ఆగంతకుడు జేబులోంచి పెన్‌టార్చ్ తీసి చూస్తే ఏముంది.? ఓ కట్ట పాలసీ ఫారాలు. డబ్బు నయాపైసా లేదు.

—లక్ష్మి

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama, Offset Printers, Hyderabad. CHATURA Telugu Monthly. Eenadu Compound, Hyderabad - 500 004.

CHATURA Telugu Monthly, Hyderabad-500 004, Regd No. H/ HD /402